# భారతి


మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

మార్చి 1988

సంపుటము : 65 సంచిక : 3

విడిపత్రిక వెల ఐదురూపాయలు


---

## విషయానుక్రమణిక

### మార్చి - 1988

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

Amrutanjan Limited



# స్వవిషయం

భారతి మళ్ళీ వెలువడటం ఎందరికో సంతోషం కలిగిస్తున్నట్లు మాకు వచ్చే లేఖలే తెలుపుతున్నాయి. ఎవరికి తోచిన సలహాలు వారు ఇస్తున్నారు. అందరికీ మా కృతజ్ఞతని తెలుపుకుంటున్నాము. మాకు వచ్చే రచనలలో మంచివాటిని చదివేవారికి అందించటమే మా ధ్యేయం. కవిత్వం, విమర్శ, పరిశోధన, వ్యాఖ్య — భారతిలో ఈ రచనలకే ప్రాధాన్యం లభించే అవకాశాలు ఎక్కువ. ఏది ఏమయినప్పటికీ రాసేవారూ, చదివేవారూ సహకరిస్తేనే భారతి తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా నిలబడగలదు.

* * * * * *

కొంతకాలంగా ఆంధ్రపత్రిక సంస్థ ప్రచురించే వివిధ వార, పక్ష, మాస పత్రికలు వెలువడటంలో ఆలస్యం జరుగుతోంది. ఆలస్యానికి కారణాలు ఏమిటో వివరించే ప్రకటన ఒకటి భారతిలో వేరే చూడవచ్చు. పరిస్థితులు త్వరలోనే చక్కబడి భారతి సక్రమంగా వెలువడగలదని ఆశిస్తున్నాము.

* * * * * *

డా॥ ఇంగువ కార్తికేయశర్మగారు భారత దేశంలోని పురావస్తు శాస్త్రవేత్తలలో అగ్రగణ్యులు. వారు ఇటీవల కొంతకాలంకింద పెదవేగిలో తవ్వకాలు జరిపించారు. వాటి ఫలితాలని వర్ణిస్తూ డా॥ కార్తికేయశర్మగారు రాసిన పవిత్ర వ్యాసం త్వరలోనే భారతిలో ప్రచురించబడుతుందని తెలుపటానికి సంతోషంగా ఉన్నది.

ఆ వ్యాసం పఠితలలో తప్పకుండా ఎన్నోరకాల ఆలోచనలని రేకెత్తించేట్లుగా ఉండగలదు. డా॥ కార్తికేయశర్మగారు ప్రస్తుతం కొత్త ఢిల్లీలో ఉంటున్నారు....

# ఒక ముఖ్య గమనిక

ఆంధ్రపత్రిక ప్రచురణలు అయిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక, సినిమారంజని, కలువబాల, బాలరంజని, భారతి పత్రికలు గత కొంతకాలంగా ఆలస్యంగా విడుదల అవుతున్నా, పాఠకులు, ఏజెంట్లు, ప్రకటనకర్తలు ఎప్పటిలాగే తమ ఆదరాభిమానాలని, సహాయ సహకారాలని అందజేస్తున్నందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

అనివార్య కారణాలవల్ల ఈ ఆలస్యం జరుగుతున్నదంటే ఏమిటి ఆ కారణాలని చాలామంది అడుగుతున్నారు. అందువల్ల వాటిని వివరంగా తెలియజేయటం అవసరమని అనుకుంటున్నాము.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక ప్రత్యేకచట్టం ద్వారా ప్రభుత్వ భవనాల లీజ్‌ని రద్దు చేయటంవల్ల ఆంధ్రపత్రిక హైదరాబాద్ ఎడిషన్ ఉన్న భవనాన్ని కొన్ని సంవత్సరాల ముందుగానే ఖాళీచేసి దానిని వేరొక భవనంలోకి మార్చవలసి వచ్చింది. ఎదురుచూడని ఈ పరిస్థితి వలన అంతా అస్తవ్యస్తం అయి ఎన్నో ఇబ్బందులని ఎదుర్కొనవలసి రావటం, వ్యయప్రయాసలకి లోనుకావటం జరిగింది.

పత్రికల ప్రచురణలో ప్రకటనలు ముఖ్యపాత్రని నిర్వహిస్తాయి. చదివేవారికి అందుబాటులో పత్రికల ధర వుండటానికి ప్రకటనలు ఎంతైనా అవసరం. వాటిద్వారా రావలసిన డబ్బు సకాలంలో అందకపోతే ఎన్నో యిబ్బందులని ఎదుర్కోవాల్సి వస్తుంది. ముద్రణకి కావలసిన న్యూస్‌ప్రింట్ కాగితం ధర యిటీవలి కాలంలో ఊహించనంతగా పెరిగి పత్రికల మీద మోయలేని భారం పడింది. దానికితోడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతోసహా కొందరు ప్రకటనకర్తలు తాము విడుదల చేసిన ప్రకటనల తాలూకు డబ్బును సకాలంలో చెల్లించకపోవటంవల్ల, నిరవధికంగా వాయిదాలు వెయ్యటంచేత పరిస్థితి అస్తవ్యస్తం అయింది. ముద్రణకి అవసరమైన న్యూస్‌ప్రింట్‌కి ముందుగా డబ్బు కట్టి తీసుకోవాల్సి వుంటుంది. రావలసిన బకాయిలు సకాలంలో వస్తేనే పత్రికల ముద్రణ సక్రమంగా జరిగి ఎవరికి ఏ యిబ్బందీ కలగకుండా వుంటుంది. అందుకు అవసరమైన ప్రయత్నాలన్నిటినీ శక్తివంచన లేకుండా చేస్తూనే వున్నాము. త్వరలోనే ఆంధ్రసచిత్ర వారపత్రిక, సినిమారంజని, కలువబాల, బాలరంజని, భారతి పత్రికలు సకాలంలో విడుదల చెయ్యటానికి తగిన ప్రయత్నాలన్నిటినీ చేస్తున్నాము.

తాత్కాలికంగా ఏర్పడిన, ఈ అసౌకర్యాన్ని పాఠకులు, ఏజెంట్లు, ప్రకటనకర్తలు సహృదయంతో అర్థం చేసుకుని ఎప్పటిమాదిరే తమ ఆదరాభిమానాలని, సహాయ సహకారాలని అందజేయవలసిందిగా మనవి చేసుకుంటున్నాము.

వీలైనంత త్వరలో భారతిని సకాలంలో విడుదల చెయ్యగలమని అనుకుంటున్నాము.

—సంపాదకవర్గం

డా॥ మైనేని కృష్ణకుమారి

# మధ్యయుగములోని ఆంధ్రరాజ్యములు వాని రాజకీయ నిర్మాణము

రాజకీయ వ్యవస్థ, రాచరికము, పరిపాలనా వ్యవస్థలపై పరిశోధనలు సల్పిన పూర్వ చరిత్రకారులు భారతదేశములోని ప్రాచీన, మధ్యయుగములలోని రాజ్యములయొక్క రాజకీయ నిర్మాణములపై అంతగా శ్రద్ధాసక్తులు చూపలేదు. వారు ముఖ్యముగా పరిపాలనా వ్యవస్థను, వానిలోని వివిధములైన పరిపాలనా అంశములను సోదాహరణముగా విశ్లేషించుటకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చినారు. ఆయా రాజ్యములయొక్క ఉచ్ఛదశ, వాని పతనములను వారు రాజులయొక్క సైనికశక్తి, సైనిక విజయములపై ఆధారపడినట్లుగానే చిత్రించిరి గాని, వినూత్నమైన రాజకీయ నిర్మాణముల ప్రాతిపదికగా భావింపలేదు. కాని, గత ముప్పది సంవత్సరములుగా ఈ విషయములపై చరిత్రకారులు ఇతర శాస్త్రములతో కూడిన అధ్యయనముల ద్వారా కొంత సమగ్రమైన పరిశోధనలు సల్పినారు. వీరి కృషి ఫలితముగా, మధ్యయుగములోని హిందూ రాజ్యములు నాల్గు పద్ధతుల ద్వారా ఏర్పడినట్లు స్పష్టమగుచున్నది. యివి;

1. పటిష్ఠమైన కేంద్రముతో కూడిన పరిపాలనా వ్యవస్థ గల్గిన రాజ్యములు;[1]
2. అధికార వికేంద్రీకరణ ప్రాతిపదికగా నేర్పడిన ఫ్యూడల్ వ్యవస్థ;[2]
3. నామమాత్రమైన కేంద్రరాజుల సార్వభౌమత్వము - వ్యవసాయ సంఘము ప్రాతిపదికగా ఏర్పడిన స్వయంప్రతిపత్తితోనున్న చిన్న చిన్న రాజకీయ విభాగములలో - ముఖ్య స్థావరములలో కేంద్రీకృతమై, మధ్యప్రాంతములలో కొంత తక్కువగాను, సరిహద్దుప్రాంతములలో అంతగా లేనట్లుగాను సిద్ధాంతీకరించిరి.[3]
4. రాజ్యములు ఏర్పడుటలో ప్రాంతీయ పద్ధతులు రాజకీయముగా, సాంస్కృతికముగా రాజ్య సమైక్యతకు దోహద పడినట్లుగా కొందరు చరిత్రకారులు సిద్ధాంతీకరించిరి.[4]

పైనుదహరించిన విధానములన్నియు ఉత్తర భారత దేశములో (గుప్తులు; గుర్జర-ప్రతిహారుల పతనానంతరము), తమిళనాడులో (చోళరాజ్యము), మరియు ఒరిస్సాలో (గాంగుల రాజ్యము) ఏర్పడిన హిందూ రాజ్య నిర్మాణములలో ఉపయోగించబడినవి. అట్లు సిద్ధీకరించుటలో ప్రతి విధానము కూడా కొంత కాలపరిమితి, రాజవిస్తీర్ణములకు లోబడి వాడబడినది. ఈ వివిధ సిద్ధాంతములను అంగీకరించుటలో చరిత్రకారులు కొందరు భిన్నాభిప్రాయములు వెలువరించుటచే యిది అంతయు ప్రస్తుతము ఒక ముఖ్యమైన చర్చనీయాంశముగా మారినది.[5] ఈ నూతన విధానములను ఉపయోగించుటలో ప్రాంతీయ ప్రత్యేకతలు కొంత ఉపయోగకరముగాను, సవాలుగాను నిలిచినట్లు నిరూపించబడుటచే, మధ్యయుగములోని ఆంధ్ర రాజ్యములలో వచ్చిన రాజ్య, వంశానుగత మార్పులను హెచ్. కుల్కేగారు ప్రతిపాదించిన సమైక్యతా విధానము సహాయముతో విశ్లేషించి, ఆ విధానము మధ్యాంధ్ర రాజ్యముల నిర్మాణములకు ఎంతవరకు అనుసరణీయమో పరిశీలించుట ప్రస్తుత వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

ఒరిస్సాలోని తూర్పుగాంగుల రాజ్యము ఒక ప్రాంతీయ రాజ్యముగా మధ్యయుగములో రూపొందుటకు చిన్న, చిన్న రాజ్య విభాగములు స్వయంప్రతిపత్తితో ప్రాముఖ్యమును సంతరించుకొనినట్లుగా కాక, నిరంతరము సాగినటువంటి సమైక్యతా విధానమే కారణభూతమైనట్లుగా కుల్కేగారు అభిప్రాయపడిరి. అటువంటి రాజకీయ సమగ్రతను సాధించుటలో, ప్రాంతీయముగా ఆరాధింపబడుచున్న దేవుళ్ళను ఎన్నుకొని, వానికొరకై పెద్ద, పెద్ద దేవాలయములు నిర్మించుట, మరియు వారి రాజ్యావసరములను దృష్టిలో నుంచుకొని దేవాలయ నిర్మాణములు గావించుట ముఖ్యమైన అంశములుగా పరిగణించబడినవి.[6] భౌగోళికముగా చూచినచో కళింగ, ఆంధ్ర ప్రాంతముల మధ్య ప్రాథమికముగా ఎటువంటి తేడాను లేదు.[7] ఈ రెండు ప్రాంతములు భారతదేశము యొక్క తూర్పు తీర ప్రాంతములో మహానది, కృష్ణా, గోదావరీ నదుల పరీవాహక ప్రాంతములలో, సారవంతమైన మైదాన ప్రాంతములందున్నవి. సారవంతమైన ఈ ప్రాంతములు తూర్పు కనుమలతో చుట్టబడి మంచి ఖనిజసంపదను కలిగియున్నవి. ఈ సారవంతమైన ప్రాంతములన్నియు వేర్వేరు ప్రదేశములలో విడివిడిగా నుండుటచే రాజ్యాధికారములు కూడ వేర్వే

కేంద్రములలో నభివృద్ధి చెందినవి. క్రీ.శ. మొదటి శతాబ్దములో నేర్పడిన ఒరిస్సాలోని చిన్న చిన్న రాజ్యముల వలెనే, ఆంధ్రదేశము లోని తొలి రాజ్యములు కూడా నదీప్రాంతములలో, నదీలోయ ప్రాంతములోని మైదాన భూములందును, సముద్ర తీరస్థాంధ్రమ నందును ఏర్పడినవి. కృష్ణా, గోదావరీ నదులనుండి కొట్టుకువచ్చిన ఒండ్రుమట్టి వలన నీ ప్రాంతమంతయు సారవంతమై వ్యవసాయిక ముగా మంచి సుక్షేత్రమై వరిపంటను పండించుటకు అనువైనదిగా నున్నది.[8] అనంతపూరు-కడప ప్రాంతములు వేరుగానుండి సాంస్కృతికముగా తమిళనాడుకు చేరువలోనున్నది. కృష్ణ-తుంగభద్ర తీర ప్రాంతము కొంత తక్కువగానైనను వ్యవసాయమునకు అనువైనది. హైదరాబాదు-తెలంగాణా పీఠభూమియంతయు రాతిమయమై వ్యవసాయపరముగా తక్కువస్థితిలో నున్నది. ఈ వివిధ ప్రాంతము లన్నియు సవరలు, చెంచు, బోయ మొదలగు కొండజాతి ప్రజలకు ఆవాస స్థలములగు కొండలతోటి, అరణ్యములతోటి వేరుపరచబడి నప్పటికి, యివి అన్నియు నదులు, కాల్వల ద్వారాను, అడవులలోను, కొండలపైన పూర్వకాలమునుండి వాడుకలోనున్న మార్గములద్వారా కలుపబడి వున్నవి.

ఆంధ్ర శాతవాహనుల పాలనానంతరము వారి తర్వాత అధికారములోనికి వచ్చిన ఇక్ష్వాకులు, ఆనందగోత్రులు, శాలంకాయనులు, తొలి పల్లవులు, విష్ణుకుండినులు ఆంధ్రదేశములో వివిధ ప్రాంతములనుండి వారి రాజ్యాధికారమును నెరపిరి. వీరి పాలనా కాలములపై ఏకాభిప్రాయము లేనట్లుగానే వీరి అధికార కేంద్రములైన ముఖ్యపట్టణముల గురించి కూడా చరిత్రకారులలో ఏకాభిప్రాయము లేదు. కాని, ఆంధ్రదేశములో వేంగి ముఖ్యపట్టణముగా తూర్పు చాళుక్యుల రాజ్యపాలన ప్రారంభము కాగానే, కృష్ణా-గోదావరీ తీరప్రాంతమంతయు మధ్యయుగమునందు ఎక్కువ ప్రాముఖ్యతను సంతరించుకొన్నది.

తూర్పు చాళుక్యరాజులు తమ సైనిక విజయములవలనను, యిరుగు పొరుగు ప్రాంత రాజులయొక్క కుటుంబములతో నేర్పరుచుకొన్న వివాహాది సంబంధ-బాంధవ్యముల వలనను తమ రాజ్యములను దృఢపరుచుకొని, సామ్రాజ్యపరముగా ఎక్కువ ప్రాంతములను సమైక్యపరచుకొనిరి. పండరంగుని అద్దంకి శిలాశాసనము వలన తూర్పు చాళుక్యరాజగు మూడవ విజయాదిత్యుడు పండరంగుని ఆధిపత్యములో పెద్ద సైన్యమును పండ్రెండు (12) బోయ ప్రాంతముల పైకి దండెత్తించినట్లు తెలియుచున్నది.[9] మరియు నీ శాసనము వలన తొండైమండలము ఉత్తరభాగము, అనగా, ప్రస్తుతము వున్న నెల్లూరు, చెంగల్పట్టు మరియు చిత్తూరు జిల్లాలు బోయ అధికారుల అధీనములో వున్నట్లుగాను, మరియు నీ ప్రాంతములు చాళుక్య సైన్యముల వలన చాళుక్య రాజ్యాధికారము క్రిందికి వచ్చినట్లుగాను స్పష్టమగుచున్నది. దగ్గర వివాహ సంబంధముల కారణముగా తూర్పు చాళుక్య రాజ కుమారుడైన మొదటి కులోత్తుంగుడు చోళవంశము నిర్వీర్యము కాగా, చోళ సింహాసనమును సకల రాజ్యాధికారములతో నధిష్ఠించి, అతి పెద్ద రాజ్యములైన చాళుక్య-చోళ రాజ్యములను సమైక్యపరిచెను.[10] కేంద్ర ప్రభుత్వము సుదూరమున వున్న తంజావూరునుండి పనిచేయు చున్నను, ఆంధ్రరాజ్యమంతయును వేంగీదేశ రాజప్రతినిధుల అధికారముల వలనగాని, ప్రాంతీయ అధికారుల వలనగాని సమైక్యపరుచబడి, చాళుక్య-చోళుల సార్వభౌమత్వము ఆంధ్రదేశమంతటను నిర్విఘ్నముగా సాగినట్లు అనేక శిలాశాసనముల వలన తెలియు చున్నది.[11] మొదటి కులోత్తుంగుని రాజ్యకాలమున నీయబడిన పేకి తామ్రశాసనము ననుసరించి చూచినచో, ఆంధ్రదేశములో చాళుక్య చోళుల పాలన దక్షిణమున నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకా సింగరాయకొండనుండి ప్రవహించు మన్నేరు నదినుండి, ఉత్తరమున శ్రీకాకుళము జిల్లాలోని మహేంద్రగిరి పర్వతశ్రేణులవరకు వ్యాపించి నట్లుగా నున్నది.[12] మధ్యయుగములో ఏకీకృతమైన ఆంధ్రప్రాంతము యింతటి విశాల సామ్రాజ్యముగా విస్తరించుటకు ఆ రాజులు సామ్రాజ్యపరముగా, సాంస్కృతికముగా అవలంబించిన సమైక్యతా విధానములే కారణములు కావచ్చును.

ముఖ్యమైన శైవ పుణ్యక్షేత్రములగు పంచారామ క్షేత్రముల ద్వారా ఆంధ్రదేశములో మతపరముగాను, సంస్కృతిపరముగాను సమైక్యతను సిద్ధించినట్లు కన్పడుచున్నది. ఈ పంచారామ క్షేత్రము లన్నియు శివునికొరకు నిర్మించబడినవే. ఇవి తూర్పు గోదావరి జిల్లా లోని ద్రాక్షారామము, సామర్లకోటలలోను, పశ్చిమ గోదావరి జిల్లా లోని భీమవరములోను, గుంటూరుజిల్లాలోని అమరావతిలోను వున్నవి. ఈ దేవాలయములందు వైదిక ధర్మాచారముల ప్రకారము పూజాది కార్యక్రమములు నిర్వర్తించబడుచున్నను, ఈ దేవాలయ ప్రాంగణము లలో ప్రాంతీయ, మరియు గ్రామ దేవతలను ఆరాధించుటకు వీలు కల్పించుచున్నది. ఈ ఐదు దేవాలయములలో కూడ నతి శక్తివంతమైన ప్రాంతీయ దేవతామూర్తులైన సప్తమాతృక దేవతలను తిరు చుట్టు మాలికలోని చిన్న చిన్న కోష్టములలో ప్రతిష్ఠించుట కలదు.[13] ముఖ్యముగా, ద్రాక్షారామములోని భీమేశ్వరాలయమునందు శివుని దేవేరియైన పార్వతీదేవికంటె కూడ, మాణిక్యాంబ ఆ దేవాలయములో శివుని యిష్టసఖిగా నత్యంత ప్రాముఖ్యతను పొందినది. అచ్చట వాడుకలో నున్న స్థానిక కథల ప్రకారము మాణిక్యాంబ ఒక దేవదాసియైన స్త్రీగాను, భీమేశ్వరునిపై ఎనలేని ప్రేమ గలదిగాను తెలియుచున్నది. మాణిక్యాంబకు భీమేశ్వరునిపై గల ప్రేమభావము వలన భీమేశ్వరుడు ఆమెను తన పత్నిగా స్వీకరించెనట. అప్పటినుండి మాణిక్యాంబ

దేవతలచే స్థాపించబడిన అష్టాదశ మహాశక్తి పీఠములలో నొకటి యైనట్లు తెలియుచున్నది.[14] మధ్యయుగమునందు కులస్త్రీలతో పోల్చి చూచినచో దేవదాసీ స్త్రీలు సమాజములో కొంత తక్కువ స్థాయిలో నున్నట్లు తెలియుచున్నది. ద్రాక్షారామములోని భీమేశ్వరాలయమందు ప్రతిష్టించబడిన మాణిక్యాంబ విగ్రహము వలన, మాణిక్యాంబ దేవదాసి యైనను ఆమెకు శివునిపై గల అత్యంత ప్రేమ, భక్తిభావముల వలన నామె శైవమత సంప్రదాయములో ఒక దేవతగాను, శివుని భార్యగాను చేర్చబడినది.[15] యిదేగాక, ప్రాంతీయ దేవతలుగా కొలవబడుచున్న గ్రామదేవతలు కూడ దేవాలయ ప్రాంగణములలో చేర్చబడినారు. శ్రీనాథుని భీమేశ్వర పురాణము వలన ద్రాక్షారామములోని భీమేశ్వరాలయములో పశ్చిమ గోపురమునందు గోగులమ్మ, ఉత్తర గోపురమున మండతల్లి, తూర్పుగోపురమున నూకాంబ, దక్షిణ గోపురమున ఘట్టాంబిక మున్నగు గ్రామదేవతలు కొలువుండినట్లుగా తెలియుచున్నది.[16]

దేవాలయ ప్రాంగణములలో ప్రాంతీయ మరియు గ్రామదేవతలేగాక శిలలపై చెక్కబడిన అనేక నాగశిల్పములు, దేవాలయ స్తంభములపై మలచబడిన నాగప్రతిమలు, స్థలవృక్షములు కూడ నారాధింపబడినవి.[17] దీనినిబట్టి మధ్యయుగములో సామాన్య ప్రజా బాహుళ్యము కొలుచు కులదేవతలు, గ్రామదేవతలు పౌరాణిక దేవతలుగా రూపొందబడుటచే శైవమతము అత్యంత ప్రాచుర్యము పొందినట్లుగా తోచుచున్నది. ముఖ్యముగా, మధ్యయుగములో కొన్ని రాజ్య వంశములకు గ్రామదేవతలే ప్రధాన ఆరాధ్య దైవములుగా, కులదేవతలుగా నున్నట్లు ఆనాటి శాసనముల వలన తెలియుచున్నది. విద్యానాధుని ప్రతాప రుద్రీయముపై వ్యాఖ్యానము రచించిన కుమారస్వామి సోమపీఠి వలన వరంగల్లు రాజధానిగా పాలించిన కాకతీయ రాజులకు వారి వారి ఆరాధ్యదేవతయైన "కాకతి" అను గ్రామదేవత పేరు మీదుగా "కాకతీయు"లని పేరు వచ్చినట్లుగా తెలియుచున్నది.[18] క్రీడాభిరామమందు కాకతీయులు కాకతమ్మ, ఏకవీర అను దేవతలను ఆరాధించినట్లుగా వ్రాయబడినది.[19] అనవేమ మరియు పెద్ద కోమటి వేమారెడ్డిల అమీనాబాద్ శిలాశాసనమునందు గ్రామదేవతయైన మూలంగురమ్మ వారియొక్క ఆరాధ్యదేవత యైనట్లుగాను (కులస్వామిని), అఖిలలోకములకు జగన్మాతగాను ప్రస్తుతించబడినది.[20]

మధ్యయుగములో పంచారామ దేవాలయములు ప్రముఖమైన శైవక్షేత్రములుగా నభివృద్ధి చెందుటకు ముఖ్యముగా తూర్పు చాళుక్యులు, వారి తదనంతరము అధికారములోనికి వచ్చిన యితర రాజ్య వంశములే కారణముగా చెప్పుకొనవచ్చును. ఆ కాలమునాటి శాసనములను బట్టి చూచినచో చాళుక్య చోళరాజులకు ద్రాక్షారామములోని భీమేశ్వరుడే ముఖ్య ఆరాధ్యదైవము.[21] ప్రాంతీయ ఆచార వ్యవహారములు మత సంప్రదాయములు పెంపొందుటకు ముఖ్యముగా దోహదపడిన అంశముగా ప్రాంతీయ కథలు, కట్టుబాట్లు తెలుగునందు, సంస్కృతమునందు రచింపబడుటను చెప్పుకొనవచ్చును. దేవాలయ పుట్టు, పూర్వోత్తరములను చాటిచెప్పు అనేక స్థలపురాణములు, స్థల మహాత్మ్యములు అష్టాదశ మహాపురాణములలో నొకటియైన స్కాంద పురాణ జనితములుగాను, లేదా వానిలోని అంతర్గత భాగములుగాను చెప్పబడుచున్నవి. ఆయా ప్రాంతములలో జరుగు, లేదా దేవాలయములలో నిర్వర్తించబడు పండుగ సమయములందు ఈ స్థలపురాణములు, పుణ్యక్షేత్రములను దర్శించుటకు వచ్చు యాత్రికులచే చదవబడుట వలన సామాన్య ప్రజా బాహుళ్యమునకు వైదిక మతాచార సంప్రదాయములతో నిండిన శైవమతము మరింత దగ్గరగా, అందుబాటులోనికి వచ్చి వారికిని వైదికాచార పరాయణులగు శైవులకు మధ్య అంతరములు తగ్గి భక్తిభావముతో వారందరు ఏకీకృతులగుటకు కారణభూతములైనవి. ముఖ్యమైన దేవాలయములలో తరుచుగా జరుగుచుండు ఉత్సవములలో, ఆయా ప్రాంత గ్రామస్థులు అధికముగా పాల్గొనుచు ఒక విధముగా సమైక్యతను పెంపొందించేవారు. పంచారామ క్షేత్రములన్నియు ఒకే కాలమున నిర్మించబడనప్పటికిని భీమేశ్వర దేవాలయములున్న ద్రాక్షారామము, సామర్లకోటల గురించి వాడుకలోనున్న కథలు, గాథలు అతి తక్కువకాలములో అమరావతి, భీమవరము, పాలకొల్లు దేవాలయములకు విస్తరించి వాటితో కూడ ముడిపడుటచే పంచారామ క్షేత్ర జననము, వాటి మహాత్మ్యముల గురించి ఒకేవిధమైన కథలు వాడుకలోనికి వచ్చినవి. ఈ విధముగా ఆంధ్రదేశములోనున్న వేర్వేరు ప్రాంతములలోని దేవాలయ స్థల పురాణములన్నియు ముడిపడి ఒకే విధమైన ప్రాంతీయ పద్ధతులు సంప్రదాయములు అభివృద్ధి చెంది తద్వారా ఆంధ్రదేశమంతయు సమైక్యమగుటలో దేవాలయ స్థలపురాణములు ప్రముఖపాత్ర వహించినవి. ఈ విధముగా తలెత్తిన ప్రాంతీయ పద్ధతులు ప్రాంతీయ దేవుళ్ళను కొలుచుట, ప్రాంతీయ భాష, వాఙ్మయము, కులవ్యవస్థ మరియు దగ్గర సంబంధ బాంధవ్యములతో కూడిన వంశముల ప్రాతిపదికగా ప్రాంతీయతాభావముతో కూడినటువంటి రాజాధికార భయము పెంపొందుటకు ప్రోత్సహించినవి.[22]

మధ్యయుగములోని రాజులు నూతన దేవాలయములు నిర్మించుటకు బదులు అంతకు పూర్వమే నిర్మింపబడిన దేవాలయముల అభివృద్ధికి, మరమ్మతులకు పూజాదికర్మలు విరివిగా నిర్వర్తించుటకు ఎక్కువ ఆసక్తి చూపి వానిని పోషించిరి. ప్రజా బాహుళ్యములో చొచ్చుకుపోయిన భక్తిమార్గములు, దేవాలయ మత, ధర్మ సంప్రదాయములలో అందు నిర్వర్తించబడు పూజావిశేషములతోను చక్కగా కలిసిపోవుటచే అనూచానముగా వచ్చు వైదిక క్రతు కర్మాదికములనకు

ప్రాధాన్యము తగ్గి ప్రజలందరూ పాలుపంచుకొను పౌరాణిక ధర్మ వ్యవస్థకు ఆదరము హెచ్చి దేవాలయముల యొక్క ప్రాముఖ్యత హెచ్చెను. రాజ్యాధినేత మారినప్పుడు, నూతనరాజులు తమ అధికార మును తెలియపర్చుటకు కాబోలు, దూరప్రాంతములనున్న దేవాలయ ములలో కూడ దానశాసనము లొసగునట్లు చూసెడివారు. ఆయా ప్రముఖ మత కేంద్రములకు దేశము నలుమూలలనుండి ప్రజలు వచ్చి పోవుచుండుటచే నూతన రాజుయొక్క రాజ్యపాలన గురించి దూరప్రాంతములలో నున్న చిన్న చిన్న గ్రామములలోని ప్రజలకు కూడ ఆ వార్తలు తెలియుచుండెడివి. ముఖ్యమైన దేవాలయములలో రాజులు, వారి భార్యలు, అధికారులచే నీయబడిన భూమి, గ్రామ, దీప దానశాసనములను ఈ దృష్టితో చూచినచో రాచరిక వ్యవస్థ ప్రజా మోదము పొందుటకు రాజులు ఏ విధముగా కృషి చేసిరో స్పష్టమగు చున్నది. ప్రాంతీయ భాషలను గౌరవించి, తద్వారా అచ్చటి ప్రాంతీయులకు మరింత చేరువ కావలెనన్న ఆకాంక్షతో కాబోలు, చాళుక్య చోళరాజులు తమ దానశాసనములలో పెక్కింటిని ప్రాంతీయ భాషయైన తెలుగులో లిఖింపచేసినారు.

ఈ విధముగా ప్రాంతీయ పద్ధతులు, సాంప్రదాయములు ఆంధ్రదేశములోనున్న పెక్కు చిన్న చిన్న ప్రాంతీయ రాజ్యములను సామ్రాజ్యపరముగాను, సాంస్కృతికపరముగాను సమైక్య పరచుటకు సహాయపడినది. మధ్యయుగ కాలమున ఆంధ్రదేశమంతయు పూర్తిగా ఒకే రాజ్యాధికారము క్రింద, కేంద్ర పరిపాలనా వ్యవస్థలో లేకున్నప్ప టికిని, దాని రాజకీయ నిర్మాణము చూచినచో నది అటు ప్యూడల్ వ్యవస్థ మరియు స్వయంప్రతిపత్తి గల చిన్న చిన్న రాజ్యములుండు పాలనా వ్యవస్థల పోకడలు తక్కువగా కల్గి, వాటి రెండింటికి భిన్న మైనదిగాను, పొరుగు ప్రాంతమైన ఒరిస్సాలోని రాజకీయ నిర్మాణ వ్యవస్థతో దగ్గిర పోలికలు వున్నట్లుగాను స్పష్టమగుచున్నది. మధ్య యుగములోని సుదీర్ఘకాలమంతయు పరిశీలించినచో, ఆంధ్రప్రాంతము నందు రాజకీయముగా, సాంస్కృతికముగా నిరంతరము సమైక్యతా విధానములు అమలు జరిగినట్లు తెలియుచున్నది. పండితులైన బర్టన్‌స్టీన్‌గారు[23] వ్యక్తపరచినట్లుగా కాక ఈ కాలమున హిందూ ధార్మిక మతసంప్రదాయములలో పెనుమార్పులు సంభవించి సాధా రణ ప్రజానీకము కొల్చు దేవతలు, అమ్మవార్లు కూడ ఎట్టి ప్రతి బంధకములు లేకనే పౌరాణిక దేవతలుగా రూపొందించబడుటచే సమాజములోని ఉన్నతవర్గీయులు, అట్టడుగు ప్రజానీకము ఆచరించు మతసంప్రదాయములలో పెద్ద తేడా లేకుండెను. ఆంధ్రప్రాంతము నందు లభ్యమగు శాసనాధారములు పరికించినచో మధ్యయుగమున రాజులు తమ రాజ్యాధికారమునకు ముఖ్యపట్టణముల చుట్టుప్రక్కల స్థిరపడిన వైదిక మతాచారములు పాటించు బ్రాహ్మణుల ఆమోద ముద్ర వేయించుకొనుటకంటే, బహుళ ప్రాచుర్యము పొంది సామాన్య ప్రజాజీవనములో ఒక భాగముగా చొచ్చుకొనిపోయిన దేవాలయములు, వాటి మత సంప్రదాయములతో కలిసిపోయి ప్రజలలో అధికులు తక్కువవారు అన్న తేడాను తుడిచిపెట్టుకు పోవలెనన్న కోరికతో తమ ప్రయత్నములు చేసిరని తెలియుచున్నది.

## అధోజ్ఞాపికలు

1. ఉదాహరణకు చూడుడు; కె. ఎ. నీలకంఠశాస్త్రి; చోళస్ (2వ ప్రచురణ) మద్రాసు, 1955 ఈ విషయమై ఇతర విపులీకరణము లకు-రోమిల థాపర్, "ట్రెడిషనల్ ఇండియన్ హిస్టోరియోగ్రఫి", ఆంధ్రప్రదేశ్ హిస్టారికల్ రెవ్యు, (1985, కావలి) పే. 32-40.
2. ఆర్. ఎస్. శర్మ, ఇండియన్ ఫ్యూడలిజమ్; 300-1200; లకత్తా, 1965; ఆర్. ఎస్. శర్మ, "మెథడ్స్ అండ్ ప్రాబ్లమ్స్ ఆఫ్ ది స్టడీ ఆఫ్ ఫ్యూడలిజమ్ ఇన్ ఎర్లీ మిడీవల్ ఇండియా" ఇన్ ఇండియన్ ఎకనామిక్ రెవ్యు, 1 (1974) పే. 1-10.
3. బర్టన్‌స్టీన్; పెజంట్ స్టేట్ అండ్ సొసైటి, ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీ ప్రెస్, ఢిల్లీ, 1980.
4. హెర్మన్ కుల్కె, "ఫ్రాగ్మంటేషన్ అండ్ సెగ్మంటేషని వర్సస్ ఇంటిగ్రేషన్? రిఫ్లెక్షన్స్ ఆన్ ది కాన్‌సెప్ట్స్ ఆఫ్ ఇండియన్ ఫ్యూడలిజమ్ అండ్ సెగ్మంటరీ స్టేట్ ఇన్ ఇండియన్ హిస్టరీ" స్టడీస్ ఇన్ హిస్టరీ వాల్యుం: 4, నంబరు: 2, (1982) పే. 237-54.
5. డి. ఎన్. ఝా, "వాలిడిటీ ఆఫ్ బ్రాహ్మణ పెజంట్ ఎలియన్స్ అండ్ ది సెగ్మంటరీ స్టేట్ ఇన్ ఎర్లీ మిడీవల్ సౌత్ ఇండియ", సోషల్ సైన్సు ప్రోబింగ్స్, జూన్, 1984; ఎన్. సుబ్రహ్మణ్యమ్ "ది చోళస్ రిఇన్టర్‌ప్రిటెడ్" టమిళ్ సివిలైజేషన్, వాల్యుం 1, నెం, 3 సెప్టెంబరు, 1983; ఎన్. కరాషిమ, సౌత్ ఇండియన్ హిస్టరి అండ్ సొసైటి - స్టడీస్ ఫ్రమ్ ఇన్‌స్క్రిప్షన్స్, మద్రాసు, 1984; హర్బన్స్ ముఖియ, "వజ్ దేర్ ఫ్యూడలిజమ్ ఇన్ ఇండియన్ హిస్టరీ" ది జర్నల్ ఆఫ్ పెజంట్ స్టడీస్, వాల్యుం: 8, నం: 3, 1981; ఎమ్. జి. ఎస్. నారాయనన్, "సోషియో-ఇకనామిక్ హిస్టరీ - న్యూ ట్రెండ్స్ - ఎ కేస్ స్టడీ ఆఫ్ ది చోళ టైమ్స్" ప్రొసీడింగ్స్ అఫ్ ది సౌత్ ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్, మైసూర్, 1985; ఆర్. చంపకలక్ష్మి, "పెజంట్ స్టేట్ అండ్ సొసైటి ఇన్ సౌత్ ఇండియా" రెవ్యూ ఇన్ ఇండియన్ ఇకనామిక్ అండ్ సోషల్ హిస్టరి రెవ్యు, వాల్యుం: 18, నం: 3-4, 1931, డి. సి. సర్కార్ (ఎడి.) లాండ్ సిస్టమ్ అండ్ ఫ్యూడలిజమ్ ఇన్ ఏనిషంట్ ఇండియ, కలకత్తా, 1966.

6 హెచ్ కుల్కె "రాయల్ టెంపుల్ పాలసీ అండ్ ది స్ట్రక్చర్ ఆఫ్ మిడీవల్ హిందు కింగ్‌డమ్స్" ఇన్ ది కల్ట్ ఆఫ్ జగన్నాథ్ అండ్ ది రీజియనల్ ట్రెడిషన్ ఆఫ్ ఒరిస్సా, (ఎడిటెడ్ బై) ఎ ఎష్మన్న్, హెచ్ కుల్కె అండ్ జి సి త్రిపాఠి (ఢిల్లీ, 1978) పే 125-138, స్టడీస్ ఇన్ హిస్టరీ, వాల్యూం 4 నం 2(1982) పే 237-254

7 సుదర్శన్ సెనెవిరత్నె, "కళింగ అండ్ ఆంధ్ర ది ప్రాసెస్ ఆఫ్ సెకండరి స్టేట్ ఫార్మేషన్ ఇన్ ఎర్లీ ఇండియ" ఇన్ ది ఇండియన్ హిస్టారికల్ రెవ్యూ, వాల్యూం 7, నం 1-2, జూలై, 1981, పే 54-69

8 స్పేట్, ఒ హెచ్ కే అండ్ లియర్‌మంత్, ఎ టి ఎ, ఇండియ అండ్ పాకిస్థాన్ - ఎ జనరల్ అండ్ రీజియనల్ జాగ్రఫీ 3(వ ప్రచురణ) గ్రేట్ బ్రిటన్, 1967, పే 738

9 ఎపిగ్రాఫియ ఇండిక, వాల్యూం 3, పే 119

10 ఎమ్ కృష్ణకుమారి ది రూల్ ఆఫ్ ది చాళుక్య - చోళస్ ఇన్ ఆంధ్రదేశ, ఢిల్లీ, 1985, పే 6-26

11 అదే,

12 ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యూం 6 నం 35

13 ఎమ్ రామారావు, ఈస్టర్న్ చాలుక్యన్ టెంపుల్స్ ఇన్ ఆంధ్రదేశ, హైదరాబాదు, 1964

14 వై వి రమణ, ద్రాక్షారామ ఇన్స్క్రిప్షన్స్, హైదరాబాదు, 1982, పే 4

15 భీమేశ్వర పురాణము, (ఎడిటెడ్‌బై పాపయ్యశాస్త్రి) ఉపోద్ఘాతము, రాజమండ్రి, 1958, ఆశ్వాసము-4, పద్యము 103

16 పైది 1 వ ఆశ్వాసము, పద్యములు 99-104

17 ఎమ్ రామారావు, అప్ సిట్

18 పి వి పి శాస్త్రి, ది కాకతీయాస్ ఆఫ్ వరంగల్, హైదరాబాద్, 1978, పే 22

19 క్రీడాభిరామము, పద్యము 128

20 సి సోమసుందరరావు, "ది అమీనాబాద్ ఇన్స్క్రిప్షన్ ఆఫ్ అనవేమ అండ్ పెదకోమటి వేమ" జర్నల్ ఆఫ్ ది ఎపిగ్రాఫికల్ సొసైటి ఆఫ్ ఇండియ వాల్యూం 12, 1985, పే 69-71

21 ఎపిగ్రాఫియ ఇండిక, వాల్యూం 6, నం 35, అదే, వాల్యూం 5 నం 10 ఎన్ రమేశన్, స్టడీస్ ఇన్ మిడీవల్ డెక్కన్ హిస్టరీ, హైదరాబాద్, 1972, పే 110-120

22 రోమిల థాపర్, ఎ హిస్టరీ ఆఫ్ ఇండియ, హార్మండ్స్‌వర్త్, 1966

23 బర్టన్ స్టీన్, పెజంట్ స్టేట్ అండ్ సొసైటి, ఢిల్లీ, 1980 చాప్టర్ 7, సెక్షన్ 4, చూడుడు, "మహానవమి మిడీవల్ అండ్ మోడర్న్ కింగ్లీ రిచ్యుయల్ ఇన్ సౌత్ ఇండియ" ఇన్ ఎస్సేస్ ఆన్ గుప్త కల్చర్, (ఎడిటెడ్‌బై బార్డ్‌వెల్ ఎల్ స్మిత్, ఢిల్లీ, 1983) పే 67-90

---

# విశ్వనాథ

## ఉపాధ్యాయ

కల్పనా కైలాస శిఖర సంఫుల్ల కామనీయకము
శిల్ప సామ్రాజ్యాధికార ముద్రాభి జీవసౌష్ఠవము
కల్పద్రుమానంత సార భాసారగర్భిత పద మ
నల్పము గదె ! విశ్వనాథ సత్యనారాయణు కవిత.

శేత వెన్నెల పూతకొంత మరికొంత లేలిహాన ధరు
భూతి యింకొక్కంత గురువు వేంకన పుష్ట పేశలత
కృతయుగమతి కొండంత యింతంత కృపణతలేమి
వింత యహంకార మది యదెంతయొ! విశ్వనాథునకు

ఆకృతి బ్రహ్మతేజమట! అతడు రసావతారమట,
ఆ కృత్తివాసుడట తనదైవ మయాచిత వృత్తి
స్వీకృత మౌనట! వేయిపడగలు విప్పినవాడ
టా కృతి వాల్మీకి ఋణము దీర్పగ నవతరించెనట!

శైలి మురారి మయూర భవభూతి శాంకర మార్గ
లేలిహ్యమానము భావతీవ్రత లీనశాత్రవ ప
థాలన దందహ్యమాన మార్ద్ర రసాంతరవృత్తి
కాల విరుద్ధతా జంజపూకము-కాదనలేము

కొన్ని ఈషద్ధ్యానము లవి కిన్నెర కోకిల లగును
కొన్ని సుధ్యానముల్ కలవు కల్పక కోరకము లవి
కొన్ని దుర్ధ్యానముల్ భావ సంఘాతగూఢ సంచారు
లున్నవి విశ్వనాథ కవితా మహాలోకమ్మునందు

జీవుని వేదన తెలియు వారిలో శీర్షణ్యు డౌను
కోవిద గోష్ఠివివాదము ఖోరస్సుడగును
లావుచూపెడు శిష్యగణముకెల్ల చరణ్యుడౌను మన
సా విశ్వనాథు డౌనార్ష సంస్కృతీ స్కంధ్యు డౌనౌను.

దాండాజినికుల వచోవిడంబన తన పరిహాస
డిండీర కాంతుల డీలుపడజేసి ధీమాన్యమైన
పాండితీ ప్రౌఢిమ జ్ఞానపీఠ సంభావనా నర్ఘ
శౌండీర్యమున వెలుగు కవిసామ్రాట్టు సాటిలేరొకరు

పాషాణపాకిమ సాన్నిపాతిక పారిముఖ్య పరి
భాషా మహారంభ సంభ్రమస్ఫార పారిపంథిక జి
గిషాను బోబుధ్యమాన శిష్య సంకీర్తిత విజయ
ఘోషానుధషణా నవీన సరస సంకుల మాతనికథ.

వర్తమాన జగతీ వ్యావహారిక వైరుధ్య దీక్ష
నార్తి పెంపొంద నొకప్పుడటునిటు హాస్యభాజనత
కోర్తుడటుందురు కొంద రభ్యుదయోద్యమ గాథ
కీర్తనా పరవశులౌచు-తలకొక కింక లోకమున

భూతకాలపు సరీసృప మనియె నభ్యుదయ 'వాదకవి
పాత రాతియుగాల నాటిదీ యుష్ట్రపక్షి యనెనొక
హేతువాది యననిండు తనకేమి పోయినది లేదనియె
నాతడు వైదిక సామ్యవాద మహాభిసారి కదె!

# ఎక్కడుంది హాయి?

## కేవస్వీ

ఇద్దరికిద్దరం సరిగ్గానే దొరికాం, మావిడా, నేనూ మాకు అన్నీ సందేహాలే అన్నీ సంకోచాలే మమ్మల్ని ఎప్పుడూ వేధించే ప్రశ్న ఒక్కటే - ప్రపంచంలో ఎవరైనా హాయిగా ఉన్నారా? అని

అసలు హాయి అనే మాటకి అర్థం ఉందా ? అంటాను నేను. ఎవరంతట వాళ్ళు హాయిగా ఉండాలని అనుకోవటం, హాయిగా ఉంటు న్నామని ఎప్పుడైనా అనుకోగలగటం తప్ప హాయి అనే మాటకి సరిగ్గా సరైనా అర్థం లేనే లేదంటాను సిగరెట్టు తాగితే ఒకడికిహాయి వాడి ప్రక్కనవాడికే, సిగరెట్టు వాసన పరమడోకు, ఒకడి హాయి మరొకడికి హాయికాకపోవటంలోనే పరమ దుర్మార్గం ఉంది, కాదంటారా ?

పోనీ, ఎవడిదారి వాడిదైనా చిక్కులేదు హాయిగా ఉన్నా మనే స్పృహతోనైనా ఎంతమంది బ్రతుకుతున్నారు ? అంటుంది మా ఆవిడ అది ఫక్తు తాత్విక ప్రశ్న ఫిలాసఫీ చదివిన మా ఆవిడ నిజ జీవితంలో కూడా తాత్వికంగా ఆలోచించటం మరీ అర్థమున్న దుర్మార్గం

ఆవిడకేం,రాణీలాగా లెక్చరర్‌గిరీ వెలగబెడుతోంది ఉద్యోగం లోనూ ఫిలాసఫీ, జీవితంలోనూ ఫిలాసఫీయే నాకా అదృష్టం ఎక్కడిది ? అక్కౌంటెంటు బ్రతుక్కి తాత్విక చింతన కూడానా ? చిత్రగుప్తుడి చిట్టాల్లా లెడ్జెర్లు కదలక పోతే మా మేనేజర్ సాక్షాత్తూ యముడే అవుతాడు, నాకు కాకున్నా నా ఉద్యోగానికి ! అంచేత, నా తాత్విక చింతనకు ప్రేరణా, శ్రోతా కూడా మా ఆవిడే అయింది

మాటవరసకి ఆవిడ ఉద్యోగం చూసి మీకే దర్జాగా ఉంటుందని ఉడుక్కుంటాను గాని, ఆవిడ కష్టాలు ఆవిడవి వాళ్ళ ప్రొఫెసర్‌కి ప్రొద్దస్తమానం డబ్బు యావేగాని, పిసరంత ఫిలాసఫీ వంటబట్టలేదట ఇక క్లాసుల్లో పిల్లలా-వేరే సబ్జెక్టుల్లో సీట్లు దొరక్క ఫిలాసఫీ బెంచీలకి రాజీపడ్డారుగాని, అంతా పరీక్షల ఫిలాసఫీయే నంటుంది మా ఆవిడ ఉద్యోగం కోసమే ఆవిడా ఇంత చదువు చదివింది తీరా చూస్తే ఈ రొటీనులో డబ్బు తప్ప మరే ఆకర్షణా లేదంటుంది ఉద్యోగం చేయ్యాలనీ లేదు మానేస్తే ఫక్తు ఇంటావిడగా బ్రతుకు వెళ్ళదీయాలన్నా దిగులు ! అదీ ఆవిడ దురవస్థ వాళ్ళ ప్రొఫెసరంటే ఆవిడకు పరమబోర్ కాలేజీ అంటే నీరసం క్లాసులంటే అలర్జీ

జీవనాధారమైన ఉద్యోగం తప్ప నాకు మరో వ్యాపకం లేదు సినిమాలైతే తిట్టుకుంటూ చూస్తానుగాని ఎక్కువ సేపు సంగీతం విన్నా నిద్రొచ్చేస్తుంది, కళాభిరుచి అనేదేమిటో నాకు చిన్నప్పటి నుండి అంతుబట్టనేలేదు. పరిచయస్థులైతే ఉన్నారుగాని, నాకు చెప్పుకోదగ్గ స్నేహితులంటూ లేరు గృహమే స్వర్గసీమ అనే దురుద్దేశ్యంతో పెళ్ళిచేసుకోలేదుగాని, పెళ్ళయినా నా ధోరణిలో మార్పేమీ లేదు మా ఆవిడ తత్వంకూడా అచ్చు నా తరహాయే కావటంతో అర్థరాహిత్యంతో మాది అనుకూల దాంపత్యమైంది

అదృష్టవశాన మా ఇద్దరికీ కూడా కోపతాపాలు చాలా చాలా తక్కువ కాబట్టి సరిపోయింది లేకుంటే ఈ సరికి కేవలం 'బోర్' భరించలేకే మేము విడాకులు తీసుకోవలసింది ఈ మాట అనుకొని మాత్రం మేము చాలాసార్లు నవ్వుకుంటూ ఉంటాం

రొటీను బ్రతుకులో మరీ రోతపుట్టినప్పుడు మేం కొన్ని పలాయన మార్గాలు ఏర్పాటు చేసుకున్నాం బోర్ భరించలేక సినిమాలకు వెళ్ళి అక్కడ మరీ బోర్‌తో తలబొప్పి కట్టించుకోవటం మా ఇద్దరికీ సరిపడలేదు ఇద్దర్నీ భరించగల మిత్రులంటూ లేనే లేరు ఇక మా శూన్యాన్ని మేమే పరిష్కరించుకోవటానికి విహార యాత్రల పథకం అమలు చేయటం అలవాటైంది బొత్తిగా ఇంట్లో ఊసుపోదనుకున్నప్పుడు ఇద్దరం కలిసి కట్టుగా బయలుదేరి, కనిపించిన సిటీబస్సు ఎక్కేస్తాం ఆ బస్సు ఎక్కడికి వెళ్ళినా ఫరవాలేదు కండక్టరుతో 'లాస్ట్ స్టాప్' అనేస్తాం, అంతే అలాగని లాస్ట్ దాకా వెళ్తామని గ్యారంటీ ఏమీ లేదు మధ్యలో అనుకోకుండా ఏపార్కు దగ్గరో, ఏ బజారులోనో బస్సు దిగేస్తాం బేఖాతరుగా కాలుసాగినంత మేరా పచారు చేస్తాం వచ్చేపోయే మనుష్యుల్ని స్టడీచేస్తాం వాళ్ళ బ్రతుకులు ఎలా ఉంటాయో ? అని ఊహిస్తాం ఎవరెవరు ఎంతెంత హాయిగా ఉన్నారా? అని అంచనా వేస్తాం ప్రపంచాన్ని బేలకళ్ళతో చూసే పసిపిల్లలు తప్ప మరెవరూ హాయిగా ఉన్నట్లు కనిపించదు మాకు ప్రతి మనిషీ ఒక పెద్ద సమస్యల మూటను అదృశ్యంగానే అయినా నెత్తిన మోస్తున్నట్లు అనిపిస్తుంది.. ఖర్చు లేకుండా ఇలా ఓపినంత మేరకు తాత్విక చింతన చేసి చేసి, ఇక కాళ్ళు పీకినప్పుడో, కడుపులో కత్తెరకదలినప్పుడో నీరసంగా ఆటోఎక్కి ఇల్లు చేరుకుంటాం

ఎందరో మేధావులు శూన్యాలను మోస్తూ ఉండవచ్చుగాక, మేము మాత్రం జంటగా ఒకే శూన్యాన్ని మోస్తుంటాం ఇంతకన్నా ఆదర్శ దాంపత్యం ఎక్కడుంటుంది?

ఒకానొక దిక్కుమాలిన సాయంత్రం దిక్కుతోచని శూన్యాన్ని మోసుకుంటూ సిటీ బస్సెక్కి జన సముద్రంలోకి పలాయనం చిత్తగించాం

ముందు సీటులో కూచోవటంతో మా ఆవిడ బస్‌డ్రైవర్ జీవితంపై సానుభూతి కురిపించటంలో తాత్వికచర్చ మొదలుపెట్టింది ఏం జీవితం ఈ డ్రైవర్ జీవితం? కండక్టర్ విజిల్ కొడితే ఆపాలి రెండు విజిళ్లు కొడితే మళ్ళీకదలాలి, సిగ్నల్‌దగ్గర ఆపాలి పోలీసు చెయ్యిచూపితే ఆపాలి సైకిలు అడ్డంవచ్చినా బ్రేకు తొక్కాలి ఉక్కపోసి చస్తున్నా కాకీయూనిఫాం ధరించాలి బస్సు టైముకు బయలుదేరాలి టైముకి చేరాలి హాయిగా తినలేడు, హాయిగా తిరగ లేడు నడిపిన రూటులోనే యాంత్రికంగా బస్సునడపాలి బోర్ బోర్ డ్రైవర్ జీవితం పరమబోర్

నేనేం తక్కువ తిన్నానా? కండక్టర్ జీవితాన్ని మరో ఉదాహరణగా తీసుకున్నాను టిక్కెట్లు కొయ్యాలి చిల్లర ఇవ్వాలి చార్టులో ఎంట్రీలు వెయ్యాలి ముందూ వెనకాచూసి విజిలుకొట్టాలి మనుషుల చెమటమధ్య నలుగుతూ బస్సులో ఈ మూలనుంచి ఆ మూలకు తిరుగుతూ టిక్కెట్ టిక్కెట్ అంటూ గొంతు చించుకోవాలి స్టాపింగ్ దగ్గర అప్రమత్తంగా మెలగాలి. కండక్టర్ జీవితమా, పగవాడికైనా వద్దు

ఆ తరువాత మాఆవిడ ట్రాఫిక్ కానిస్టేబుల్‌మీద జాలిపడింది మునిసిపాలిటీ వ్యాన్‌ని చూడటంతోటే ఆ ఉద్యోగులు భరిస్తున్న కంపును తలుచుకొని ముక్కుమూడిచి సానుభూతి కురిపించింది హఠాత్తుగా వాళ్ళ ప్రొఫెసర్‌ని గుర్తుచేసుకుంది ఎంతెంతో ఫిలాసఫీని చదివి చదివి పుస్తకాలతో తలబొప్పికట్టింది కాబట్టే ఆయనకి డబ్బుయావ పెరిగి వుండాలి, అంది చివరికి

నేను మాత్రం మా మేనేజర్‌మీద జాలిపడుతున్నట్టే జాలపడి చివరకు పరోక్షంగా కసి తీర్చుకున్నాను ముసలినక్క, మమ్మల్నెవర్నీ హాయిగా ఉండనివ్వడు సరికదా, తనూ హాయిగా ఉండడు సాటిమానవుల్ని వేధించటానికే అవతరిస్తుంటారు, ఇటువంటి మహానుభావులు అన్నాను

బజారులో ఒకచోట బస్సు ఆగగానే మా అవిడ చప్పునలేచి అక్కడ దిగిపోదాం అంది ఇక ఫుట్‌పాత్ మీద యధేచ్ఛగా నడుస్తూ మానవ జీవులపై యధాశక్తి జాలికురిపిస్తున్నాం

అదేమిటో ఆ సాయంత్రం దారంట వెళ్తున్న ప్రతి మనిషిలోనూ దయనీయ పరిస్థితే కనిపించింది మాకు షాపుల్లో కౌంటర్లలో కూచున్నవ్యక్తుల్లో 'డబ్బాశ' కరడు గట్టి ఉండటం గమనించాం నాగరికత కరెంటు దీపాలతో వెలిగిపోతున్నా, ప్రతి మనసులో చీకటే రాజ్యం చేస్తోందని నిర్ధారణ చేసేశాం ఎక్కడా ఏమీలేదు ఏ మనిషిలోనూ ఏమీలేదు మానవత్వం అర్థరాహిత్యాన్నే మోస్తోంది మరి నవ్వుతున్న వాళ్ళందరూ ఎందుకు నవ్వుతున్నట్టు? ఏమీ తోచక నవ్వేస్తున్నారంతే! ఈ నవ్వుల్లో జీవస్పృహలేదు ఖాళీ ఖాళీ అందరిలోనూ అంతా ఖాళీ

'గ్రాండ్ రిడక్షన్ సేల్' అన్న బ్యానర్‌చూసి ఆగిపోయింది మా ఆవిడ పోనీ చెప్పులు కొందామా? అంది పోనీ అనేమాటకు చాలా అర్థం ఉందనిపించింది నాకు అలా అనుకోకుండానే చెప్పుల షాపులో అడుగు పెట్టేశాం

తగ్గింపు ధరలనగానే ప్రతిమనిషికీ ఆశ షాపు కిటకిటలాడిపోతోంది పది శాతం తగ్గింపు, ఇరవై శాతం తగ్గింపు, ఇరవైఐదు శాతం,ముప్పైశాతం తగ్గింపులంటూ బోర్డులుపెట్టేసి రకరకాల చెప్పులు దొంతర్లుగా పేర్చేశారు తక్కువ ధరకే నాణ్యమైన చెప్పులు కొనేయాలని ఎగబడుతున్నారు జనం

తగ్గింపు ధరల చెప్పులు నాకేమీ నచ్చలేదు మా ఆవిడ కూడా అవన్నీ కడబడిన సరుకే అని తేల్చేసింది ఇక మామూలు ధరకే అయినా మంచి చెప్పులు కొనాలని ఆవిడ మనసు పడింది కుషన్ కుర్చీల్లో ఒక వారగా వెళ్ళికూచున్నాం కాని, చాలా సేపటి వరకు మమ్మల్ని ఎవరూ పట్టించుకోలేదు షాపులో సేల్స్ అసిస్టెంట్లందరూ తగ్గింపు ధరల చెప్పులతోనే బిజీగా ఉన్నారు కౌంటర్‌లో వున్నవ్యక్తి-మేనేజర్ కాబోలు-బిల్లులురాసి డబ్బువసూలు చెసుకుంటున్నాడు కాని, కస్టమర్లని పెద్దగా పట్టించుకోవటం లేదు ఆ షాపు దేశంలోకల్లా పెద్ద పేరున్న కంపెనీది తిరుగులేని నాణ్యతకు ఆ కంపెనీ పెట్టిందిపేరు విదేశాలకుకూడా భారీఎత్తున చెప్పుల్ని ఎగుమతి చేస్తుంటుందా కంపెనీ అప్పుడప్పుడూ తగ్గింపు ధరలతో ఎరవేసి పాత స్టాకును తెగనమ్మి పారేస్తుంటారు ఆ చెప్పులకోసం జనం ఎగబడతారే గాని, కస్టమర్లకోసం ఆ కంపెనీ హైరానా పడనవసరం లెదు

ఎవరో అసిస్టెంటు వచ్చి మాకేం కావాలని అడిగాడు. మీడియం హీల్ ఉన్న చెప్పులు కావాలని మా ఆవిడ అడిగింది కాని, దాదాపు పది నిముషాలదాకా ఆ అసిస్టెంటు మాదగ్గరకి రానేలేదు మళ్ళీ వచ్చాక, ఏం కావాలన్నారు? అని కొత్తగా అడిగాడు మళ్ళీ చెప్పింది మా ఆవిడ నుదుటిమీద చూపుడువేలితో కొట్టుకొంటూ లోపలికి వెళ్ళాడతను

4

అప్పుడోసారి షాపునంతా కలయజూసి వింతగా నవ్వింది మా ఆవిడ ఏమిటి సంగతన్నాను ప్రపంచంలోకల్లా అతి హాయిగా వున్న మనిషిని ఇన్నాళ్ళకి చూశాను, అందావిడ నమ్మలేని మొఖం పెట్టాను

కౌంటర్‌లో ఉన్న నడివయసు వ్యక్తికేసి ఈర్ష్యగా చూస్తోంది మా ఆవిడ - బహుశా అతను మేనేజర్ అయివుంటాడు ఈ షాపుకి కంపెనీ హెడ్డాఫీసు, రీజనల్ ఆఫీసు ఎక్కడెక్కడో ఉంటాయి షో రూం ఒకటి ఏర్పాటు చేసి ఇతణ్ని చూసుకోమన్నారు ఇతను చూసుకుంటున్నాడు, అంతే ఎక్కువ చెప్పులు అమ్మాలని అతనికేం పట్టుదలలేదు అమ్మక పోయినా ఫరవాలేదు నష్టం వచ్చినా భయం అతనికి లేదు స్వయంగా కష్టమర్లతో వేగనక్కరలేదు అంతా అసిస్టెంట్లే చూసుకుంటారు అలా బిల్లులు రాసి, డబ్బు వసూలు చేసుకుంటే చాలు గడిచి పోతుంది నిమ్మళంగా బ్రతకటం అంటే ఇదే కాదూ ? అంది

కాబోలు ననుకున్నాను మేనేజర్ మహాశయుడికేసి కాస్సేపు చూడగా మా ఆవిడ మాటలు సత్యానికి దగ్గరగా ఉన్నట్లనిపించింది

అసిస్టెంటు వచ్చి మా ఆవిడ ముందు నాలుగైదు జతలు పడేసి వెళ్ళిపోయాడు ఆ జతల్ని మార్చి మార్చి తొడుక్కొని పెదవి విరిచింది ఆవిడ రంగునచ్చితే డిజైను నచ్చలేదు డిజైను బాగున్న చెప్పుల ధరలు అసలే నచ్చలేదు

అసిస్టెంటు మళ్ళీ వచ్చి ఏవి తీసుకుంటున్నారన్నట్లు అసహనంగా చూశాడు

హీల్ పెద్దగా ఉన్నాసరే, సన్నపట్టీలున్న జతలు చూపమంది మా ఆవిడ ఏమిటో విసుక్కుంటున్నట్లుగా గొణుక్కుంటూ మళ్ళీ లోపలికి వెళ్ళాడతను

నిజమే పందలాది కష్టమర్లను సంతృప్తిపరచటమంటే షాపు అసిస్టెంట్లకు తలనొప్పి పనే, అయితే వాళ్ళు జీతం తీసుకొంటున్నది అందుకే కద! వీళ్ళకి కాస్తమర్యాద నేర్పాలని అయినా షాపు మేనేజర్‌కు తోచనేలేదు!

ఎంత అదృష్టమండీ ! అంది మా ఆవిడ, ఏదైనా పేరున్న కంపెనీలో ట్రైచేసి చెప్పుల షాపుకి మేనేజర్ కావాలని వుందినాకు అంది మా ఆవిడ అదేదో మహదాశయంలా

అంతలో హఠాత్తుగా కేకలు వినిపించాయి కౌంటర్ దగ్గర ఏదో రగడలా అనిపించింది మేనేజర్ ఎవరితోనో మాట్లాడుతున్నాడు కాదు కాదు, ఆ మనిషి ఎవరోగాని, మేనేజర్‌మీదే కేకలేస్తున్నాడు

ఐసే యూ షటప్ ! అని భీకరంగా అరిచాడా వ్యక్తి షాపు దద్దరిల్లింది అందరూ అటుకేసి చూస్తున్నారీసరికే షటప్ ! అని గర్జించిన వ్యక్తికి పాతిక వయసు దాటింది, ముప్పైలోపే జీన్స్ పాంటులోకి టీషర్ట్ నిర్లక్ష్యంగా టక్‌చేసాడు మోటరు సైకిల్ మీద వచ్చాడనటానికి గుర్తుగా చేతిలో హెల్మెట్ వుంది గ్లోవ్స్‌రెండూ ఒక చేతిలో పుచ్చుకొని చేయి విసురుతూ ధిక్కారంగా మాట్లాడుతున్నాడు

డోంట్ టాక్ టూ మచ్ ! ఐనో ఆల్ అబౌట్ యువర్ కైండ్ !. అంటూ ఇంకా ఇంగ్లీషులో దంచుతున్నాడతను విరుచుకున్న ఛాతీలో పొగరూ, అహంకారం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి మర్యాద మన్నన అనే మాటలకే అర్థం తెలియనట్లుంది అతని వాలకం ఇంగ్లీషులో అతను వేసిన కేకలకు ఆసరికే బిక్కచచ్చి పోయాడు మేనేజర్ లేచి నిలబడేవున్నా, పాతాళానికి కృంగిపోతున్నట్లు దయనీయంగా వున్నాడు కలహకారణం ఏమై వుంటుందో అంతుబట్టలేదుగాని మేనేజర్‌పై తిట్లవర్షం కురిపిస్తూనే ఉన్నాడా యువకుడు

నువ్వేం కింగ్ వనుకుంటున్నావా ? ఈ షాప్‌కే ఓనర్ వనుకుంటున్నావా? యు ఆర్ ఆఫ్టరాల్ ఎన్ ఎంప్లాయీ- ఎ సర్వెంట్- మైండిట్! జీతం డబ్బులతోనే కళ్ళు నెత్తికెక్కాయేమో నీకు-నీలాంటి దగుల్బాజీలు ఎందరి కాళ్ళు పిసికి ఈ ఉద్యోగాలకొస్తారో నాకు తెలుసు ధారాళంగా కురుస్తోంది తిట్ల వర్షం

షాపులో కస్టమర్లూ, అసిస్టెంట్లూ, అందరూకూడా గుడ్లప్పగించి చూస్తూ చెవులప్పగించి వింటున్నారేగాని, ఏమైందో తెలుసుకోటానికైనా ఎవరూ జోక్యం చేసుకోలేదు

ఎట్టకేలకు మేనేజరు కాస్త ధైర్యంపుంజుకున్నాడు సారీసర్ ఏదో జరిగింది అంటూ గొణికాడు

దాంతో మరీ విజృంభించి హూంకరించాడు యువకుడు ఎవడిక్కావాలి నీ ఓడి సారీ? అసలు నేనెవరను కుంటున్నావు నువ్వు? అల్లాటప్పా గాడనుకుంటున్నావా ? ఐ కెన్ సీ యువర్ ఎండ్ ! మీ హెడ్డాఫీసులో పర్సనల్ మేనేజర్ భానీరాయ్‌ని నువ్వెప్పుడన్నా పర్సనల్‌గా కలుసుకున్నావా? ఇంపాసిబుల్ నీలాంటివాళ్ళకి ఇంటర్వ్యూ కూడా ఇవ్వరు భానీ ఇప్పుడు నేను భానీకి ఒక ఫోన్‌కొడితే చాలు, ఏమవుతుందో తెలుసా ? కరెక్టుగా రేపు ఈపాటికి ఇదే షాపుముందు చెప్పులు రిపేరుచేసుకుంటూ ఉండాల్సిందే నువ్వు ఐ కెన్ సీ టు ఇట్ నీ తల పొగరు దించేస్తాను ఏమనుకున్నావో .

మేనేజర్ వణికిపోతున్నాడు, ముఖ్యంగా భానీ పేరు వినబడటంతోనే ఆయన ముఖం కాగితంకన్నా తెల్లగా పాలిపోయింది కౌంటర్

నుండి ఇవతలికివచ్చి ఆ యువకుడిముందు చేతులు నలుపుకుంటూ తల దించుకుని నిలబడ్డాడు సారీసర్, వెరీసారీ సర్. ఐ యాం రియలీ వెరీసారీ . , అంటూ ప్రాధేయ పడుతున్నాడు

అసలుగొడవెందుకు జరిగిందో ఎవరికి అంతుబట్టలేదు కానీ, వాతావరణం కాస్తచల్లబడగానే ఏమీ జరగనట్లే అందరూ బేరసారాల్లో పడ్డారు మేనేజర్ని మరి నాలుగు తిట్టి జాడించి, మోటర్సైకిలెక్కి విసురుగా వెళ్ళిపోయాడు యువకుడు

కాసేపు తల పట్టుకుని ఉండిపోయాడు మేనేజర్ ఆ తర్వాత కర్చీఫ్‌తో ముఖంతుడుచుకొని, మళ్ళీ కౌంటర్‌లో కూచున్నాడు ఆయన ఎంతకీ తల మాత్రం ఎత్తటంలేదు యాంత్రికంగా బిల్లులు రాస్తున్నాడు డబ్బుతీసి సొరుగులో వేసుకుంటున్నాడు అయన మనస్సులో అగ్నిపర్వతం రగులుతున్నదేమో, ఎవరికెరుక్కావాలి?

చెప్పులు నచ్చనేలేదు మా ఆవిడకి ఇద్దరం మళ్ళీ బజార్న పడినడుస్తున్నాం షాపులో సంఘటన ఇంకా కళ్ళముందు మెదులుతూ ఉండగా, అదేమిటో వికారంగా అనిపించింది నాకు బహుశా మా ఆవిడకుకూడా అలాగే అనిపించి ఉండాలి, మౌనంగా నడుస్తోంది తప్ప ఎటువంటి వ్యాఖ్యానం చేయలేదు

అటువంటి సందర్భాలలో హాస్యోక్తులేకదా తరుణోపాయం!

—ప్రపంచంలోకెల్లా హాయిగా ఉన్న మనిషి! . , అన్నాను నేను అర్థోక్తిగా, జనాంతికంగా

ఆ ప్రసక్తే వద్దన్నట్లు తల ఆడించింది మా ఆవిడ—లేడు, లేడు, ఎవడూలేడు . , అంది నిర్ధారణగా

# నివేదన

## శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి

వీణియ మీటబోకు మరవింద దళాయత చారునేత్రి! ఆ
జాణ తనమ్ము నా హృదయ సౌరభముల్ మలినమ్ము సేయు-నా
రాణ తొలంగిపోవు - నవరాగము రాగము మాసిపోవు - వి
న్నాణము సౌకుమార్యము కనంబడకేగు వనాంతరాలకున్

నవ్వకు మల్లిపువ్వవలె - నా పువుదోట కళావిహీనమై
నవ్వడి లేకయుండు - విరజాజుల పందిరి కూలిపోవు - దే
దవ్వుల తారకామణుల దర్పము గిర్వము జాలినొందు నో
జవ్వని! రవ్వలేరు కొనజాలినవాడను లోదలంచుమా!

పాటలు పాడ బోకుము - దివస్పతిగా నరసప్రసంగముల్
రాటలకైన నచ్చవు - వరాలకరాల వియత్తరంగిణీ
కూటమి తల్లడిల్లు - తళుకుల్ బెళుకుల్ కళలన్ త్యజించి న
య్యాటలు మాని ఆ నెమలి-హాయని కార్చుక దుష్టబాష్పముల్.

కురులు కదల్పబోకుము - దిగుల్పడి కాటుక మబ్బులన్ని ని
ష్ఠురముగ దిగ్విదిక్కులకు సోరణగండ్ల గమించు - దేవతా
తరుణులు దర్పణంబుగని తక్కుచుతారుచు మూలమూల చొ
త్తురు - భవదీయ హావములతో పులకించి తరించు లోకముల్

శ్రీ వే. వేమూరి

# ఆల్కహాలు

## 1 నాంది :

శ్రీనాధకవి సార్వభౌముడు శృంగారనైషధాన్ని తెలిగించిన సందర్భంలో సంస్కృతనైషధంలోని దీర్ఘసమాసాలకి మార్పులేమీ చెయ్యకుండా, విభక్తి ప్రత్యయాలుమాత్రం చేర్చి ఆంధ్రీకరించేడని, సమకాలీకులు ఆయనని పరిహసించి, "డు, ము, వు, లు" కవి అని వెటకారం చేసేవారట ఇలా కొందరు ఎగతాళి చేసినప్పటికీ, యీ రకం భాషాంతరీకరణంలో తప్పులేదు గ్రీకు, లేటిన్ భాషలనుండి, యీ విధంగా, తండోపతండాలుగా, క్రొంగొత్త మాటలు ఇంగ్లీషులోకి వచ్చాయి వైద్య, భౌతిక, రసాయనికాది శాస్త్రాలలో వున్నా సాంకేతిక పదజాలంలో నూటికి ఏభై పాళ్ళు పైబడి ఇలా ఎరువు తెచ్చుకున్న మాటలే! సంస్కృతంనుండి, ఇంగ్లీషునుండి యిలాగే ఎన్నో మాటలు తెలుగులోకి కూడ వచ్చేయి

విభక్తి ప్రత్యయాలతో కొన్ని తెలుగు మాటలని అంతం చేసినట్లే, అరబిక్ భాషలో చాల మాటలు 'ఆల్' శబ్దంతో ఆరంభమవుతాయి. అరబిక్ భాషలో 'కలి' అనే మూల శబ్దానికి 'భస్మము' అనే అర్ధం వుంది. కాని యీ మూల శబ్దం వాడాలంటే దానికి 'ఆల్' శబ్దం ముందు తగిలించాలి అప్పుడు ఆల్ + కలి కలసి 'ఆల్కలీ' అవుతుంది అరబిక్‌లో ఆల్కలీ అంటే బూడిద ఇంగ్లీషులో 'ఆల్కలీ' అంటే ఒక రసాయనిక ద్రవ్యం మొదట్లో, బూడిదని నీళ్ళతో కడగగా వచ్చే ద్రావణాన్ని 'ఆల్కలీ, అని పిలిచేవారు ఈ కథ అంతా కాలగర్భంలో కలసిపోయింది నిత్యం రసాయనాలలో మునిగి తేలేవారికికూడ యీ 'ఆల్కలీ' యొక్క పూర్వగాథ తెలియకపోవచ్చు! ఈ ఆల్కలీ అన్న మాటని తెలుగులో "క్షారము" అంటారు ఇదెలాగ జరిగిందో చూద్దాం "భూతిర్భసిత భస్మనీక్షారో రక్షా..." అని అమరకోశం బూడిదకి సంస్కృతంలో వున్న పేర్లని వర్ణిస్తుంది కనుక భస్మమన్నా, క్షారమన్నా ఒక్కటే అందుకనే 'ఆల్కలీ' అన్న మాటని సంస్కృతం వచ్చిన రసాయనిక శాస్త్రజ్ఞుడెవరో 'క్షారము' అని తెలిగించేరు ఇప్పుడీమాట పాఠ్య పుస్తకాలలో స్థిరపడిపోయింది

ఇలా 'ఆల్' శబ్దంతో మొదలయే మాటలు ఇంగ్లీషులో చాల వున్నాయి "అల్గారిథమ్," "ఆల్కహాలు" మొదలయిన ఇంగ్లీషు మాటలు అరబిక్ భాషనుండి ఎరువు తెచ్చుకున్నవే మహమ్మద్ అల్-క్వారీజమీ అనే అరబిక్ శాస్త్రజ్ఞుడు, హిందూ గణితశాస్త్రాన్ని క్షుణ్ణంగా చదువుకొని, గణితశాస్త్రంమీద "హిన్‌సా" అనే ఒక పుస్తకం వ్రాశారు హిన్‌సా అంటే హిందూశాస్త్రం ఈ పుస్తకం పాశ్చాత్యులు చదివి, అందులో ఆయన ఉదహరించిన హిందూ గణిత శాస్త్రపు పద్ధతులని "ఆల్-క్వారీజమీ"లు అని పిలిచేవారు ఈ నోరు తిరగని మాట క్రమేపీ పరిణతిపొంది, నేటి ఇంగ్లీషులో "అల్గారిథమ్" గా మారింది ఇక "ఆల్కహాలు" సంగతి అరబిక్‌లోని 'ఆల్ కోల్' అన్న మాటలోంచి వచ్చిందీ ఆల్కహాలు బెడిసి కొట్టిన భాషాంతరీకరణానికి యిదొక వుదాహరణ నిజానికి యీ "ఆల్ కోల్" అన్న దానిని తెలుగులో నీలాంజనమనీ, కపోతాంజనమనీ, లేకపోతే సౌవారమనీ పిలుస్తారు దీనినే ఇంగ్లీషులో 'ఏంటిమొనా' అంటారు వెండి, బంగారం, రాగి, సీసం, తగరం, వంటి మూలకం యీ 'ఏంటిమొనా'! దీనికి ఆల్కహాలుకి ఏ విధమయిన సంబంధమూలేదు కాని యూరప్‌లో, ఎవరి పొరపాటు వల్లనో, యీ 'ఆల్ కోల్' 'ఆల్కహాలు'గా మార్పు చెందడమే కాకుండా, దీని అర్ధమే పూర్తిగా మారిపోయింది శాస్త్రరీత్యా, కల్లు, సారా వంటి మత్తెక్కించే పానీయాలలోవున్న మత్తెక్కించే పదార్థాన్ని (పదార్థాలని) ఆల్కహాలు అంటారు

## 2 చారిత్రాత్మక దృక్పథం :

శాస్త్రరీత్యా సిసలైన అర్థం తెలియకపోయినా 'ఆల్కహాలు' అంటే అర్థంకాని ఆంధ్రుడు వుండడంటే అతిశయోక్తి కాదేమో! వీధికో వైష్ణవాలయం, సివారుకో శివాలయం వున్నా లేకపోయినా, వాడవాడకీ, గొందిగొందికీ ఒక విస్కీషాపు వెలుస్తూన్న యీ రోజులలో ఆల్కహాలు అంటే తెలియకపోవడమేమిటి? మన సంసారాల్లో చిచ్చుపెట్టి, మన ఇళ్ళూ ఒళ్ళూ గుల్ల చెయ్యడానికి బ్రిటిష్‌వాళ్ళు పన్నాగంపన్ని ప్రవేశపెట్టిన పానీయమేమికాదు యిది వేదకాలం నుండీ, మన సంస్కృతిలో యీ ఆల్కహాలు వుంది, పేరు తేడా, అంతే! అమరకోశంలో "సురా హలిప్రియా హాలా పరిస్రుద్వరుణాత్మజా గన్ధోత్తమా ప్రసన్నేరా కాదమ్బర్యః పరిస్రుతా మదిరా కశ్యమద్యే చాప్య వదంశ" అని కల్లుకి కనీసం పదమూడు పేర్లు వున్నాయి కల్లులో రకరకాలకి సంస్కృతంలో వివిధమైన పేర్లు వున్నాయి ఇప్ప పువ్వుతో చేసిన కల్లుకి ఒక పేరు, చెరకురసంతో చేసిన కల్లుకి, చేసే పద్ధతినిబట్టి, మూడు పేర్లు! ఈ రకాలన్నీ కలుపుకుంటే దరిదాపు నలభై పైబడివున్నాయి పేర్లు వీటన్నిటిలోకి అగ్ర

తాంబూలం 'సుర' అన్న మాటకి ఇవ్వవచ్చు సుర అంటే సారా అని ఒక అర్థం, దేవతలని మరో అర్థం అంటే, సారా త్రాగే వాళ్ళంతా సురులు (దేవతలు) అనీ, సారా త్రాగని వాళ్ళంతా అసురులు (రాక్షసులనీ) వ్యుత్పత్తి అర్థం చెప్పుకోవచ్చా? ఈ రకం వాదనని సమర్థించడానికి మన పురాణాలలో ఆధారాలు లేకపోలేదు రాక్షసుల గురువైన శుక్రాచార్యులవారికి, ఒకానొకప్పుడు, యీ ఆల్కహాలు ప్రీతిపాత్రమైన పానీయం ఈ దురలవాటుకి దాసుడైన శుక్రాచార్యులు, పరిస్థితుల ప్రభావానికి లోనయి మరి గత్యంతరం లేక, దేవతల గురువైన బృహస్పతి కొడుకు కచుడికి సంజీవనీ మంత్రం వుపదేశిస్తాడు ఆ తర్వాత పశ్చాత్తాపపడి 'ఆల్కహాలు' త్రాగకూడదని నిషేధిస్తాడు ఆ రోజునుండి సురాపానం చెయ్యని వారంతా 'అసురులు' అనే వదంతి ఒకటి లేవదీశారు కొంతమంది దేవాంశ సంభూతుడైన కవి ఒకడు యీ విషయాన్ని మకుటంగా తీసికొని, 'సుర త్రాగనివాడు దున్నపోతై పుట్టున్' అని చమత్కరించేడన్న విషయం కూడ వదంతి మాత్రమే!

సారాయొక్క చరిత్ర ఒక్క వేద, పురాణాలలోనేకాదు! ప్రతి సంఘపు చరిత్రలోనూ, పురాతనకాలంనుండీకూడ, యీ ఆల్కహాలుకి ఒక ఆయతనం వుంది పదివేల సంవత్సరాల క్రిందట, ద్రాక్షపళ్ళనుండి మానవులు సారా తీసి త్రాగేవారన్న ప్రాతిపదిక ఆధారాలు వున్నాయి బైబిలులో సారా గురించి కనీసం 600 సార్లయినా ప్రస్తావించబడింది బైబిలులో వర్ణించబడ్డ మహాప్రళయం తగ్గిన పిమ్మట, నోవా (ఇంగ్లీషు ఉచ్చారణ) మొట్టమొదటగా చేసిన పనేమిటయ్యా అంటే, సారా కొరకు ద్రాక్షపాదు వెయ్యడం! ఇది ఒక్క క్రైస్తవ సాంప్రదాయానికే పరిమితం కాదు మనకి వాయు దేముడు, అగ్నిదేముడు, వగయిరాలు, వున్నట్లే, గ్రీకులకి 'వైను' దేముడున్నాడు, అతడి పేరు డయోనిసస్ సారాపై ఆధిపత్యం వహించే దేముడు రోమనులకికూడా వున్నాడు

సారా త్రాగకూడదని నిషేధించినది ఒక్క శుక్రాచార్యుల వారే కాదు గాంధిగారు కూడదన్నారని ప్రొహిబిషన్ పెట్టేం ఓటమిని అంగీకరించి సారా కొట్లు సోడాబడ్డీలలా తెరిచేసేం మనమే కాదు అమెరికాలో ప్రొహిబిషన్ ప్రయత్నించి, దొంగసారా వాళ్ళతో సాలలేక ప్రభుత్వం ఓటమిని అంగీకరించింది ఆ మాట కొస్తే, చైనా చరిత్రలో ప్రొహిబిషన్‌ని ప్రవేశపెట్టడం, తిరిగి రద్దు చెయ్యడం కనీసం 41 సార్లయినా జరిగిందిట!

## 3. వాణిజ్య, వ్యాపార దృక్పథం :

ఇప్పుడు ఆల్కహాలుని మరొక దృక్పథంతో చూద్దాం ముందుగా, యీ "ఆల్కహాలు" అనేది ఒక యింటిపేరు, ఒక జాతి పేరు లాంటిదని గుర్తించడం అవసరం ఈ జాతిలో ఎన్నో రకాల "ఆల్కహాళ్ళు" (లేక 'ఆల్కహాలులు' అందామా?) వున్నాయి ఈ జాతిలో ఒకదాని పేరు ఎతల్ ఆల్కహాలు ఇదే మనం త్రాగే పానీయాలలో వుండేది పేరు, రంగు, రుచి, వాసన, సీసా ఆకారం, త్రాగేచోటు యివన్నీ మారినా, నిజంగా మనకి నిషా ఎక్కించే పదార్థం యీ ఆల్కహాలే! ఈ ఎతల్ ఆల్కహాలు తప్పించి, మరే పేరున్న ఆల్కహాలు త్రాగినా ప్రాణాలు పోవడం తథ్యం కనుక ప్రస్తుతానికి ఆల్కహాలంటే యీ ఎతల్ ఆల్కహాలనే అర్థం చెప్పుకుందాం!

ఏది ఏమైతేనేమి, ఎప్పుడో, ఎవ్వరో కనిపెట్టేరు పళ్ళనీ, పళ్ళరసాలనీ అలా ఆరుబయట వదిలేస్తే అవి నెమ్మదిగా ఆల్కహాలుగా మారతాయని ఏమవుతుందంటే సూక్ష్మజీవులు యీ రసంలో పడి, (ఈ సూక్ష్మజీవులు కంటికి కనబడకపోయినా, మన చుట్టూ వున్న గాలిలో ఎప్పుడూ వుంటాయి), రసంలోని పంచదారని ఆల్కహాలుగా మార్చేస్తాయి దీనినే తెలుగులో పులియబెట్టడం అంటారు ఇంగ్లీషులో ఫెర్మెంటేషన్ అంటారు తెలిసిసో, తెలియకో అనాది మానవుడు యిలా పులిసిన పదార్థాలు తిన్నాడు తిన్న తర్వాత వచ్చే ఆనందాన్ని అనుభవించేడు అనుభవించిన మానవుడు రుచి మరిగాడు ప్రత్యేకంగ పనిగట్టుకుని పులియబెట్టడం మొదలుపెట్టేడు మొట్టమొదటి ఉద్యోగం వ్యభిచారం అయితే మొట్టమొదటి పరిశ్రమ కల్లు కాచడం అయుండాలి!

ఇలా పులియబెట్టగా వచ్చిన పానీయాలకి రకరకాల పేర్లు వున్నాయి ద్రాక్షరసాన్ని పులియబెట్టగా వచ్చేదాని పేరు వైను లేదా సారా పిండి పదార్థాలని పులియబెడితే మరొక రకం పానీయం వస్తుంది బార్లీ మొదలయిన ధాన్యాలని నానబోసి, మొక్క మొలిచే స్థితిలో పులియబెడితే బీరు వస్తుంది ఈ వైను, బీరులలో ఆల్కహాలు (అంటే, ఎతల్ ఆల్కహాలు) నూటికి పది, పదిహేను పాళ్ళవరకూ వుంటుంది మిగిలినదంతా నీళ్ళే ఈ పానీయాలని వేడిచేసి, బట్టీ పట్టి, చాలమట్టుకి నీళ్ళని బైటకి వెళ్ళగొడితే వీటిలోని ఆల్కహాలు శాతం పెరుగుతుంది, ఇలా బీరుని బట్టీపడితే బ్రాందీ వస్తుంది వైనుని బట్టీపడితే విస్కీ వస్తుంది అలాగే పులియబెట్టిన చెరకురసం నుండి 'రమ్ము' తయారుచేస్తారు ఈ జాబితాకి అంతులేదు ఈ 'రమ్ము'నే సంస్కృతంలో మైరేయం అనీ, ఆసవం అనీ, శీధు అని మూడు పేర్లతో పిలుస్తారు ఈ మూడు పేర్లూ మూడు రకాల 'రమ్ము' లని సూచిస్తాయి అసలు సంస్కృతంలో యీ పానీయాలకి వున్నన్ని పేర్లు ఇంగ్లీషులోకూడ లేవేమో! ద్రాక్షపళ్ళతో చేసిన 'వైను'ని సంస్కృతంలో మార్ద్వీకం అంటారు మధ్వాసవం, మాధవకం, మధు అన్నవి ఇప్పపువ్వుతో చేసిన కల్లుకి పేర్లు అధేమిటో

ఇంగ్లీషు మాటలు అర్థం కాకపోయినా వాడేస్తాం కానీ, దేశవాళీ మాటలని వాడడానికి చిన్నతనం పడిపోతాం!

ఇంతవరకు రెండు రకాల మద్యపానాలు చూశాం. పులియబెట్టగా వచ్చిన వైను (మార్ద్వీకం), బీరువంటి వాటిని ఇంగ్లీషులో ఫెర్మెంటెడ్ లిక్కర్స్ అంటారు. బట్టీపట్టగా వచ్చినవాటిని డిస్టిల్డ్ లిక్కర్స్ అంటారు. ఇలా వైనుని బట్టీపట్టి బ్రాందీ చేసే క్రియని సంస్కృతంలో 'అభిషవం' అంటారు. ఏ పేరుపెట్టి పిలచినా బట్టీ పట్టినప్పుడు కల్లులో అల్కహాలు పాలు పెరుగుతుంది. ఒక పానీయంలో అల్కహాలు ఎన్ని పాళ్ళు వుందో తెలియజెయ్యడానికి ఇంగ్లీషులో 'ప్రూఫ్' అన్నమాట వాడతారు. వైన్‌లో 15 శాతం అల్కహాలు వుంటే ఆ వైనుని 30 ప్రూఫ్ అంటారు. 50 శాతం అల్కహాలువున్న విస్కీ 100 ప్రూఫ్ అన్నమాట. రసాయనిక పరిశోధనశాలలో వాడే ఎతల్ అల్కహాలులో 95 శాతం అల్కహాలే! అంటే ఇది 190 ప్రూఫ్ అన్నమాట. నూటికి నూరు పాళ్ళూ అల్కహాలే (అంటే కల్తీ లేదన్న మాట) వున్న ద్రవం 200 ప్రూఫ్! ఈ రకం అల్కహాలు అపురూపమైనది, విలువైనది, అరుదైనది. సీసా బిరడా తీసేసరికి గాలిలోని చెమ్మ చేరి కల్తీ అయిపోతుంది.

ఎతల్ అల్కహాలుకి క్రిమి సంహారక లక్షణాలు వున్నాయి. దీనికి 140 ప్రూఫ్ అల్కహాలుని వాడతారు. 140కి ఎక్కువైనా, తక్కువైనా పనికిరాదు. డాక్టరు ఇంజక్షన్ ఇచ్చేముందు దూదితో జబ్బ మీద యీ రకం అల్కహాలునే పులుముతాడు. ఆ తర్వాతనే సూదితో పొడుస్తాడు. ఇలా చెయ్యడం వల్ల చర్మంమీదనున్న సూక్ష్మజీవులు సూదితోపాటు లోపలికి వెళ్ళకుండా జాగ్రత్తపడుతున్నామన్నమాట.

ఎతల్ అల్కహాలుకి అగ్గిపుల్ల తగిలిస్తే మంట మండుతుంది కూడాను. పెట్రోలుకి కరువు వచ్చినప్పుడు, యీ ఎతల్ అల్కహాలుని పెట్రోలుకి బదులు వాడొచ్చు. దినుసులు సమృద్ధిగా దొరికి తినగా మిగిలిపోతే, వాటిని ఎతల్ అల్కహాలుగా మార్చి, పెట్రోలుకి బదులు వాడొచ్చు. నా చిన్నతనంలో, పెట్రోమేక్సు దీపాలని వెలిగించడానికి ముందు 'మేంటిల్'ని స్పిరిట్ మంటతో వేడెక్కించేవాళ్ళం. ఈ స్పిరిట్ యీ ఎతల్ అల్కహాలే! కాని, ఆ రోజుల్లో, దేశంలో ప్రొహిబిషన్‌కూడా వుండేది. అంటే, చట్టరీత్యా, అల్కహాలు కలిపిన పానీయాలు నిషేధించబడ్డాయన్నమాట. అటువంటప్పుడు, దీపాలలో వాడకానికని స్పిరిటు కొనుక్కొని ప్రజలు తాగేయకుండా వుండాలని, యీ స్పిరిట్‌లో విషం కలిపి, సీసా మీద పుర్రె బొమ్మ వేసేవారు. ఇలా విషం కలిపిన స్పిరిటుని ఇంగ్లీషులో డినేచర్డు స్పిరిట్ అంటారు. ప్రభుత్వం వారు కలిపితే 'డినేచర్డు', ప్రజలు కలిపితే, కల్తీ!

కల్తీ అంటే గుర్తుకొస్తున్నది. కల్తీపడ్డ కల్లు, సారాయి తాగి కళ్ళు పోగొట్టుకున్నవాళ్ళ గురించీ, ప్రాణాలే పోగొట్టుకున్నవాళ్ళ గురించి వార్తలు వింటూనే వుంటాం. సారాని యిలా కల్తీ చెయ్యడం చాల సులభం. ఎతల్ అల్కహాలు జాతికి చెందిన, మిగిలిన అల్కహాళ్ళన్నీ విషపదార్థాలే! ఉదాహరణకి ఎతల్ అల్కహాలుకో అప్పగారున్నారు. దాని పేరు మెతల్ అల్కహాలు. దీనిని తయారు చెయ్యడం చాల తేలిక. అందుకని యిది చవుక. అప్పచెల్లెళ్ళలాంటి యీ రెండు అల్కహాళ్ళూ, క్షీరనీరాల్లా సులభంగా కలిసిపోతాయి. అందుకని, అజ్ఞానంతోనే కానీయండి, పేరాసతోనే కానీయండి, నిజాయితీ నశించిన వర్తకులు కొందరు యీ మెతల్ అల్కహాలుని ఎతల్ అల్కహాలుతో కలిపి అమ్మేస్తూ వుంటారు. అందుకని స్వర్గపు టంచులు చవిచూద్దామనే సరదాలో చవకరకం సారాలు తాగేస్తే, అంచుల వరకూ ఏమి కర్మ, స్వర్గం లోగిట్లోకే వెళ్ళే ప్రమాదం వుంది!

## 4. సాంఘిక దృక్పథం :

మోతాదు మించకుండా, కల్తీలేని కల్లు తాగితే ఒక విధమయిన ఆహ్లాదమూ, ఆనందమూ పుడతాయి. ఉత్సాహాన్ని కల్పించడమే కాకుండా సంఘం ఏర్పరచిన అవధులని మరపింపజేస్తుంది. అల్కహాలు యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం సడలిపోయిన స్థితిలో చెయ్యకూడని పనులు చెయ్యడం, ఆడకూడని మాటలాడడం మొదలవుతుంది. అమెరికా వంటి దేశాలలో కారు ప్రమాదాలకి ఒక ముఖ్య కారణం తాగేసిన మైకంలో కారు తోలడమే! ఈ రకం ప్రమాదాలని విస్మరించి, బాగుంది కదా అని బుద్ధిని మరికొంచెం పట్టిస్తే, ఇంద్రియ పటుత్వం సన్నగిల్లి, ప్రేలాపన, తూలుడు మొదలవుతాయి. తగవులొస్తాయి. అదృష్టహీనులయిన భార్యా, పిల్లల వీపులు విమానం మోత మ్రోగే అవకాశం లేకపోలేదు. ఆ తర్వాత విడాకులు. అప్పుడీ అలవాటు శృతిమించి రాగాన పడడం! సీసాకి దాసులై దేవదాసులా మారడం!!

అసలు అల్కహాలు అలవాటుకి బానిసలవడమనేది ఒకరకం జబ్బనీ, అన్ని జబ్బులనీ కుదిర్చినట్లే దీనినీ కుదర్చవచ్చనీ కొందరి అభిప్రాయం. మొగవాళ్ళు తాగినా ఫరవాలేదు కాని, ఆడవాళ్ళు అస్సలు తాగకూడదని మరికొందరి వాదన. ఆడువారు అతిగా అల్కహాలు తాగితే వారి పాలిండ్లకి కేన్సరు వస్తుందని కొందరు అంటున్నారు. గర్భిణీ స్త్రీలు ముఖ్యంగా యీ అల్కహాలుని ముట్టకూడదని పెద్దలు నొక్కి చెబుతున్నారు. ఇదమిద్ధంగా వీటన్నిటికి సమాధానాలు కావాలంటే అల్కహాలు రసాయనం అర్థం అవాలి.

## 5. రసాయనిక దృక్పథం :

రసాయనిక శాస్త్రవేత్తల దృష్టిలో 'ఆల్కహాలు' అనేది ఒకజాతి పేరు అని అనుకున్నాం కదా! ఈ జాతిలో ముఖ్యమైనకొన్ని శాల్తీల పేర్లు మెతల్ ఆల్కహాలు, ఎతల్ ఆల్కహాలు, ప్రొపైల్ ఆల్కహాలు, బ్యూటైల్ ఆల్కహాలు మొదలయినవి-యింకా ఎన్నోవున్నాయి వీటన్నిటికి పేర్లు ఎలా పెడతారు, ఆ పెట్టిన పేరుని గుర్తించుకోవడం ఎలా, అన్న సమస్యలతో సతమతమయి రసాయనిక శాస్త్రపు పొలిమేరలకికూడ పోరు కొంతమంది ఈతరానివాడు గోదావరిలో దూకితే ఏమవుతుందో అలాగే ఒడుపు తెలిసికోకుండా రసాయనికశాస్త్రం చదివితే మునిగిపోవడం తప్పదు ఇక్కడ మనకి కావలసిన ఒడుపు ఏమిటంటే పదార్థాలకి పేర్లు పెట్టే పద్ధతి.

టూకీగా చెప్పాలంటే, పదార్థాలన్నీ అణువుల సముదాయం అని చాల మందికి తెలుసు ఒక బణువులో ఏయే అణువులు వున్నాయో తెలిస్తే చాలదు, అవి ఎలా అమర్చబడి వున్నాయోకూడ తెలియాలి ఉదాహరణకి మెతేను అనే పదార్థం వుంది ఈ పదార్థపు బణువులో ఒక కర్బనపుటణువు, నాలుగు ఉదజని అణువులు వున్నాయి ఉరమరగా వీటి అమరిక యీ దిగువ బొమ్మలో చూపినట్లు వుంటుంది ఈ బణువునుండి ఒక ఉదజని అణువుని తీసేసి దాని స్థానంలో ఒక ఆమ్లజని- ఉదజని కలసిన జంటని ప్రవేశపెడితే, మన మెతేను కాస్తా మెతల్ ఆల్కహాలుగా మారుతుంది.



మెతేను మెతల్ ఆల్కహాలు

మనం యిప్పుడు చేసిన పనిని రసాయనిక శాస్త్రజ్ఞులు మరొక విధంగా వర్ణిస్తారు వారేమంటారంటే మెతల్ గుంపు (అంటే సిహెచ్3కి హైడ్రాక్సిల్ గుంపు (అంటే, ఒహెచ్) తగిలిస్తే మెతల్ ఆల్కహాలు వస్తుంది అలాగే, ఎతల్ గుంపుకి హైడ్రాక్సిల్ గుంపుని తగిలిస్తే ఎతల్ ఆల్కహాలు వస్తుంది, ఇదే విధంగా ప్రొపైల్ ఆల్కహాలు, బ్యూటైల్ ఆల్కహాలు వగయిరాలు.



ఎతేను ఎతల్ ఆల్కహాలు

## 6. ఆల్కహాలుని తెలుగులో ఏమనాలి ?

ఇంగ్లీషులో వ్యదో ఎన్నో పేర్లు, సంస్కృతంలో పాతికపైబడి పేర్లు వున్నాయి కదా, యిప్పుడు తెలుగులో మరొకపేరు ఎందుకు ? వాడుకలో కల్లు అనేమాట వుంది కాని, శాస్త్రీయంగా, కాలక్షేపానికి, కొన్ని ప్రయోగాలు చేసి చూద్దాం

మెతేనుతో మొదలు పెడదాం అసలు యీ 'మెతేన్' అన్న మాటా, 'మెతల్' అన్నమాటా గ్రీకు భాషలోని 'మెతోస్' అన్న శబ్దం నుండి వచ్చాయి కర్ర, కంప, పేడ, పిడక వంటి కాలే 'వంట చెఱకు'ని 'సూచిస్తుందా మెతోస్' అన్నమాట అందుకే యీ కర్రా, కంపా. పేడా, పిడకా వంటి పదార్థాలు కుళ్ళగా వచ్చే వాయువుని 'మెతేను' అన్నారు పేడ, పిడకలకి పాడితో సంబంధం వుందిగనుక, 'పాడేను' అన్నమాటతో మెతేనుని తెలిగిస్తేనో ? కాని యీ రకం భాషాంతరీకరణంలో ఒక చిక్కువుంది మెతేను తెలుగులో పాడేను అయితే, మెతేను జాతికి చెందిన ఎతేను, ప్రొపేను, బ్యూటేను వంటి వాటి మాట ?

పైన చెప్పిన చిక్కులని తప్పించుకుందికి మరొక పుంత వెంబడి వెళ్ళిచూద్దాం మెతేనుయొక్క బణువులో ఒకే ఒక్క కర్బనపు టణువు వుంది ఎతేనులో రెండు కర్బనపు టణువులు వున్నాయి ప్రొపేనులో మూడు బ్యూటేనులో నాలుగు, . .అలా ఇప్పుడు మెతేనుని మొదటి తిథితో పోల్చి 'పాడేను' అంటేనో? అప్పుడు ఎతేనుని 'విదేను' అన్నమాటతో తెనిగించవచ్చు ఇదే బాణీలో 'తదేను', చవితేను లేదా చతుర్దేను, పంచేను, అనిపేర్లు పెట్టుకుంటూ పోవచ్చు !

ఆల్కహాలుకి తెలుగు పేరు పెడదామన్న తాపత్రయంతో మొదలు పెట్టి తప్పుదారి తొక్కాం అసలు యీ మెతల్ ఆల్కహాలుకి శాస్త్రజ్ఞులు 'మెతల్ ఆల్కహాలు' అన్న పేరు పెట్టక పూర్వం, ఇంగ్లీషు భాషలో 'వుడ్ ఆల్కహాలు' అన్న పేరుతో చలామణీ అయ్యేది ఈ వుడ్ ఆల్కహాలుని మనం 'కఱ్ఱ సారా' అనొచ్చు నిజానికి కఱ్ఱలని ఆవంలో పెట్టి బట్టీ పడితే కఱ్ఱసారా వస్తుంది రసాయనిక శాస్త్రజ్ఞులు రంగంలోకి దూకేసరికే దీనికి కఱ్ఱసారా అనీ, కంపసారా అనీ మెతల్ ఆల్కహాలనీ, రకరకాల పేర్లు వుండేవి భాష మారితే పేరుమార్పు ! ఒకే భాషలో కూడ రకరకాల పేర్లు ! ! తెలంగాణా వారి భాష సర్కారు జిల్లాల వారికీ, గుంటూరు వారి భాష 'ఈసాపట్నం' వారికీ అర్థం కానట్లే, రసాయనిక శాస్త్రవేత్తలకి ఒకరి భాష ఒకరికి అర్థం కాకుండా పోయింది పరిస్థితి యిలా విషమించే సరికి, చాలమంది ఒక అంతర్జాతీయ సభలో సమావేశమై ఒక ఒప్పందానికి వచ్చేరు. ఈ ఒప్పందం ఏమిటయ్యా అంటే పాతపేర్లన్నీ తీసేసి సరికొత్తపేర్లు పెట్టడం ఈ కొత్తపేర్లు పెట్టేటప్పుడు ఒక పద్ధతి ప్రకారం పెట్టడం దీనిని జెనీవా ఒప్పందం అంటారు

ఈ జనీవా ఒప్పందం ప్రకారం, ఆల్కహాలు జాతికి చెందిన పదార్థాల పేర్లన్నీ 'ఓల్' (-ఓఎల్) అన్న శబ్దంతో అంతం అవాలి ఈ ఓల్' -ఓఎల్ ఎక్కడ నుండి వచ్చిందంటే, యిది ఆల్కహాలు అన్న మాటలోని అంత్య శబ్దం ఈ లెక్క ప్రకారం మెతల్ ఆల్కహాలు అన్నది మెతనోల్‌గా మారాలన్నారు ఎతల్ ఆల్కహాలు ఎతనోల్‌గా మారాలన్నారు

ఇక్కడ వర్ణక్రమానికీ ఉచ్చారణకీ సంబంధించిన చిక్కు ఒకటి వస్తుంది ఇంగ్లీషులో ఓఎల్‌తో అంతం అయ్యేటట్లు మాట వ్రాసినప్పటికీ, చదివేటప్పుడు 'ఓల్' అనకుండా 'ఆల్' అనే అంతం చేస్తాం చూడండి, ఆల్కహాలు అన్నాం కాని, మళయాళీ వాళ్ళలా 'ఆల్కహోల్' అనలేదే! హాలయితేనేమి, హోలయితేనేమి, ఎందుకీ రాద్ధాంతం అని అనిపించవచ్చు, కొందరికి దీనికి కారణం లేకపోలేదు మెతేనుని మెతల్ ఆల్కహాలుగా మార్చి, దానికి మెతనాల్ అని పేరు పెట్టినట్లే, మెతేనుని ఫార్మాల్డిహైడ్‌గా మార్చినప్పుడు దానికి మెతనాల్ అని 'ఆల్' శబ్దంతో అంతం అయ్యేలా పేరు పెట్టమని జనీవా ఒప్పందంలో తీర్మానించారు అంటే ఆల్కహాళ్ళన్నా 'ఓల్' శబ్దం లోనూ, ఆల్డిహైడ్లు అన్నీ ఆల్ శబ్దంతోనూ అంతం అవాలన్నారన్న మాట! అంటే శుద్ధ తెలుగులో, అదే సంస్కృతంలో, చెప్పాలంటే ఆల్కహాళ్ళు అన్నీ 'ఒలంతాలు', ఆల్డిహైడ్లు అన్నీ 'అలంతాలు'

ఆల్కహాళ్ళన్నింటిని కలిపి ఒలంతాలు అంటే, మెతల్ ఆల్కహాలు కాస్తా 'మెతలోలంతం' అవుతుందా? మెతేనుని పాడౌను అన్నాం గనుక, మెతల్ ఆల్కహాలుని పాలోలంతం అనొచ్చా? మెతల్ ఆల్కహాలు కర్రలోంచి వచ్చింది కనుక, కర్రని కాష్ఠం అంటారు కనుకనున్నూ, ఆల్కహాళ్ళన్నీ ఒలంతాల కనుకనున్నూ, మెతల్ ఆల్కహాలుని 'కాష్ఠోల్' అందామా? లేక తెనుగుసేతలో ఎందుకొచ్చిన యీ కష్టాలు అని వూరుకుందామా?

## 7. ఆల్కహాలు ఉపయోగాలు

ఒలంతాలు త్రాగడానికి మంచివి కావు కానీ, వీటివల్ల మనకి వుపయోగం లేకపోలేదు ఉదాహరణకి "మెతలో లంతం" (మెతల్ ఆల్కహాలు) వుంది ఇది రసాయనిక పరిశ్రమలో చాల ముఖ్యమయిన ముడిపదార్థం దీనిని 'ఇండస్ట్రియల్ సాల్వెంట్' అంటారు రెండు, మూడు పదార్థాలమధ్య రసాయనిక ప్రక్రియని ప్రోత్సాహించాలంటే, ఆయా పదార్థాలని ముందు మెతల్ ఆల్కహాలులో కరిగించి, ఆ ద్రావణాలని కలుపుతారు మనకి కావలసిన రసాయనిక క్రియ యీ ద్రావణంలో జరుగుతుందన్నమాట 'ఓడ దాటేదాక ఓడ మల్లయ్య, ఓడ దాటిన తర్వాత బోడి మల్లయ్య అన్నట్లు మనపని అయిపోయిన తర్వాత, యీ ద్రావణాన్ని కొద్దిగా వేడిచేస్తే అది ఆవిరై పైకిపోతుంది రసాయనిక క్రియవల్ల సంభవించిన నూతన పదార్థం మనకి మిగులుతుంది మెతల్ ఆల్కహాలు 65°సి దగ్గరే మరిగి పోతుంది కనుక, మరిగించడానికి, ఇగిరించడానికి అయ్యేఖర్చు కూడ తక్కువే!

ఎతల్ ఆల్కహాలు యొక్క ఉపయోగాలు కొన్ని చవి చూశాం! గుల్మమందుగానే కాకుండా, ఇండస్ట్రియల్ సాల్వెంట్‌గా కూడ దీనిని వాడతారు క్రిమి సంహారిణిగా, కారు ఇంజనులో పెట్రోలుకి బదులు వాడే ఇంధనంగా, యింకా ఎన్నో వుపయోగాలువున్నా యీ ఎతల్ ఆల్కహాలుకి ఇందుకనే కాబోలు, అమెరికాలో మకుటం లేని మహారాజుగా వెలిగిన బెంజమిన్ ఫ్రాంక్లిన్ అన్నారు "సారా దేముడియొక్క వరం భగవానుడికి మనమీద అనురాగం వుందనడానికిదొక ప్రత్యక్ష నిదర్శనం!"

మెతల్ ఆల్కహాలు తర్వాత చెప్పదగ్గది ఐసోప్రోపైల్ ఆల్కహాలు లేదా, జనీవా ఒప్పందం ప్రకారం ప్రొపనోలు ఇందులో మూడు కర్బనపు టణువులు వుండి, మధ్యనున్న కర్బనపు టణువుకి మాత్రం 'హైడ్రాక్సిల్ గుంపు' తగిలించబడి వుంటుంది ఇలా 'ఐసో' అన్న పేరు మొదటవున్న పదార్థాలన్నిటిలాగే, దీని నిర్మాణక్రమంలో పార్శ్వ సౌష్టత కనిపిస్తూ వుంటుంది (దిగువ పటం చూడండి)




ఈ ఐసోప్రోపైల్ ఆల్కహాలుకే '2-ప్రొపనోలు' అని మరో పేరు వుంది దీనిని "2-త్రయాలు అని తెలిగించవచ్చు "త్రయ" శబ్దం మూడు కర్బనపు టణువులని చెబుతుంది, ఓల్' శబ్దం జనీవా ఒప్పందం ప్రకారం ఆల్కహాలుని సూచిస్తుంది, ముందున్న ౨ అంకె, రెండవ కర్బనపు టణువుకి ఓహెచ్ గుంపు తగిలించాలని చెబుతుంది. ఈ ఐసోప్రోపైల్ ఆల్కహాలుకీ, ఎతల్ ఆల్కహాలుకీ కొన్ని పోలికలు వున్నాయి ఇదీ విషపదార్థమే కాని, మెతల్ ఆల్కహాలంత అన్యాయం కాదు దీనికున్న ఘాటైన రుచిమూలంగా, ప్రజలు దీన్ని పరాగ్గా కూడ తాగడానికి ఇష్టపడరు కనుక, ఒక్క తాగుడుకి తప్ప, యీ ఐసోప్రోపైల్ ఆల్కహాలుని చాలచోట్ల వాడతారు సిరాలు, సెంట్లు, అత్తరులు, గెడ్డం గీసుకున్న తర్వాత గెడ్డానికి పులుముకుందికి, వగయిరా పనులకి దీనిని విరివిగా వాడతారు ఈ ఐసోప్రోపైల్ ఆల్కహాలు శరీరానికి పూసుకుంటే చల్లగా, ఆహ్లాదకరంగా వుంటుంది చిన్నపిల్లలకి జ్వరం విపరీతంగా వస్తే, వుష్ణాన్ని తగ్గించడానికి వైద్యులు యీ ఆల్కహాలునే శరీరానికి మర్దనా చేస్తారు అందుకనే దీనిని రబ్బింగు ఆల్కహాలు లేక "మర్దనాలు" అనికూడా

అంటారు నేనిలా వ్రాసేనని వైద్యుడి సలహా, పర్యవేక్షణా లేకుండా, మీకు చేతికి అందిన ఆల్కహాలుని పసిపిల్లల శరీరాలకి పూయకండి ప్రాణాలు పోగలవు!!

ఇంతవరకు చిన్న చిన్న బణువులు వున్న ఆల్కహాళ్ళు (ఆల్కహాలుకి బహువచనం) గురించి చూశాం అంటే మెథిల్, ఎథిల్, ఐసోప్రోపైల్ ఆల్కహాళ్ళు ఇవన్నీ కూడ నీటితో ఏ పాళ్ళలో కలిపినా కలిసిపోతాయి ఈ లక్షణాన్ని ఇంగ్లీషులో మిసిబిల్ ఇన్ ఆల్ ప్రపోర్షన్స్ అంటారు కాని ఆల్కహాలు బణువులోని కర్బనపు గొలుసు పొడుగు పెరిగేకొద్దీ యీ లక్షణం క్రమేపీ నశించిపోతుంది ఉదాహరణకి బ్యూటైల్ ఆల్కహాలు వుంది దీని బణువులో, వరుసగా, గొలుసు మాదిరి నాలుగు కర్బనపు టణువులు వుంటాయి (అందుకని, దీనిని తెలుగులో చతురోల్ అనొచ్చు!) పదిఔన్సుల బ్యూటైల్ ఆల్కహాలు, పది ఔన్సుల నీళ్ళు కలిపితే, యీ రెండు క్షీరసీరాల్లా కలసిపోవు ఒక ఔన్సు బ్యూటైల్ ఆల్కహాలు నీళ్ళలో పూర్తిగా కరిగిపోతుంది. ఆదే విధంగా ఒక ఔన్సు నీళ్ల బ్యూటైల్ ఆల్కహాల్లో కరిగిపోతాయి ఆ తర్వాత ఏదీ, దేనిలోనూ కరగదు బాగా గిలకరిస్తే నురగ వస్తుంది కొంతసేపు నిదానంగా వదిలేస్తే రెండు ద్రవాలు విడిపోతాయి నీళ్ల అడుగున ఒక పొరగానూ, మీద బ్యూటైల్ ఆల్కహాలు తేలుతూ కనిపిస్తుంది కర్బనపు టణువుల సంఖ్య పెరిగేకొద్దీ యీ నీటిలో కరిగే లక్షణం పూర్తిగా పోతుంది

ఆల్కహాలు కథ యింతటితో అవలేదు మన మనుగడకే ముఖ్యమైన వైటమినులు వగయిరాలు కొన్ని యీ ఆల్కహాలు జాతికి చెందినవే! వీటి సంగతి మరోసారి చూద్దాం

---

# కళ్యాణగీత

## శ్రీ తిరుఃనగరి

మత్తుగా
చిందులు వేయించే
శివమెత్తించే
జావళీలోంచి రాదు చైతన్యం

సోమరిగా
కాలక్షేపం చేసే
లీలగా జీవితం గడిపే
భోగంలోంచి రాదు అభ్యుదయం

విలాసంగా
మనుగడ సాగించే
మహోద్రేకంగా భాషించే
హుళక్కిలోంచి రాదు కళ్యాణం

ఋషివంటి మహాకవి
హృదయంలోంచి
ఉప్పొంగే
కవితలోంచి వస్తుంది చైతన్యం

శ్రమజీవి కర్షకుడు
ఒలికే స్వేదంలోంచి
ఫలించే
బంగారంలోంచి వస్తుంది అభ్యుదయం

మనీషియైన నాయకుడు
జరిపే పాలనలోంచి
అగమించే
పరిణామంలోంచి వస్తుంది కళ్యాణం



# ఈ మాసం - మీ నక్షత్రఫలం

## మార్చి - 1988

### మేషం (అశ్విని, భరణి, కృత్తిక 1 పా)

అశ్వినివారికి ఈనెలంతా రాజయోగముగానే ఉండును లాభం బాగుగా కలసివచ్చును ఆరోగ్యం చక్కగా నుండును 27వ తేదీ వరకు ఒక విధంగా ధనలాభం, ఆపై నెలంతా విశేషంగా ధనము కలసి వచ్చును 24వ తే నుండి సంతాన సంబంధమైన వ్యయము, చిక్కులు కలుగును కుటుంబంలో సుఖశాంతులు, అనుకూల దాంపత్యము సంసార సుఖాభివృద్ధి కలుగును

భరణి వారికి కుజ, శని బాధ తొలగినట్లే కాని 17-31 తేదీల మధ్య సోదరజ్ఞాతి బంధు మూలకంగా ధన వ్యయము కలుగును అయినను నెలచివరి నాటికి ధనలాభము, కుటుంబ సౌఖ్యము మొదలగునవి జరుగును ఎవ్వరు ఎన్నివిధాల కుట్రలు పడినా, అన్నింటిని త్రిప్పికొట్టగలరు విజయమును సాధింపగలరు

కృత్తిక 1పా వారికి నిన్నమొన్నటి వరకు పట్టి పీడిస్తున్న ప్రతికూల వాతావరణం తొలగి పోతుంది పిరికి తనము ఆందోళనము, అనుమానం, మొ॥నవి తొలగి తలచిన పనులకు తగిన వాతావరణ మేర్పడుతుంది ఆరోగ్యం క్రమంగా సర్దుకొనును అవసరములకు తగిన ధనము చేకూరి పనులు సులభంగా నెరవేరుతాయి అయితే అనుకొన్న దానికంటె వ్యయంహెచ్చుగానే వుంటుంది స్తంభించిన కార్యాలు ఫలించి, చేతికివచ్చును

### వృషభం (కృత్తిక 2,3,4 పా రోహిణి, మృగశిర 1 2పా)

కృత్తిక 2,3,4 పా॥ వారికి ఇదివరకటి పెద్ద చిక్కులు ఉండవు కాని ఏదోవిధంగా ఎప్పటి కప్పుడు చిన్నచిన్న చిక్కులు ఏర్పడి మనస్సునకు చాపల్యమును కలిగించును కావలసిన వారితో మాట పట్టింపులు, కుటుంబంలో స్వల్పంగా అశాంతి ఏర్పడి తొలగిపోవును తాత్కాలికంగా కొందరుమిత్రులు దైవబలం వలన తటస్థపడి పనులు కొనసాగుటకు తోడ్పడుదురు

రోహిణి వారికి నెలంతా శారీరమానసిక శ్రమా,భేదమూ,త్రిప్పటా తప్పదు పనికి మాలిన వ్యయము కలుగును శుభకార్యములకై ప్రయత్నించుట, లేక చేయుట, ధనవ్యయము కలుగుట, చివరకు అనుకొన్న పనులు నెరవేరక పోవుట, జరుగును కుటుంబంలో అశాంతి, నలతలు, మనోవ్యాకులత కలుగును ఏపనియందును ఉత్సాహ చొరవ, కర్తవ్య దీక్ష పట్టుదల మొదలగునవి ఉండవు శని, గురులకు శాంతిచేయుట మంచిది

మృగశిర 1 2 పా వారికి 22 తే వరకు చాల చిక్కులుగా ఉండి, తదుపరి కొంతమేలుగా ఉండును సామాన్యయోగమే తప్ప ఈ నక్షత్రం వారికి చెప్పుకొనతగినంత పెద్ద యోగము కలసిరాదు మానసికంగా ఆందోళన, పిరికి తనమును, ముందువెనకలు తోచకుండుట విపరీతమైన ధనవ్యయం జరుగును బంధుమిత్రుల రాకపోకల వలన తప్పనిసరిగా శుభకార్యములలో పాల్గొనుట వలనకూడ ధనవ్యయం తప్పదు

### మిథునము (మృగశిర 3,4 పా ఆర్ద్ర పునర్వసు1 2 3 పా)

మృగశిర 3 4 పా వారికి ఇంచుమించు 22తే వరకు కుటుంబంలో అనారోగ్యం, నలతలు, భార్యకు అనారోగ్యం డబ్బునకు తొట్రుపాటు, మనస్సునకు పరిపరి విధములయిన ఆలోచనలు,జరుగ వలసిన పనులకు విపరీతమైన కాలయాపన ధనవ్యయం తప్పవు అయితే మధ్యమధ్య అవసరములకు తగినంత ధనము లభించుచు, చిన్నచిన్న కార్యములు నెరవేరి పోవుచుండును

ఆర్ద్రానక్షత్రం వారికి నెల చివరనుండి అనారోగ్యం ధన వ్యయం, మనోవైకల్యం, త్రిప్పట, స్థానభ్రంశము మొదలగునవి తరచుగా జరుగుచుండును అన్ని విషయములలోను ప్రతిష్టంభన యేర్పడును భార్యకు నలతచేయును ఏది ఎట్లున్నను దర్జా సుఖభోగములకు లోపముకలుగదు విద్యార్థులకు, ఉద్యోగులకుతప్ప మిగిలిన వృత్తులవారికి బాగుగా నుండును.

పునర్వసు 1 2 3 పా వారికి గతంకంటె కొంత మేలుగా నుండును విద్యార్థులకు ఉద్యోగులకు, వ్యవసాయ దారులకు, వృత్తి ఉద్యోగులకు కొన్ని అడ్డు ఆటంకములు మానసిక ఆందోళనము కలిగినను పట్టుదలతో, ధైర్యముతో వ్యవహరించి కార్యమును సాధించుకొనుట జరుగును 17వ తేదీ మొదలు నెలచివరి వరకు ఆర్థిక లోపముండదు. బంధువులు మూలకముగా కొంతవత్తిడి కలుగును

## కర్కాటకము (పునర్వసు 4 పా. పుష్యమి - ఆశ్లేష)

పునర్వసు 4 పా వారికి గతంకంటె కొంత మెరుగుగా వుండును ధనలోపము కలుగదు, స్థిర శుభకార్యములు కొంతలో కొంత సుఖముగా నుండును విద్యార్థులకు, ప్లీడర్లు, వైద్యులు, గ్రామికులు కర్షకులు మొదలైనవారికి కొంత మేలుగానుండును కాని శరీర శ్రమ నలత హెచ్చుగా నుండును ధరవరకు తట్టుకొనుట కష్టముగా నుండును నిరుద్యోగులకు శ్రమ ధనవ్యయం నిరాశా నిస్పృహలు హెచ్చుగానుండును

పుష్యమి వారికి ఎన్నిరూపాలలో ఎంతెంత కలిసి వచ్చినా, ఏదోవిధంగా వ్యయంకూడా (ఆదాయానికి మించి) కలుగుచుండును వర్తకులకు బాగుండును వ్యవసాయ దారులకు అప్పటప్పట ఆందోళకరంగా ఉండును విద్యార్థులకు, ఉద్యోగులకు, ఉత్సాహం ధైర్యం కలుగును ధనంబాగుగా కలసివచ్చును దైవబలం వల్ల అన్నికార్యములను సాధించుకొన గలుగుదురు

ఆశ్లేష వారికి నెలలో 3,4 వారాలు శరీరశ్రమ, ధనవ్యయం జరిగినా, విశేష ధనలాభం కలిసివచ్చుటవల్ల, శారీరక మానసిక శ్రమా, భేదమూ అంతగా బాధించవు సంతానమునకు మంచిఉత్సాహం చక్కని క్రమశిక్షణ విద్యలోబాగుగా రాణించుట జరుగును గతంలో వచ్చిన ఆటంకాలు కార్యస్తంభన తొలగిపోవును నూతననిర్మాణములు సువర్ణాభరణ ప్రాప్తియగును

## సింహము (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా)

మఘ వారికి శ్రమహెచ్చు ఫలితం తక్కువ (భర్త)భార్య ఆరోగ్యం, కొంతశ్రమను క్లేశాన్ని, ధనవ్యయాన్ని కలిగించును పర మార్థబుద్ధికలుగును సాధు సజ్జన సాంగత్యము, సద్గోష్ఠి, కొంత ఉపశాంతిని కలిగించును నెలచివరి వారములో భూ వ్యవహారాదుల్లో ఒకస్థాయికి వచ్చును మొత్తమ్మీద శుభాశుభ మిశ్రమంగా ఉండును

పుబ్బ నక్షత్రం వారికి 17తే తర్వాత మానసిక శ్రమకలిగినను అన్నివిధముల సుఖ సంతోషములు కలుగును ధనాదాయం బాగుండును స్త్రీ మూలకంగా ధనాదాయం కల్గును ఉద్యోగ వ్యవహారాదులలో అనుకూల వాతావరణం ప్రజలలో మంచి పేరు ప్రఖ్యాతులు కలిగి మనస్సునకు ఉల్లాసము కలుగును విద్యార్థులకు మంచి అనుకూలమైన కాలము

ఉత్తర 1 పా వారికి కోరితెచ్చిపెట్టుకొన్న శ్రమతప్ప అన్ని రంగాలలో అన్నివిషయాలలో వైద్య వ్యాపార ఉద్యోగ వృత్తులలోనున్నవారికి లాయర్లు ఉద్యోగులు మొ॥ వారికి అన్నివిధముల సుఖ సంతోషములు అభివృద్ధి చెందును శుభకార్య ప్రయత్నములన్నీ నెరవేరును ధనలాభం అన్ని విధాల కలసివచ్చును

## కన్య (ఉత్తర 2,3,4 పా హస్త చిత్ర 1,2 పా)

ఉత్తర 2, 3, 4 పా వారికి కూడ మంచి ఉత్సాహవంతమైన కాలము కాని హఠాత్తుగా అప్పుడప్పుడు మనస్సునకు వ్యధకలుగుచుండును విలాసమునకు దర్జా ఆడంబరములకు లేనిపోని గొప్పలకు పోయి ఋణాది బాధలుకూడ తికమకలు తెచ్చిపెట్టును ఐనా మంచి ఉత్సాహవంతులుగా ధైర్యంతో ఏవిషయము ఇతరులకు తెలియకుండా గుంభనగా ప్రవర్తించ గలుగుదురు హస్తవారికి కుజునిబాధ తొలగినను గురు శనులు ప్రతివిషయంలోను ఆశానిరాశలతో ఉత్సాహ నిరుత్సాహములు కలిగించి మానసికముగా లొంగదీయుదురు ఆరోగ్యముకూడ భంగమగును 3,11 తే॥ మధ్య మరింత నలతా శ్రమా బడలికా కలిగించును శని గురులకు జపశాంతులు చేయించుటమంచిది చిత్ర 1,2 పా వారికి 3 నుండి 22తే వరకు శరీరంలోనలత శ్రమా మానసికమైన ఆందోళన హెచ్చుగా నుండును తర్వాత కొంత అనుకూలత ఏర్పడి వివాహాది శుభకార్యప్రయత్నములు ఫలించును 23తేదీ నుండిఆర్థికముగా కలసి వచ్చును శుభకార్యములు అతి కష్టముమీద నెరవేరును లేదా వాయిదాపడి త్వరలోనే విజయం కలుగును

## తుల (చిత్ర 3,4 పా స్వాతి, విశాఖ 1,2,3, పా)

చిత్ర 3,4 పా వారికి 3తే మొదలు 23తేదీ వరకు అధిక వ్యయప్రయాసలు, చేతికి అందిన ఫలితము జారిపోవుట, మనోవైకల్యము ధనవ్యయము అధికముగా నుండును కావలసినవారు నమ్మించి ద్రోహము చేయుదురు ప్రజలలో అపవాదులు, నిందలు, భరించవలసి వచ్చును ఏ విషయమందును ఉత్సాహ ముండదు కాని గురుబలంవలన అన్నింటిని అధిగమించి పట్టుదలతో కార్యములను నెలచివరికి విజయమును పొందగలరు స్వాతి వారికి అన్ని విధాల బాగుగానే యుండును తల్లికి నలత చేయును, అధిక ధనవ్యయం కలుగును చిన్నచిన్న ఏక్సిడెంట్లు ఏవో జరుగవచ్చును దైవ పుణ్య శుభకార్యములకు ఆటంకములు కలుగు చుండును అయినా అందరిలోను మాటగౌరవము, పలుకుబడి హెచ్చును పరపతి పెరుగును నెలచివరినుండి కొంత బాగుండును

విశాఖ 1,2,3 పా వారికి నెలంతా అన్నివిధాల కలసివచ్చును శుభకార్య ప్రయత్నములు అనుకూలమలై ఫలించును విద్యార్థులు ఉద్యోగులు, కార్మికులు కర్షకులు మొదలగువారందరికి బాగుగా కలసివచ్చి సుఖసంతోషములను కలిగించు కాలమిది సద్గోష్ఠి, సజ్జన సహవాసము, మనస్సునకు ఉత్సాహం, ధైర్యం కలిగించును

## వృశ్చికం (విశాఖ 4 పా అనూరాధ జ్యేష్ఠ)

విశాఖ 4 పా వారికి శుభాశుభ మిశ్రఫలం కలుగును ఆర్థికంగా కొంత తొట్రుపాటుకలుగును ప్రతివిషయంలోను చిన్న చిన్న ఆటంకములు కలిగి తర్వాత ఫలించును ఆత్మీయులే కొంతమంది అకారణముగ శత్రుత్వమును వహించెదరు సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలిగినను వారితో మాటపట్టింపులు వచ్చును బంధుమిత్రులతో మాటపట్టింపులు వచ్చును

అనూరాధ వారికి శుభకార్య ప్రయత్నములు అతికష్టంమీద నెరవేరును ధనవ్యయము, ప్రయాసకలుగును బంధువులతో నిష్ఠూరములు కలుగును ఇంతవరకు స్తంభించిపోయిన కార్యములు ఒక్కటొక్కటే నెరవేరును గతంకంటె ధనలాభం బాగుండును. అన్ని వృత్తి రంగములవారికి కొంతమేలు కలుగును

జ్యేష్టవారికి అన్నివిధముల కార్యసిద్ధి వ్యవహార విజయము బంధుసౌఖ్యము, శుభకార్యసిద్ధి అనుకోనని విధంగా ధనలాభం చేకూరును గృహమందు వివాహాది శుభకార్యములు నెరవేరును ప్రజల యొక్క ప్రభుత్వంయొక్క మన్ననలకు సన్మానములకు పాత్రులగుట జరుగును 16,23 తే మధ్యమ్మాత్రం మనోవైకల్యము, స్వల్పంగా అనారోగ్యము కలిగి తొలగిపోవును

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

మూలవారికి శరీరంలో నలతా, శ్రమా, బడలికా పిరికితనము హెచ్చుగా నుండును బంధువిరోధం కలుగును ధనమునకు త్రొటుపాటు కలుగును శరీరంలో ఉష్ణము కలుగును అనుకొన్న కార్యమును సకాలంలో నెరవేరవు బంధువులపీడ హెచ్చుగా నుండును శని కుజులకు శాంతి చేయుట మంచిది

పూర్వాషాఢ వారికి ఇప్పుడిప్పుడు అనుకూల పరిస్థితులు యేర్పడుచున్నవి చెడుగు అంతా తొలగిపోయినట్లే ధనం పుష్కలంగా రాకపోయినను ఖర్చు పెట్టాలకు లోపముండదు ఇంకా బంధువిరోధము కొంతవరకు కొనసాగును సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును ప్రజాసన్మానము మాటపలుకుబడి హెచ్చును నెల మూడు నాలుగు, వారాలలో శ్రమ, బడలికా,ధనవ్యయం భార్యకు అనారోగ్యము కలిగి తొలగిపోవును

ఉత్తరాషాఢ 1పా అన్నివిధముల అనుకూలముగా నుండును తలపెట్టిన పనులన్నీ నెరవేరును పెద్దలయొక్క అధికారులయొక్క ప్రజలలోగల పలుకుబడియొక్క బలముచే ఈ నక్షత్రం వారికిఅన్ని రంగములలో నున్నవారికిని అన్ని విధముల వృత్తివ్యాపారములలో నున్నవారికిని నెలంతా రాజయోగముగా నుండును సంతానమునకు మంచి అభివృద్ధికలుగును

**మకరం** (ఉత్తరాషాఢ 2,3,4 పా శ్రవణము ధనిష్ట1, 2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4 పా వారికి నెల చివరి పదిరోజులూ చాలశ్రమ, ఉష్ణాధిక్యం కార్యభంగము మొదలగునవి జరిగినా ఆర్థిక లాభం పదుగురిలో మంచితనం బంధువులతో విశేషమైత్రీసంబంధ మేర్పడును సంతానానికి మంచిశుభయోగమైన కాలం శుభకార్యములు గృహంలోజరుగును వుద్యోగ వ్యాపారరంగాలలో అధికలాభం కలుగును కార్మిక కర్షక శ్రామిక వర్గాలకు వృత్తిమంతులకు సర్వులకు కూడా మేలైన కాలము ప్రతి పనిలో జయంకలుగును

శ్రవణం వారికి తలపెట్టిన శుభకార్యములకు ఆటంకములు కలుగును పనికిమాలిన ఆలోచనలు అధికం అహర్నిశలూ మానసికంగా ప్రతి విషయంలోనూ అనుమానాలు ఎదుటివారిమీద అకారణంగా ద్వేషం పెంచుకొనుట ఎదుటి వారిచే కొంచెము మాటపడి తనలో బాధపడుట జరుగును, ఆర్థికంగా తొట్రుపాటు కలుగును బంధుమిత్రులకు దూరం అగును తల్లికి స్వల్పంగా నలత విశేషంగా ధన వ్యయంకూడ జరుగును స్థానమార్పు లేదా వృత్తి ధర్మం చేత తిప్పట జరుగును

ధనిష్ట 1,2 పా వారికి 3,22 తేదీల మధ్య మానసిక శారీరక ఆర్థిక శ్రమకలుగును ఆర్థికవ్యయం హెచ్చు ఎంతటి గొప్ప వున్నత అవకాశాలు వచ్చినా వాటిని మూర్ఖత్వం అనుమానాలచే అందు కొనలేక తర్వాత పశ్చాత్తాప పడుట జరుగును అకారణకోపం చిరాకూ మొండిపట్టుదలహెచ్చును 23 తేనుండి ఆర్థిక వ్యయం తప్ప మిగిలిన వన్నీ సర్దుకొనును, గృహంలో తలపెట్టిన శుభకార్యములు నెరవేరును

**కుంభం** (ధనిష్ట 3,4 పా శతభిషం పూర్వాభాద్ర 1,2,3పా )

ధనిష్ట 3,4 పా వారికి ఆరోగ్యం బాగుండును ధనంబాగుగా కలసివచ్చినా చేతిలోని పచ్చుటకు కొంతఖర్చు అధికంగా అలస్యం జరుగును సోదరీ సోదరవర్గ మూలకంగా సహాయంజరుగును సంసార సౌఖ్యం బాగుండును విద్యార్థులకు రాజకీయ వాదులకు వర్తకులకు అన్నివిధాలా అనుకూలత జరిగి గృహంలో శుభకార్యములు నిర్విఘ్నంగా జరగును

శతభిషం వారికి నెల చివరిలో శ్రమా ధనవ్యయంకలుగును మిగిలిన కాలమంతా శుభాశుభమిశ్రఫలంతో గడచును సువర్ణాభరణ ప్రాప్తి వృత్తివ్యాపారాదులలో ఆర్థికలాభం పదుగురికి వుపకారం చేసే అవకాశం కలుగును విద్యార్థులకు వుద్యోగులకు వర్తకులకు వారి వారి వృత్తులలో ఆదాయంతో కూడిన అభివృద్ధి కలుగును. శుభకార్యాలలోపాల్గొనుట జరుగును నూతన వస్తువులను సేకరించుట జరగును

పూర్వాభాద్ర 1, 2, 3 పా వారికి శ్రమహెచ్చు ఫలితము తక్కువ లగ్జరీ ఖర్చులు పెరుగును దర్జా, ఔదార్యం, ఆడంబరంమొ॥ వానికి అవసరంలేని ఖర్చుపెరగను అట్టిఖర్చుల వలన విచారంగాని బాధగాని కలుగవు సోదరీ సోదర వర్గంతోను, బంధుమిత్రులతోను దోస్తీహెచ్చును సంతానమునకు మంచి అభివృద్ధి కలుగును ఈ నక్షత్రం విద్యార్థులకు పరీక్షలలో ఉత్తీర్ణత కలుగును

**మీనం** ,- (పూర్వాభాద్ర 4పా ఉత్తరాభాద్ర రేవతి)

పూర్వాభాద్ర 4పా వారికి అనవసరంలెని ఆడంబరంవల్ల, పదుగురిలో మెప్పుకోసం ప్రాకులాటవల్ల ధనవ్యయం జరుగును అయినా ఈ రాశి వారందరికినీ, పుష్కలంగా ధనలాభం కల్గును నిరుద్యోగులకు ఏదో ఒకవుద్యోగం లభించును విద్యార్థులకు విద్యాకృషిబాగుగా జరుగును పదుగురి పెద్దల ఆదరాభిమానాల, సహాయసహకారాల మూలకంగా ఈ నెల అంతా సుఖసంతోషాలతో గడచును

ఉత్తరాభాద్ర వారికిఈ నెలలో విశేషంగా ధనలాభం కలిగి క్రొత్తపరిశ్రమలు నెలకొల్పుట, గృహనిర్మాణాదులు భూప్రాప్తి శుభ కార్యములలో పాల్గొనుట జరుగును విద్యార్థులకు ఉత్తమశ్రేణి కలుగును వ్యవసాయదారులకు కట్టుబాటువంటి అధికలాభం వర్తకులకు విస్తారంగా ధన సంపద కలుగును ఉద్యోగులకు ప్రమోషన్ కలుగును ఈ నక్షత్రంలో పుట్టిన సర్వులకు వారి వారి అర్హతను బట్టి ఉన్నత స్థితికలుగును

రేవతి వారికి 16,23 తేల మధ్య మాతృవర్గంతోను, సోదర వర్గంతోను విరోధం కల్గును విశేషంగా ధనంకలసి వచ్చును అన్ని వ్యవహారాలలోను జయం కల్గును ప్రతిచిన్న విషయంలో ఆడంబరం అట్టహాసం హెచ్చు బంధుమిత్రులకు, శుభకార్యాలకు ఖర్చుఅధికంగా ఉండును కుటుంబ సంసార సౌఖ్యంబాగుండును గతంకంటే భార్యకు ఆరోగ్యం బాగుండును అందరి ప్రశంసలను, మన్నలను పొందుటకు తగిన యోగ్యత కలుగును

సిద్ధాంతి : **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**

శ్రీమతి డి. సంధ్యారాణి
శ్రీ కె. రాంచంద్రయ్య

# స్త్రీ శ్రామికుల సమస్యలు - ఒక పరిశీలన

[ఈ వ్యాసం వ్రాసిన వారు ఇద్దరూ కాకతీయ విశ్వవిద్యాలయం యొక్క అర్థశాస్త్ర విభాగంలో రిసర్చి స్కాలర్‌లుగా ఉంటున్నారు]

మన దేశ అభివృద్ధి ప్రణాళికల వ్యూహాల, కార్యక్రమాల ప్రధాన లక్ష్యం ఆర్థికాభివృద్ధి జాతీయాదాయ పెరుగుదల అంటే ఆర్థిక వృద్ధికి దారితీసే విధానాలకు జాతీయ ఉత్పత్తి పెరుగుదల, పొదుపు పెరుగుదల, ప్రభుత్వరంగ విస్తృతి మొదలైనవాటికి ప్రాధాన్యత ఇవ్వటం జరిగింది అయితే ఈ విధానాలు, పద్ధతులు, ప్రక్రియలవల్ల ఇతర అభివృద్ధి అంశాలకు ప్రేరణ జరుగలేదు అంటే పొదుపు, పెట్టుబడుల పెరుగుదల, ఉద్యోగావకాశాల పెరుగుదలకు దారితీయలేదు తత్ఫలితంగా సమాజంలో అసమానతలు మరింత ఎక్కువ అవుతున్నాయి ఈ అసమానతలు దేశ భౌతిక సంపద మానవ సంపదల పూర్తి వినియోగానికి ప్రతిబంధకాలవుతున్నాయి మానవ సంపదల్లో ప్రధాన భాగమైన స్త్రీ శ్రమకు తగిన విలువ, గుర్తింపు లభించటం లేదు ఇది చాలా విషాదకరమైన విషయం ఇది మన దేశ ఆర్థిక ఆలోచనారీతుల్లో ఒక పెద్ద లోపం ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోని శ్రామికవర్గ కుటుంబాలలో స్త్రీ ప్రముఖ పాత్ర వహిస్తుంది స్త్రీ శ్రామికులు భూమిలేని నిరుపేద మరియు సన్నకారు రైతుల కుటుంబాలనుండి వస్తుంటారు గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయం ప్రధానంగా వుంటుంది కాబట్టి స్త్రీ శ్రామికులు ఎక్కువగా వ్యవసాయకూలీలుగానే ఉంటారు కాని వ్యవసాయ పనులు సంవత్సరమంతా ఉండవు కాబట్టి స్త్రీ శ్రామికులు వ్యవసాయ పనులు అయిపోయిన తరువాత పట్టణ ప్రాంతాలలోని పరిశ్రమలలో గాని, గనులలో గాని లేదా ఇతర రంగాలలోగాని రోజువారి కూలీలుగా పని చేసి, తక్కువ ఆదాయాన్ని గడించి తమ కుటుంబాలకు ఆర్థికంగా సహాయపడుచున్నారు

మరియు స్త్రీ శ్రామికులపై లభ్యమవుతున్న సమాచారం శాస్త్రీయమైనదిగా లేదు అంటే స్త్రీల నిజజీవన స్థాయిని ప్రతిబింబించేదిగా లేదు సమాజంలోని అసమానతలను విస్మరించి, సనాతన పద్ధతుల ననుసరించి స్త్రీని ఒక వ్యక్తిగా కాక కుటుంబ సభ్యురాలిగా మాత్రమే గుర్తించడం అశాస్త్రీయం అశాస్త్రీయ నిర్వచనాలు, సమాచార సేకరణ పద్ధతులు, ప్రక్రియలు స్త్రీల వ్యక్తిత్వాన్ని, స్త్రీల శ్రమ విలువను కించపరుస్తున్నాయి స్త్రీల ఉత్పాదక సామర్థ్యాన్ని అనుత్పాదక శ్రమగా భావించినపుడు జాతీయ ఆదాయములో ఉత్పత్తి విలువ చేరవలసినంతగా చేరదు తత్ఫలితంగా పేదరికము పొదుపు పెట్టుబడులు, కొనుగోలుశక్తి లాంటి అంశాలు సరియైన అర్థాలను విలువలను తెలియచేయవు ఉత్పత్తిరంగములో స్త్రీలు మూలధన సేకరణకు దోహదం చేస్తున్నను, సాంప్రదాయక నిర్వచనాలవల్ల స్త్రీలు ప్రధాన ఉత్పత్తి విధానమునకు బాహ్యంగా ఉంచబడి శ్రామికులుగా పరిగణింపబడడం లేదు కాబట్టి వీరియొక్క సమస్యలపై తక్షణమే ఏదో ఒక పరిష్కార మార్గము చూపవలసిన ఆవశ్యకత మన ప్రభుత్వంపై ఉంది స్త్రీ జనోద్ధరణ మరియు రక్షణ గురించి మన శ్రేయోరాజ్యంలో ప్రత్యేకంగా చెప్పుకోవడం జరుగుతుంది కాబట్టి విధాన నిర్మాతలు మరియు పరిశోధకులు వీరి సమస్యలపై ఒక పరిష్కార మార్గాన్వేషనకై కృషి చేయవలసి ఉంటుంది స్త్రీకి ప్రతి విషయములోనూ స్థానంకల్పించి పురుషులతో పోటీపడేలా చేయడం మన ప్రభుత్వ కర్తవ్యం

షెడ్యూలు తెగలకు చెందిన శ్రామికులంతా నిరక్షరాస్యులుగానే యున్నారు షెడ్యూలు కులాలకు చెందిన స్త్రీ శ్రామికులంతా కూడా 100 శాతం నిరక్షరాస్యులుగానే ఉన్నారు ఇక వెనుకబడిన తరగతులకు చెందిన శ్రామికులు 90 9 శాతం నిరక్ష్యరాస్యులుగానే ఉన్నారు కేవలం 9 1 శాతం శ్రామికులు ప్రాథమిక విద్యనభ్యసించారు ఇతర కులాలకు చెందిన శ్రామికులు 6 4 శాతం ఉన్నారు

అందులో 75 శాతం ప్రాథమిక విద్య నభ్యసించారు మొత్తం శ్రామికులలో 24 22 శాతం షెడ్యూల్డు కులాల శ్రామికులు ఉన్నారు 13 -8 శాతం షెడ్యూల్డు తెగల శ్రామికులు వున్నారు 55 శాతం వెనుకబడిన తరగతులకు చెందిన శ్రామికులు ఉన్నారు ఇతర కులాలకు చెందిన శ్రామికుల శాతం తక్కువగా ఉంది మొత్తం శ్రామికులలో ఉన్నత విద్యను అభ్యసించినవారు అసలే లేరు

ఋణభార ప్రాతిపదికపై శ్రామికుల పంపిణీని పరిశీలించినపుడు పట్టిక-2 లో 60 శాతం పైన శ్రామికులు ఋణభారంతో ఉన్నారు అందులో 33 శాతం షెడ్యూల్డు కులాలవారు, 5 5 శాతం షెడ్యూల్డు తెగలవారు 50 శాతం వెనుకబడిన తరగతులవారు ఉండగా మిగతా 3 5 శాతం ఇతర కులాలకు చెందిన శ్రామికులు ఋణభారంతో ఉన్నారు

దాదాపు 55 శాతం శ్రామికుల ఋణభారం రు 1000 ల వరకు ఉంటుంది 26 3 శాతం శ్రామికులు రు 6000/-ల వరకు ఋణభారమును కలిగి ఉన్నారు 34 2 శాతం బంధువుల మరియు మిత్రులవద్ద, 26 3 శాతం వ్యవసాయాభివృద్ధి బాంకునుండి, 21 1 శాతం భూస్వామి వద్దనుండి, 18 4 శాతం శ్రామికులు వాణిజ్య బ్యాంకులనుండి ఋణం పొందియున్నారు బ్యాంకులనుండి ఋణం పొందిన శ్రామికులు ఎవ్వరూ ఇంతవరకు తిరిగి చెల్లించలేకపోయారు అందుకు కారణము 'కరువు' అని అధిక శ్రామికులు చెప్పడం జరిగింది ఇంకా యిందులో 50 శాతం షెడ్యూల్డు కులాలకు చెందిన శ్రామికులు వాణిజ్య బ్యాంకులనుండి ఋణం పొందినారు షె తె లకు చెందిన శ్రామికులు ఎవ్వరూ బ్యాంకునుండి ఋణ సహాయాన్ని పొందలేకపోయారు 56 4 శాతం వె త కు చెందిన శ్రామికులు వ్యవసాయ అభివృద్ధి బాంకునుండి ఋణం పొందినారు

## విద్య, కుల, మరియు వయో: ప్రాతిపదికపై శ్రామికుల పంపిణీ

పట్టిక - 1 (బ్రాకెట్లలోని సంఖ్యలు శాతములు)

| శ్రామికుల వయస్సు/ శ్రామికుల కులము మరియు విద్య | నిరక్షరాస్యులు షెకు | షెతె | వెత | ఇకు | ఉప మొత్తం | ప్రాథమిక విద్య షెకు | షెతె | వెత | ఇకు | ఉప మొత్తం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 18 సం॥ల లోపు | 2 [11 8] | 2 [2 ] | — | — | 4 [7 2] | — | — | — | 1 [33 3] | 1 [25] | 5 [8 3] |
| 19 నుండి 28 సం॥ | 6 [35 2] | 4 [50] | 9 [30] | 1 [100] | 20 [35 7] | — | — | — | 2 [66 7] | 2 [50] | 22 [36 7] |
| 29 నుండి 38 సం॥ | 7 [41 2] | 1 [12 5] | 12 [40] | — | 20 [35 7] | — | — | 1 [100] | — | 1 [25] | 21 [35] |
| 39 నుండి 48 సం॥ | 2 [11 8] | 1 [12 5] | 8 [26 7] | — | 11 [19 6] | — | — | — | — | — | 11 [18 3] |
| 49 నుండి 58 సం॥ | — | — | 1 [3 3] | — | 1 [1 8] | — | — | — | — | — | 1 [1 7] |
| మొత్తం | 17 [100] | 8 [100] | 30 [100] | 1 [100] | 56 [100] | — | — | 1 [100] | 3 [100] | 4 [100] | 60 [100] |

పట్టిక-1లో కుల, విద్య, మరియు వయో ప్రాతిపదికపై శ్రామికులను పంపిణీ చేయడం జరిగింది ఈ పరిశోధనలో 60 మంది స్త్రీ శ్రామికులను / గణనలోకి తీసుకోవడం జరిగింది 71 7 శాతం శ్రామికులు 19 నుండి 30 సం॥ల మధ్య వయస్సులో ఉన్నారు 49 సం॥ల నుండి 58 సం॥ల మధ్య వయస్సు గల శ్రామికులు 1 7 శాతం ఉన్నారు ఇందులో 93 6 శాతం శ్రామికులు నిరక్ష్యరాస్యులుగానే యున్నారు

## ఋణ భార మరియు కుల ప్రాతిపదికపై శ్రామికుల పంపిణి

పట్టిక - 2 (బ్రాకెట్లలోని సంఖ్యలు శాతములు)

| ఋణమూలము/ శ్రామికుల కుల మరియు ఋణభారము(రూ లలో) | షె కు | | | షె తె | | | వె త | | | | ఇ కు | | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 0 - 1500 | 1501- 3000 | మొత్తం | 0 - 1500 | 1501 3000 | మొత్తం | 0 - 1500 | 1501- 3000 | 4501- 6000 | మొత్తం | 4501- 6000 | మొత్తం | |
| బంధువుల, మిత్రుల ద్వారా | 3 [30] | — | 3 [25] | 1 [100] | — | 1 [50] | 6 [60] | 3 [100] | — | 9 [40 9] | — | — | 13 [34 2] |
| యజమాని ద్వారా | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| భూస్వామి ద్వారా | — | 1 [50] | 1 [8 3] | — | 1 [100] | 1 [50] | 4 [40] | — | 1 [11 1] | 5 [22 7] | 1 [50] | 1 [50] | 8 [21 1] |
| ఎ.డి బి | 1 [10] | 1 [50] | 2 [16 7] | — | — | — | — | — | 8 [88 9] | 8 [36 4] | — | — | 10 [26 3] |
| వాణిజ్య బ్యాంకుల ద్వారా | 6 [60] | — | 6 [50] | | | | | — | — | — | 1 [50] | 1 [50] | 7 [18 4] |
| వడ్డీ వ్యాపారుల ద్వారా | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| సమితి ద్వారా | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| ఇతరుల ద్వారా | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| మొత్తం | 10 [100] | 2 [100] | 12 [100] | 1 [10০] | 1 [100] | 2 [100] | 10 [100] | 3 [100] | 9 [100] | 22 [100] | 2 [100] | 2 [100] | 38 [100] |

షెడ్యూలు కులాలు, మరియు షెడ్యూలు తెగలకు చెందినవారిలో రు 3001 పైబడ్డ ఋణభారము గలవారు లేరు అట్లే వెనుకబడిన తరగతులకు చెందినవారిలో రు ౩001 - 4500 ల మధ్య ఋణభారము లేకుండుటయేగాక ఇతర కులాల వారిలో రు 4,500 లకు తక్కువ ఋణభారం గలవారునూ లేరు

### పరిశోధన పద్ధతి .

కాకతీయ కాలువ నిర్మాణంలో స్త్రీ శ్రామికుల సమస్యలపై ఈ పరిశోధన చేయడం జరిగింది ఈ వ్యాసమునకు కావలసిన దత్తాంశమును ప్రత్యక్షపద్ధతి ద్వారా నిష్పక్షపాత దత్తాంశ సేకరణ చేయబడింది ఈ పరిశోధనలో నాలుగు గ్రామములనుండి వచ్చిన 60 మంది స్త్రీ శ్రామికులనుండి దత్తాంశమును సేకరించడం జరిగింది వరంగల్ జిల్లా నర్సంపేట్ తాలూకాలోని రెండు గ్రామములను [దుగ్గొండి, వెంకటాపూర్], మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల్ తాలూకా లోని రెండు గ్రామములను [పాలమూర్, ఒగులాపూర్] ఎన్నుకొని అక్కడనుండి వచ్చిన శ్రామికులనుండి మాత్రమే దత్తాంశమును సేకరించడం జరిగింది ఈ పరిశోధనలో పరిశోధకులు శ్రామికులు పని చేస్తున్న స్థలమునకు వెళ్ళి ప్రత్యేకంగా తయారుచేసిన ప్రశ్నావళి ద్వారా దత్తాంశమును సేకరించడం జరిగింది ఈ పరిశోధనలో స్త్రీ శ్రామికులు పనిచేస్తున్నపుడు వారి సమస్యలు ఏమిటి? ఎలా ఉన్నాయి? దేశ సౌభాగ్యం కోసం నిర్మిస్తున్న యిలాంటి ప్రాజెక్టు లలో స్త్రీ శ్రామికుల పాత్ర ఎంతవరకు ఉంది అని తెలుసుకోవా లనే ఉత్సాహంతో ఈ పరిశోధనను ప్రారంభించడం జరిగింది

సాధారణ వివరాల ప్రాతిపదికపై శ్రామికుల పంపిణి

పట్టిక - 3

| వ స | సాధారణ వివరములు | ఉన్నాను | లేను | మొత్తం |
|---|---|---|---|---|
| 1 | నీవు డి ఆర్ డి ఏ, ఎన్ ఆర్ ఇ పి మరియు ఇతర ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలలోఉన్నావా? | 17 [28 3] | 43 [71 7] | 60 [100] |
| 2 | ఉంటే ఆ కార్యక్రమాల ద్వారా ఏమైనా ప్రతిఫలం పొందిఉన్నావా? | '0 [58 5] | 7 [41 2] | 17 [100] |
| 3 | వేతన విచక్షణ ఏదైనా మీ గ్రామంలో ఉందా? | 4 [6 7] | 56 [93 3] | 60 [100] |
| 4 | నీకు వేతన చట్టము గురించి ఏమైనా తెలుసా ? | 34 [56 7] | 26 [43 3] | 60 [100] |
| | మొత్తం | 65 [150 5] | 132 [249 5] | 197 [400] |

[ బ్రాకెట్లలోని సంఖ్యలు శాతములు ]

పట్టిక-3 లో సాధారణ వివరాల ప్రాతిపదికపై శ్రామికుల పంపిణీ చేయడం జరిగింది 71 7 శాతం శ్రామికులు ప్రభుత్వం చేపట్టిన కార్యక్రమములలో లేరని, 23 3 శాతం శ్రామికులు ఏదో ఒక కార్యక్రమములో ఉన్నారు ఒకవేళ యే కార్యక్రమంలోనైనా ఉంటే ప్రతిఫలం ఏదైనా పొందినావా? అని అడిగినపుడు 58 8 శాతం ఫలితం పొందినట్లు చెప్పారు మిగతా 41 2 శాతం శ్రామికులు కరువు మూలంగా ఎలాంటి ఫలితం పొందలేకపోయామని చెప్పారు అంతేకాకుండా 93 3 శాతం శ్రామికులు వేతన విచక్షణ లేదని చెప్పారు 56 7 శాతం శ్రామికులకు వేతన చట్టము గురించి తెలియును

పని వివరాల ప్రాతిపదికపై శ్రామికుల పంపిణీ చేయడం జరిగింది 95 శాతం శ్రామికులు ప్రస్తుతం చేస్తున్న పనితో సంతృప్తిచెంది ఉన్నారు మీ పని పురుష శ్రామికుల పనికి సమానంగా ఉంటుందా? అని అడిగిన ప్రశ్నకు 100 శాతం స్త్రీ శ్రామికులు సమానంగా లేదని చెప్పినారు మరియు పనిలో మీకేమైన మినహాయింపు ఉంటుందా? అని అడిగిన ప్రశ్నకు 100 శాతం శ్రామికులు మినహాయింపు ఉంటుందనే చెప్పారు అందులో 58 శాతం శ్రామికులు ఆరోగ్యరీత్యా మినహాయింపు పొందుచున్నారు మిగతా 42 శాతం శ్రామికులు మానవతారీత్యా మినహాయింపు పొందుచున్నారు

వేతనకాల ప్రాతిపదికపై శ్రామికుల పంపిణీని పరిశీలించినచో 60శాతం శ్రామికులు వారానికి, 10శాతం శ్రామికులు ప్రతిదినము, 30 శాతం శ్రామికులు నెలకు ఒకసారి వేతనం తీసుకుంటున్నట్లు తెలిసింది అధికశాతం శ్రామికులు చిన్నతనం నుండి కూలీగా పని చేస్తున్నట్లు తెలియవచ్చినది కొద్దిమంది మాత్రం 1 లేక 2 సంవత్సరములనుండి కూలీగా చేరినట్లు చెప్పారు కూలీగా చేరడానికి కారణములను అడిగినపుడు ఎక్కువ శాతం శ్రామికులు "కరువు" ప్రాతిపదిక మూలంగానే చేరినట్లు చెప్పారు కాకతీయ కాలువ నిర్మాణంలో పనిచేస్తున్న స్త్రీ శ్రామికులందరికి రోజుకు రు 12 చొ॥న వేతనం చెల్లించడం జరుగుతుంది ఇక వేతనము అందరికీ ద్రవ్యరూపంలోనే చెల్లించడం జరుగుతుంది

శ్రామిక సంఘం వివరాల ప్రాతిపదికపై శ్రామికుల పంపిణీ చేయడం జరిగింది 56 7 శాతం శ్రామికులు వారి గ్రామములో శ్రామిక సంఘం ఉన్నదని చెప్పారు కాని ఎవరూ కూడా వారికి సభ్యత్వం లేదని చెప్పారు అంతేకాకుండా 97 1 శాతం శ్రామికులు ఎలాంటి సమ్మెలు చేయలేదని చెప్పారు

ఇంతేకాకుండా మా పరిశోధనలో స్త్రీ శ్రామికుల కందరికి ఒకే వేతనము లభిస్తుందని తెలిసింది ప్రతిరోజూ శ్రామికులు ఉదయం గం 8-00 నుండి సాయంత్రం గం 5-00 వరకు పనిచేయాల్సి ఉంటుంది ఏదైనా అత్యవసర పరిస్థితులలో కూడా వారి కంట్రాక్టర్ ఎలాంటి ఆర్థిక సహాయం చేయడని తెలిసింది అనారోగ్య కారణాల వల్ల మరియు ఇతర అత్యవసర పరిస్థితులవల్ల ఏ రోజైనా పనిలోకి రానిచో ఆ రోజు కూలి లభించదని చెప్పారు

ఈ పరిశోధనలో ప్రధాన ఉద్దేశ్యమైన ప్రభుత్వం అమలు చేస్తున్న సంక్షేమ కార్యక్రమాలు ఈ శ్రామికవర్గానికి ఎలాంటి ఫలితమును ఇవ్వలేకపోయినాయని వారియొక్క ఆర్థిక పరిస్థితినిబట్టి అవగాహన చేసుకోవచ్చును

## ముగింపు:

మన దేశంలోని స్త్రీ శ్రామికులలో 50 శాతంపైన వ్యవసాయ రంగంలో పని చేస్తున్నారు అందులో ఒక వర్గమైన నీటి పారుదల ప్రాజెక్టులలో పనిచేస్తున్న స్త్రీ శ్రామికులయొక్క కొన్ని సమస్యలను పరిశోధించడం జరిగింది మొత్తం 60 మంది శ్రామికులలో అక్షరాస్యత 2 4 శాతం మాత్రమే ఉంది షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలకు చెందిన శ్రామికులంతా నిరక్షరాస్యులుగానే ఉన్నారు 60 శాతంపైన శ్రామికులు ఋణభారంతో ఉన్నారు అందులో 70 8 శాతం శ్రామికులు షెడ్యూలు కులాలవారు 23 7 శాతం శ్రామికులు పెద్ద మొత్తం అంటే రు 6000/-ల వరకు ఋణం కలిగియున్నారు ఇక ప్రభుత్వం చేపట్టిన సంక్షేమ కార్యక్రమములకు 71 7 శ్రామికులు బాహ్యంగానే ఉన్నారు శ్రామికులకు శ్రామిక సంఘాల గురించి అంతగా అవగాహన లేదని తెలిసింది యిలాంటి సమస్యలతో బాధపడుచున్న స్త్రీ శ్రామికులకు వీలైనంత త్వరగా ప్రభుత్వం ఒక పరిష్కార మార్గమును సూచించడం మరియు అమలుపరచడం తక్షణ కర్తవ్యం కనీసం ఈ దశాబ్దంలో కాకపోయినా వచ్చే దశాబ్దం ప్రారంభం వరకైన ఒక బృహత్తర కార్యక్రమమును చేపట్టి స్త్రీ శ్రామికుల సమస్యల పరిష్కారానికి ప్రభుత్వం పాటుపడుతుందని ఆశిద్దాం



# మొటిమలు ?

## బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్




మొటిమలు, చర్మవ్యాధులకు కారణమైన అపరిశుద్ధ రక్తమునకు కారణము అంత్రములు ఉదరము సరిగా పనిచేయకపోవటమే

సురక్తా జీర్ణక్రియ సరిగా జరుగుటకు సహాయపడి చర్మమును మృదువుగాను, సుందరముగాను చేయును.

సురక్తాస్ట్రాంగ్ మలిన రక్తమునుండి చర్మరోగములనుండి మిమ్ములను కాపాడును.



## బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్

మొటిమలు మొదలగువాటి నివారణకు సురక్షితమైన విశ్వసనీయమైన ఆయుర్వేద ఔషధము

SKT 67 T SVR

శ్రీ వడలి మందేశ్వరరావు

# ఇటీవలి ఉద్యమాలు ధోరణులు

( గతసంచిక తరువాయి )

## అభినవ విమర్శ (న్యూ క్రిటిసిజమ్)

ఇంత వరకూ సమీక్షించిన విమర్శనా పద్ధతులను ఎంత సాను భూతితో పరిశీలించినా, కవిత్వ వస్తువును గురించిన అన్వేషణే కాని, కవిత్వ తత్వాన్ని గురించి పరిశీలన కనబడదు మార్క్సిస్టు దృక్ప థంలో ప్రధానమైన అంశం ఒకానొక రాజకీయ సిద్ధాంతానికి, పోరాటు దృక్పధానికి నిబద్ధత అది లోపిస్తే అట్టి సాహిత్యాన్ని (వెనుక ప్లాటో చెప్పినట్లు) బహిష్కరించాలి ఆర్కిటైపల్ పాటర్న్సు రచనలో కనబడినంత మాత్రాన అది సాహిత్యం కానక్కరలేదు చేతనా స్రవంతి దృక్పథంతో వ్రాయబడ్డ రచనల్లో ఫ్రీ అసోసియేషన్, అజ్ఞాత మనస్సు చోటు చేసుకున్న మాట వాస్తవమే అయినా, వాని వల్లనే అది సాహిత్యం కాదు కాగా సాహిత్యాన్ని అనుశీలించేటప్పుడు సాహిత్యాన్ని సాహిత్యంగానే చూడవలసి ఉంటుంది సాహిత్యేతర అంశాలు సాహిత్యాను శీలనలో జొరపడ కూడదు

ఐ ఎ రిచర్డ్స్, టి ఎస్ ఇలియట్ ప్రభావం పడిన విమర్శ కులలోను, 1930 తర్వాత రెండు దశాబ్దాల పాటు వచ్చిన అభినవ విమర్శలోనూ కనబడే దృక్పథం ఇదే కావ్యానికి కావలసింది అర్థం కాదు, అస్తిత్వం (ఎ పోయెమ్ షుడ్ నాట్ మీన్, బట్ బీ) ఈ అస్తిత్వాన్ని ఆవిష్కరించేదే అనుశీలన కవి లక్షించిన ఆశయాన్నో, పరమార్థాన్నో ఆశ్రయించి కావ్యాన్ని విమర్శింప బూనడం కావ్యపు అస్తిత్వాన్ని అలక్ష్యం చేయడ మవుతుంది సాటన్‌ను గూర్చి మిల్టన్ అనుకొన్న దొకటి, రూపకల్పన చేసినది మరొకటి అని వాదించడానికి అవకాశం ఉంది కావ్యం చదవగా కల్గిన అనుభూతిని ఆధారంగా చేసుకొని, కావ్య స్వరూపాన్ని నిర్ణయించడం కూడా సబవు కాదు- అట్టి అనుభూతే ఇతర సందర్భాలలో కల్గదన్న దాఖలా లేదు కనుక! కవి జీవితం-ఆతని సంపర్కాలు- మొదలైన వన్నీ కావ్య తత్వాన్ని ఆవిష్కరింప లేవు ఇవన్నీ కవిత్వాన్ని నిరూపించే విషయాలు కావు- కావ్య రచనకు ప్రేరకాలు అయితే కావచ్చు, కాని ప్రేరణ కవిత్వం కాదు కదా! ఇక వ్యాకరణాంశాలు, శబ్ద సాధుత్వ అసాధుత్వ నిర్ణ యాలు, కావ్య గుణాలను ఆవిష్కరింప లేవు అలాగే కావ్యం ప్రతిపా దించే ధర్మం, నీతికూడ సాహిత్య విమర్శలో చోటు చేసుకో కూడదు

అయితే ఇన్నింటినీ వదలు కున్నాక ఇక సాహిత్య విమర్శ చేసేపని ఏమిటి? శాస్త్రం కన్న, తర్కబద్ధమైన వ్యాసం కన్న భిన్న మైనది కవిత్వం కావ్య నిర్మాణం కేవలం శబ్దాన్ని ఆశ్రయించుకొని ఉండే రచనా సంవిధానం, కనుక తన్నిర్మాణానికి కారణమైన అలం కారం, వ్యంగ్యం, వక్రోక్తి మున్నగువాని రాపిడి నుండి కావ్యం ఆవిర్భవిస్తుంది వీని దృష్ట్యా సాహిత్యానుశీలన ఆత్మాశ్రయమైనదై ఉండకుండా, శాస్త్రజ్ఞుడు రసాయనిక చర్యను పరిశీలించినంత నిష్పక్ష పాత వైఖరి నావిష్కరించేదిగా ఉండాలి దీనికి సమ్యక్ సమగ్ర పార్శ్వ పరనం ఎంతో అవసర మవుతుంది సాహిత్యాన్ని వివిధ రూపాలుగా విడగొట్టి, ఇది నాటక మనీ, ఇది కావ్యమనీ, ఇది నవల అనీ విడిగా చూడవచ్చు కాని, అది ప్రధానమైన అంశం కాదు ఇక్కడ కూడా ప్రధానమైనవి శబ్దాలు, శబ్ద చిత్రాలు, ప్రతీకలే కాని, ఇతి వృత్తం పాత్ర చిత్రణకావు ఇతివృత్తానికి సంబంధించిన శబ్దచిత్రాలు, ప్రతీకాత్మకమైన వస్తు (కథా) గమనం, మున్నగు వాని పరస్పర ఘర్షణ నుంచి కావ్యానికి అర్థాలు పొరలు పొరలుగా ఆవిర్భవిస్తాయి. అవే కావ్య స్వరూపాన్ని నిరూపిస్తాయంటారు అభినవ విమర్శకులు [54]

## ఆకృతి వాదం (ఫార్మాలిజం)

అభినవ విమర్శను కొన్ని విధాల పోలి ఉన్నది ఆకృతి వాదుల విమర్శ అభినవ విమర్శకుల లాగే వీరూ కావ్యాన్ని కావ్యం గానే చూడాలి కాని కావ్యేతర కొలమానాలతో పరిశీలించ రాదని అంటారు అభినవ విమర్శకుల విమర్శ అంతా శబ్దార్థాన్ని (సిమాం టిక్స్‌ను) ఆశ్రయించుకొని సాగింది ఆకృతి అన్వేషణ భాషా స్వరూ పాన్ని ఆధారంగా చేసుకొని సాగింది [55]

వెనుకటి సాహిత్య విమర్శలో ఆకృతికి - వస్తువుకు (ఫార్మ్, కంటెన్ట్) అవినాభావ సంబంధముందని అంటూ, వస్తువుకు అనుగుణ మైన ఆకృతిని కవి ఎన్నుకుంటా డనుకునే వారు కథకాని, అందు లోని బోధకాని భావం కాని, వస్తువు అనుకుంటే, ఈ ద్రవ్యాన్ని నింపడానికి పాత్రవంటిది ఆకృతి అన్నమాట ఆకృతి వాదులు ఆకృతి-వస్తువు వేర్వేరంశాలని అంగీకరించరు కవితలో కన్న ఏ నవలలోనో ఈ రెండింటి అద్వైత స్థితిని చూడగల్గడం తేలిక ఆకృతి వాదులు కథ (స్టోరీ) వేరు, ఇతివృత్తం (ప్లాట్) వేరు అంటారు [56]

ఇంతలో—
'గుత్తునా ముత్యాల సరము' లంటూ
ఆంధ్రభారతి ముందు
ఆసీనమైన ఒక 'జాడ' కనిపించింది

'కెరటాలలో నురువ్వ తెరజాలులో,
నీటి పొరజాలు' లోంచి
'తెలుగు సత్కవిరాజు పలుకు'
వినిపించింది

'అయ్యారె' అనుకున్నాను
'శృంగార వీథి'లో 'కల్పవృక్షపు' నీడలో
'వేయి పడగలు' విప్పారిన దీధితికి
నమస్కరించాను.

'నునుమబ్బు లేదున్క కొనలపై సోనలా
నెలవంక చిరునవ్వు చలువపాట పాడుకుంటూ
ఓ'ప్రవాసి' 'ఊర్వశీ' ప్రియుడు
'కృష్ణ పక్షం'లో వెన్నెలలు విరియించిన
చల్లని వాడు—
ఎదలోకి చొరవగా చొరబడ్డాడు.

'గుండె గొంతుకలోన కొట్లాడు తు'ండగా
అడవి మల్లెలోని అమాయకతని
వెలిగించే కళ్ళు పలకరించాయి.

'ఒక లక్ష నక్షత్రాల మాటల్ని—
కోటి జలపాతాల పాటల్ని
శతకోటి సాగర తరంగాల మ్రోతల్ని—'
కలబోసి రుద్రవీణ మ్రోగిస్తూ
ఒక ప్రభంజనం హోరెత్తింది
ఉప్పెనలా ఉత్సాహం నాలోకదిలింది.

ముందుకు నడిచాను—
కానీ,
కొంతదూరంలో ఆగిపోయాను,

అక్కడ 'ఇజా'ల కొట్లాటలు
అమ్మో! పారిపోవాలనిపించింది.
ఇంతలో —
'తత్త్వాల పేర విప్లవాలపేర'—
ఒకరినొకరం హతమార్చుకోలేం తల్లీ!'
అంటూ 'అకుంఠిత మానవీయ పతాకను
ఎగుర వేస్తూ'—
'అందరూ నిద్రపోతున్న రాత్రి' 'దోసిళ్ళ'తో
'అమృతాన్ని' తాగేసిన అమరుడు
నా చేతిలో చేయివేసి
నా భయాన్ని పోగొట్టాడు
జారిపోతున్న నన్ను
తిన్నగా నిలబెట్టాడు
నిలబడ్డాను

భారతీ!
నే పొందిన ఆ అనుభవాలు
నాలో,
జననాంతర దివ్యావేశాన్ని కదిలించాయి.
జననీ,
యంత్రాల జీవితంలో విసిగినపుడు
నువ్వే ఊపిరిగా - బాసటగా - ఓదార్పుగా -
నిలిచావు - నిల్చున్నావు
కలకాలం ఇలానే నిలిచి పోవూ? ...
వాగీశ్వరీ!
నీదివ్య విలాస వైభవాలలో
మునక లేసి—
నేను పునీతుణ్ణవుతున్న వేళ—
నాలో కదిలే గీతం—
నిర్మల గంగా ఝరిగా—
నీ చల్లని అడుగులు కడుగుతూ
నిలిచిపోవాలనే నిలిచివున్నా

శ్రీ వడలి మందేశ్వరరావు

# ఇటీవలి ఉద్యమాలు ధోరణులు

( గతసంచిక తరువాయి )

## అభినవ విమర్శ (న్యూ క్రిటిసిజమ్)

ఇంత వరకూ సమీక్షించిన విమర్శనా పద్ధతులను ఎంత సాను భూతితో పరిశీలించినా, కవిత్వ వస్తువును గురించిన అన్వేషణే కాని, కవిత్వ తత్వాన్ని గురించి పరిశీలన కనబడదు మార్క్సిస్టు దృక్పథంలో ప్రధానమైన అంశం ఒకానొక రాజకీయ సిద్ధాంతానికి, పోరాటు దృక్పథానికి నిబద్ధత అది లోపిస్తే అట్టి సాహిత్యాన్ని (వెనుక ప్లాటో చెప్పినట్టు) బహిష్కరించాలి ఆర్కిటైపల్ పాటర్న్స్ రచనలో కనబడినంత మాత్రాన అది సాహిత్యం కానక్కరలేదు చేతనా స్రవంతి దృక్పథంతో వ్రాయబడ్డ రచనల్లో ఫ్రీ అసోసియేషన్, అజ్ఞాత మనస్సు చోటు చేసుకున్న మాట వాస్తవమే అయినా, వాని వల్లనే అది సాహిత్యం కాదు కాగా సాహిత్యాన్ని అనుశీలించేటప్పుడు సాహిత్యాన్ని సాహిత్యంగానే చూడవలసి ఉంటుంది సాహిత్యేతర అంశాలు సాహిత్యాను శీలనలో జొరపడ కూడదు

ఐ ఎ రిచర్డ్స్, టి ఎస్ ఇలియట్ ప్రభావం పడిన విమర్శ కులలోను, 1930 తర్వాత రెండు దశాబ్దాల పాటు వచ్చిన అభినవ విమర్శలోనూ కనబడే దృక్పథం ఇదే కావ్యానికి కావలసింది అర్థం కాదు, అస్తిత్వం (ఎ పోయెమ్ షుడ్ నాట్ మీన్, బట్ బీ) ఈ అస్తిత్వాన్ని ఆవిష్కరించేదే అనుశీలన కవి లక్షించిన ఆశయాన్నో, పరమార్థాన్నో ఆశ్రయించి కావ్యాన్ని విమర్శింప బూనడం కావ్యపు అస్తిత్వాన్ని అలక్ష్యం చేయడ మవుతుంది సాటన్‌ను గూర్చి మిల్టన్ అనుకొన్న దొకటి, రూపకల్పన చేసినది మరొకటి అని వాదించడానికి అవకాశం ఉంది కావ్యం చదవగా కల్గిన అనుభూతిని ఆధారంగా చేసుకొని, కావ్య స్వరూపాన్ని నిర్ణయించడం కూడా సబువు కాదు- అట్టి అనుభూతే ఇతర సందర్భాలలో కల్గదన్న దాఖలా లేదు కనుక! కవి జీవితం-ఆతని సంపర్కాలు- మొదలైన వన్నీ కావ్య తత్వాన్ని ఆవిష్కరింప లేవు ఇవన్నీ కవిత్వాన్ని నిరూపించే విషయాలు కావు- కావ్య రచనకు ప్రేరకాలు అయితే కావచ్చు, కాని ప్రేరణ కవిత్వం కాదు కదా! ఇక వ్యాకరణాంశాలు, శబ్ద సాధుత్వ అసాధుత్వ నిర్ణ యాలు, కావ్య గుణాలను ఆవిష్కరింప లేవు అలాగే కావ్యం ప్రతిపా దించే ధర్మం, నీతికూడ సాహిత్య విమర్శలో చోటు చేసుకో కూడదు

అయితే ఇన్నింటినీ వదలు కున్నాక ఇక సాహిత్య విమర్శ చేసేపని ఏమిటి? శాస్త్రం కన్న, తర్కబద్ధమైన వ్యాసం కన్న భిన్న మైనది కవిత్వం కావ్య నిర్మాణం కేవలం శబ్దాన్ని ఆశ్రయించుకొని ఉండే రచనా సంవిధానం, కనుక తన్నిర్మాణానికి కారణమైన అలం కారం, వ్యంగ్యం, వక్రోక్తి మున్నగువాని రాపిడి నుండి కావ్యం ఆవిర్భవిస్తుంది వీని దృష్ట్యా సాహిత్యానుశీలన అత్మాశ్రయమైనదై ఉండకుండా, శాస్త్రజ్ఞుడు రసాయనిక చర్యను పరిశీలించినంత నిష్పక్ష పాత వైఖరి నావిష్కరించేదిగా ఉండాలి దీనికి సమ్యక్ సమగ్ర పార్శ్య పరనం ఎంతో అవసర మవుతుంది సాహిత్యాన్ని వివిధ రూపాలుగా విడగొట్టి, ఇది నాటక మనీ, ఇది కావ్యమనీ, ఇది నవల అనీ విడిగా చూడవచ్చు కాని, అది ప్రధానమైన అంశం కాదు ఇక్కడ కూడా ప్రధానమైనవి శబ్దాలు, శబ్ద చిత్రాలు, ప్రతీకలే కాని, ఇతి వృత్తం పాత్ర చిత్రణకావు ఇతివృత్తానికి సంబంధించిన శబ్దచిత్రాలు, ప్రతీకాత్మకమైన వస్తు (కథా) గమనం, మున్నగు వాని పరస్పర ఘర్షణ నుంచి కావ్యానికి అర్థాలు పొరలు పొరలుగా ఆవిర్భవిస్తాయి అవే కావ్య స్వరూపాన్ని నిరూపిస్తాయంటారు అభినవ విమర్శకులు [54]

## ఆకృతి వాదం (ఫార్మాలిజం)

అభినవ విమర్శను కొన్ని విధాల పోలి ఉన్నది ఆకృతి వాదుల విమర్శ అభినవ విమర్శకుల లాగే వీరూ కావ్యాన్ని కావ్యం గానే చూడాలి కాని కావ్యేతర కొలమానాలతో పరిశీలించ రాదని అంటారు అభినవ విమర్శకుల విమర్శ అంతా శబ్దార్థాన్ని (సిమాం టిక్స్‌ను) ఆశ్రయించుకొని సాగింది ఆకృతి అన్వేషణ భాషా స్వరూ పాన్ని ఆధారంగా చేసుకొని సాగింది [55]

వెనుకటి సాహిత్య విమర్శలో ఆకృతికి - వస్తువుకు (ఫార్మ్, కంటెన్ట్) అవినాభావ సంబంధముందని అంటూ, వస్తువుకు అనుగుణ మైన ఆకృతిని కవి ఎన్నుకుంటా డనుకునే వారు కథకాని, అందు లోని బోధకాని భావం కాని, వస్తువు అనుకుంటే, ఈ ద్రవ్యాన్ని నింపడానికి పాత్రవంటిది ఆకృతి అన్నమాట ఆకృతి వాదులు ఆకృతి-వస్తువు వేర్వేరంశాలని అంగీకరించరు కవితలో కన్న ఏ నవలలోనో ఈ రెండింటి అద్వైత స్థితిని చూడగల్గడం తేలిక ఆకృతి వాదులు కథ (స్టోరీ) వేరు, ఇతివృత్తం (ప్లాట్) వేరు అంటారు [56]

కథను ఆవిష్కరింప చేసేది ఇతివృత్తం అంటే ఇతి వృత్తంవల్ల చదువరికి క్రమక్రమంగా కథ వెల్లడి అవుతూ ఉంటుంది [57] ఇట్టి రచనలో ఏది ఆకృతి? ఏది వస్తువు? అంటే ఆకృతే వస్తువుగా, వస్తువే ఆకృతిగా సాక్షాత్కరిస్తా యంటారు ఆకృతి వాదులు

ఇక కవిత దగ్గరకు వచ్చేసరికి కావ్యభాషలోని వైశిష్ట్యం అంతా అందులోని శ్రావ్యత లయ, ఛందస్సును ఆధారంగా చేసుకొని ఉంటుందంటారు [58] ఛందస్సువల్ల-అందులో (మనకున్న) యతి ప్రాసలవల్ల పద్యం ఎల్లవేళలా కవికి అదుపులో ఉండక, కవికే తెలియని నూతన ప్రయోగాలవైపు రచన మళ్ళుతూంటుంది [59] నాచన సోమన [60] "నాకపురంబులో మెటిసి" అన్న పద్యంలో "దివ్య కాంతా కరతాల వృంత సముదాయ సమీరము సోక" అన్న దానిలో ఆ కృతిని వస్తువును విడదీస్తే మిగిలేదేమిటని ఆకృతి వాదుల ప్రశ్నలా కనబడుతుంది

ఆకృతి వాదంలో ఎంతో కృషిచేసిన రోమన్ యాకబ్‌సన్ స్ట్రక్చరల్ లింగ్విస్టిక్స్‌ను అనుసరిస్తూ భాషకు రెండు లక్షణాలున్నా యంటారు ఒకటి ఎన్నిక లేక ఎంపిక, మరొకటి కూర్పు మాటాడే టప్పుడు ఒకేజాతికి-వ్యాకరణాంశానికి-చెందిన శబ్దాలను ఎన్నుకొని వానినొక, క్రమపద్ధతిలో కూర్చుకుంటాము ఈ ఎన్నుకోవడంలో రూపకం ప్రాధాన్యం వహించడం కవిత్వంలో కనబడుతుంది, వచనంలో లక్షణ (జహల్లక్షణ కాని, అజహల్లక్షణకాని - మిటానమీ, సినక్డకే) ప్రాధాన్యం వహిస్తుందంటాడు యాకబ్ సన్ [61] ఈ ఎన్నిక, కూర్పులలో ఉండే విలక్షణత్వాన్ని అనుసరించి సాహిత్యాన్నంతనీ పరిశీలింప నవకాశం ఉంటుందంటాడు యాకబ్ సన్ అంతేగాక కావ్యంలోని ప్రత్యేకతను వివరిస్తూ, కావ్యభాషలో జరిగేపని ఏమంటే ఎన్నిక అక్షంలోని సామ్యసూత్రాన్ని కూర్పు అక్షం లోకి పరివర్తింప చేయడం అంటాడు [62] దీనివల్లనే ఆ కృతి, వస్తువు అద్వైతస్థితి నందుతాయని ఈయన భావంలా కనబడుతుంది

ఈ అభినవ విమర్శకుల, ఆకృతి వాదుల ధోరణులను చూడగా, మన ఆలంకారికుల కృషి నేడు మనకెంతగా ఆదరణీయమో అవగత మవుతుంది అలంకార శాస్త్రాన్ని కేవలం పాఠ్య పరన పద్ధతులలో అధ్యయనం చేయడమే గాక, శబ్ద వృత్తులను, అలంకారాలను, ఛందస్సును, కావ్యవృత్త నిర్మాణాన్ని గురించి భరతుడు చెప్పిన విషయాలను, మరొక్కమారు నూత్న దృక్పథంతో మథించి, కావ్యానుశీలనకు అవి అధునాతన పరిస్థితులకెవ్విధంగా తోడ్పడు తాయో పరిశీలించాలి

అయితే ఈ దృష్టి మనదేశంలో బొత్తిగా లేకుండా పోలేదు అట్టి దృష్టి ఉన్నవారిలో ఉన్నతుడు విశ్వనాథ

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ :

ఈయన ప్రసక్తి ఇంతవరకూ రాకపోవడం విడ్డూరంగానే కనబడినా, చివరకు సరియైన సమయంలోనే వచ్చింది అభినవ విమర్శకుల ధోరణికే - విశ్వనాథ ధోరణికీ - ఎంతో సామ్యముంది. వారూ సమ్యక్ సమగ్ర పాఠ్య పరనాన్ని అభిలషిస్తారు, ఈయన చేసే పనీ అదే వారు సాహిత్యాన్ని సాహిత్యంగా చూడమంటారు, ఈయనా (విమర్శకుడుగా) ప్రధానంగా అంతే ఆకృతివాదుల కావ్య శిల్ప సమీక్షకు ప్రాముఖ్యం ఇస్తారు ఈయన చేసేదీ కావ్యశిల్ప సమీక్షే! ఇదిగాక ఈయన విమర్శకు పునాదులన్నీ ఆలంకార శాస్త్రంలో ఉన్నా, ఆయన వ్యాఖ్యానం (ఇంటర్‌ప్రిటేషన్) అంతా శాస్త్రానికి ఊడిగం చేసేది కాదు, పునః సృష్టి చేసేది [63] ఎన్ని చెప్పినా, అభినవ విమర్శకుల తెలివిని మనం మెచ్చుకొన్నా, వారి దృష్టి హ్రస్వ మనిపిస్తుంది విశ్వనాథ ఒకానొక కవి రచనను ఒకానొక విధముగా చదువ వలెనని చెప్పడమే గాక, అలా చదివడ మెలాగో చూపాడు విమర్శకునిగా విశ్వనాథ చూపు మెరుపులాంటిది నిడుదవోలు వేంకట రావుగారి 'ఉదాహరణ వాఙ్మయ చరిత్ర'కు ఆయన వ్రాసిన పది పంక్తుల పరిచయాన్ని చూడండి, కూచిపూడి వారి భామా కలాపాన్ని గురించి ఏకవీరలో వారి లఘు వ్యాఖ్యను చూడండి ఆయన మహాకవుల కావ్యాలను కవిగానే సమీపించడం ఆయన ప్రత్యేకత అలా సమీపించి వానిలోని కవిత్వం, శిల్పం, సంప్రదాయం మున్నగు విషయాలనే కాక, వానికి మూలకందంగా ఉన్న రహస్యాలను పెల్లగించేవాడు ఇదంతా మనకోసమే కాదు కవిగా తనకోసం, తనవంటి వారి కవుల కోసం, తనకావ్య నిర్మాణ దక్షతను పరీక్షించుకోవడం కోసం, పెంపొందించుకోవడం కోసం

కవి విశ్వనాథను గురించి కూడా ఒక్కమాట చెప్పాలి ఎంత కాదనుకున్నా కావ్యం కేవలం యాదృచ్ఛికంగా వెలువడదు దానికొక సంప్రదాయ బలం ఉండాలి ఒకానొక చారిత్రిక సన్నివేశంలో, ఒకానొక సమాజంలో అది ఆవిర్భవిస్తుంది అయితే కావ్యంలో ప్రతిబింబితమయేవి ఆనాటి మత, రాజకీయ, సాంఘిక, ఆర్థిక సమస్యలే కావు వీనికి కవి ప్రతిస్పందనలే వినబడతాయి ఈ స్పందన లాయన చైతన్యం నుంచి ఆవిర్భవిస్తాయి అయితే ఈ చైతన్యం ఒక అమూర్త పదార్థం ఇంద్రధనస్సు రంగులన్నీ ప్రచండ వేగంతో పరిభ్రమించి నప్పుడు కనుచూపును భ్రమింపచేసే ఏకైక శ్వేతకాంతి కిరణమే గోచరించినట్లు, ప్రపంచ సమస్యలనుండి, వ్యక్తిపర జీవితం వరకూ, తన్ను కలవర పరచే సమస్య లన్నింటి తాకిడివల్లా, కవిలో భాసించేది ఈ చైతన్యమే కవిలోని చైతన్యమే కావ్యంలో ప్రతిఫలిస్తుంది దాని విశ్లేషణలో ఎన్నిరంగుల ఛాయలు వెలువడితే-ఆ స్పెక్ట్రమ్ ఎంత నిడివిగా ఉంటే - ఆ రచన అంత విలువైన దన్నమాట ఈ విధంగా

9

అనుశీలన చేస్తే విశ్వనాథ చైతన్యమెంత దీప్తి మంత మయినదో తెలుస్తుంది యుగయుగాలుగా అవతరిస్తున్న ఏ సవుని విశ్వరూపం శతాధికమైన ఆయన రచనల్లో సాక్షాత్కరిస్తుంది అయితే కంటికి వేగయే-అంతటి శిల్పము, కవిత్వంతో ముడిపడి ఉన్నా అంతటి సాక్షాత్కారాన్ని భరించ గల్గడమే కాస్త కష్టం [64]

## చివరిగా :

నా దృష్టిలో కావ్యమన్నది మూడు అంశాలమీద ఆధారపడి ఉంటుంది ఒకటి అందులోని కవిత, రెండు అందులోని శిల్పం, మూడు తత్ కావ్యం పరింపబడే చారిత్రిక క్షణం ఈ మూడింటినీ మూడు అక్ష లనుకుంటే, కావ్యం కాలంలో ఎప్పుడు, ఎక్కడ ఉన్నదో తెలిసికో గల్గుతాము

## అధోజ్ఞాపికలు

1 పాల్ వాలరీ పొయిట్రీ అండ్ అబ్‌స్ట్రాక్ట్ థాట్ డాన్సింగ్ అండ్ వాకింగ్

2 1 జె సి రాన్ సమ్ 'సాహిత్య విమర్శ' మీద వ్యాసం
2 విమ్ సత్, మన్రో బియర్డ్స్లీ ది ఇంటెన్షనల్ ఫాలసీ

3 ఎమ్ సత్, బియర్డ్స్లీ ది అఫెక్టివ్ ఫాలసీ

4 న్యూక్రిటిక్స్, ఫార్మలిస్ట్సు / స్ట్రక్చర్ లిస్ట్సు

5 19వ శతాబ్దం ఆరంభానికే తెలుగుపై ఆంగ్ల ప్రభావం పడింది కావలి రామస్వామి 1820 లో 'దక్కను కవుల చరిత్ర'ను ఆంగ్లములో ప్రకటించడం దీనికొక మంచి తార్కాణం తర్వాత వెన్నెలకంటి సుబ్బారావు ఆంగ్లంలో ఆత్మకథను వ్రాసుకొన్నాడు ఆ మీద ఏనుగుల వీరాస్వామయ్య తన 'కాశీయాత్రా చరిత్ర ను జర్నల్ అన్నాడు

6 19వ శతాబ్దం చివరి పాతిక యేండ్లలోనూ నవల, నాటకం, ప్రహసనం, ఉపన్యాసం, చిన్నకథ-అన్నిరకాల సాహిత్య ప్రక్రియలు హఠాత్తుగా పుట్టుకొని వచ్చాయి పాశ్చాత్య సాహిత్యాలలో మున్నూరేండ్లలో వచ్చిన ప్రక్రియలన్నీ హుటాహుటిగా, వ్యవధిని ఒరపిడితో పాతిక యేండ్లలో వచ్చేశాయి

7 "గణబద్ధ చందస్సుల ఫ్యూడలిజంనుండి మాత్రాబద్ధ చందస్సుల ప్రజాస్వామ్య యుగానికి ఆంధ్ర సాహిత్య గమనాన్ని పరివర్తన చేసిన వాడు గురజాడ", శ్రీ శ్రీ 'ముత్యాల సరాలుకు' పరిచయంలో

8 భారతి 1977 సెప్టెంబరు సంచిక 'కలగూల గంప' క్రింద 'భావకవిత్వం' - 'రాయప్రోలు లేఖ'లో భావ కవిత్వాన్ని గురించి శ్రీ కె వి రమణారెడ్డికి రాయప్రోలు ఇలా వ్రాసారు "భావ కవిత్వమనే పదము నాదికాదు నేను పెట్టిన పేరు అభినవ కవిత హరి సర్వోత్తమరావుగారు అది కాదన్నారు ఖండకవిత్వ మనేపేరును సూచించాడు ఖండమంటే పటికబెల్లపు ముక్క అది నమలరు మెల్లగా కరుగుతుంది రూపములో చిన్నది అదీ ఒప్పుకోలేదు 'భావ కవిత్వమని తృణ కంకణ ప్రథమ పీఠికలో వ్రాసిరి, వారిపేరు లేదు తరువాత ఆ పదచర్చ వచ్చింది పంచాగ్నుల వారు తేల్చివేశారు 'ఇక్కడ భావ పదం కవిత్వమనే దానితో కూడి వున్నది కాగా కవిత్వములో భావ, విభావ, అను భావ, వ్యభిచారీ భావాదులకు సంబంధించిన దని వ్యాఖ్యానం!" అభినవ కవు లిలా భావకవు లయారు

9 "చెట్లకు ఆకులు వచ్చినంత సహజంగా కవిత్వం రాకపోతే, అది రాకుండా ఉండడమే మంచిది" - జాన్ కీట్సు

10 "దాశరథి కవితా దర్శం" - శ్రీ మాదిరాజు రంగారావు వ్యాసం-భారతి, సెప్టెంబరు, 1977 చూడండి

11 చూ కవితా సమితి 43వ వార్షికోత్సవ సంచిక వైశాఖి 1970 లో రింబో మీద డా గంటి శ్రీరామమూర్తి వ్యాసం

12 సింబాలిజమ్ ఒక ఉద్యమంగా 1857 లో బోదలేర్ వ్రాసిన 'ఫ్లోర్ దమాల్'తో ప్రారంభమయింది

13 సింబాలిజమ్ ప్రభావం ఈ శతాబ్దంలోని అనేకమంది కవులమీద పడింది డబ్ల్యు బి యేట్స్, టి ఎస్. ఇలియట్, ఆర్థర్ సైమన్సు, ఎజ్రా పౌండు, డీలాన్ థామస్, ఇ ఇ కమ్మింగ్స్ వాలస్ స్టీవెన్స్ రచనల్లో సింబాలిస్టుల ఛాయలు, ప్రభావం కనబడతాయి

14 రూసో రచనలు, సిద్ధాంతాలు ఫ్రెంచి విప్లవానికి ప్రేరణలు స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం విప్లవ ఆశయాలు - వీనిగే రొమాంటిక్ కవులు ఉత్తేజితు లయారు

16 మాల్ కమ్ బ్రాడ్ బరీ, జేమ్స్ మెక్ ఫార్ లేన్ సంపాదకీయం లోని పుస్తకం 'మోడర్నిజమ్'లో క్లైవ్ స్కాట్

16 చూ డబ్ల్యూ బి యేట్సు "ది సింబాలిజమ్ ఆఫ్ పొయిట్రీ"

17 చూ "త్వమేవాఽహమ్" మూడో కూర్పులో శ్రీ దాశరథికి శ్రీ ఆరుద్ర వ్రాసిన లేఖ "త్వమేవాహంలో కావ్యాన్ని ప్రవాహంగా ఊహించాను పర్వత దశ, ఉపనదులు, ప్రవాహగళ రాసాక నదీ సంఖద్వారాన్ని సాగర సంగమాన్నీ రాద్దామని మానే శాను ఈ ప్రవాహం కాలానికి పర్యాయ పదం కాలానికి సంకేతం గడియారం గడియారం మన సంఘం గంటలు శ్రీమంతులు

నిముషాలు మధ్యమ తరగతివాళ్ళు సెకండ్లు 'అలగా' జనం చిన్నముల్లు శ్రీమంతుల మనస్తత్వానికి సూచి, పెద్దముల్లు మిడిల్ క్లాస్ వాళ్ళ భావాలకి బరామీటరు సెకండ్ల ముల్లు శ్రామిక జనుల ఫిలాసఫీకి కొలబద్ద ఇసక గడియారం, నీటి గడియారం పాత కాలపు సంఘాలు - స్టాప్ వాచీ 'విప్లవాన్ని' 'టైం' చేసే సాధనం పెండ్యులం చెప్పక్కర్లేదు ఈ విధమైన సంకేతాలు వాడుకొంటే చెప్పేదాకా ఎలా తెలుస్తాయి !"

18 ఉద్యమంగా దీనికి మూడు దశలున్నాయి I, 1909 నాటి హ్యూమ్ సహచరులు సుమారు ఏడాదిపాటు, వారం వారం సోహో రెస్టారెంటు (ఎఫెల్ టవర్) లో కలుసుకొని పొడిగా, పటిష్ఠంగా ఉండే కవితను గురించి చర్చించుకొనే వారు వీరికంత పేరు ప్రతిష్టలూ లేవు, ఎవరినీ డీకొనాలనే వాంఛా లేదు ఇది తొలిదశ II, 1912 లో అంతకన్నా ఎన్నో ఆశలను పెట్టుకొని కొత్త ఆశయాలతో, కయ్యానికి కాలు దువ్వడానికి సంకోచించని ఎజ్రా పౌండు వర్గం రెండోదశను సూచిస్తుంది III, తర్వాత దశలోని ఇమేజిస్టులను చూసి ఎజ్రా పౌండు బెంగ పడ్డాడు, హతాశుడై పోయాడు ! ఈ ఉద్యమం మీద పెత్తనం స్వీకరించిన 'అమీ లవెల్' పేరన వీరిని-ఇమేజిస్టులు కారు-'అమీ జిస్టు' అన్నాడు - చూ 'మోడర్నిజమ్'లో నాటనజక్

19 చూ టి ఇ హ్యూమ్ "రొమాంటిసిజమ్ అండ్ క్లాసిసిజమ్"

20. పై వ్యాసమే

21 "యాన్ ఇమేజ్ ఈజ్ దట్ ఉచ్ ప్రెజెంట్స్ యాన్ ఇంటలెక్చువల్ అండ్ ఎమోషనల్ కాంప్లెక్స్ ఇన్ యాన్ ఇన్‌స్టెంట్ ఆఫ్ టైం" - ఎజ్రా పౌండ్

22 చూ ఎజ్రా పౌండ్ ఎ రిట్రాస్పెక్ట్

23 ఎజ్రా పౌండ్ 'ఇన్ ఎ స్టేషన్ ఆఫ్ ది మెట్రో' అన్నది ఇమేజిస్ట్ పద్యానికి మంచి ఉదాహరణ ఇందులో ఒకదాని కొకటి సంబంధం లేని రెండు విభిన్నమైన ప్రతిబింబాలు ఉన్నాయి చదువరి వాని సాయంతో చూపరి మనస్థితిని ఊహించుకోవాలి

అలాగే 'థర్ టీన్ వేజ్ ఆఫ్ లుకింగ్ ఎట్ బ్లాక్ బోర్డ్ వాలస్ స్టీవెన్స్ రచనను కూడా చూడండి

24 'మోడర్నిజమ్'లో నటాస్ జక్ వ్యాసం

25 చూ పై వ్యాసం

26 "నే నెందు మూలంగా వక్కాణి చేది ఏ మంటే, 1916 ఫిబ్రవరి 8న సాయంకాలం 6 గం॥లకు ట్రిస్టన్ జారా డాడా అన్న శబ్దాన్ని కనుగొన్నాడు జారా ఆ శబ్దాన్ని తొలిసారి ఉచ్చరించినప్పుడు నేను నా అయిదుగురు పిల్లలతోనూ అక్కడ ఉన్నాను ఆ మాట, మరి న్యాయంగానే, మాకు ఇవ్వగలిగినంత హుషారునూ ఇచ్చింది ఇది జూరిక్‌లోని కె ఫే టెర్రెస్‌లో జరిగింది ఏ తత్ సమయంలో నేను నా ఎడమ నాసికారంధ్రంలో తిరి పెడుతున్నాను ఈ మాటకు కించిత్తు కూడా ప్రాముఖ్యం లేదనీ శుద్ధ బడుద్ధాయిలు, స్పానిష్ ప్రొఫెసర్లు మాత్రమే తేదీలపట్ల ఆసక్తి కనబరుస్తారనీ, నాకు గట్టిగా తెలుసు ఆసక్తి దాయకమైంది డాడా ప్రపంచసం, డాడాకు అస్తిత్వం లేకముందునుంచీ కూడా మన మందరం డాడాలం" - జీన్ ఆర్ప్

27 డాడా 1915 నుండి 1922 అంతము వరకూ సాహిత్యానికీ, కళకూ సంబంధించిన ఉద్యమం, దాని పరిధి అంతర్జాతీయమైనది, శీలం విధ్వంసకమైనది"-ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా

28 "డాడాను నమ్మకండి ప్రతీదీ డాడాయే ప్రతిదానినీ డాడా అనుమానిస్తుంది కాని నిజమైన డాడాలు డాడాకు వ్యతిరేకులు"- ట్రిస్టన్ జారా

29 ఎన్నో పనులన్నీ ఏకకాలికంగానే జరుగుతున్నాయన్న భ్రాంతిని కల్గించడమే యౌగ పద్యపు పద్యాల ఆశయం ఒక జట్టుగా అందరూ ఒకేసారి ఆశువుగా సృష్టించినవని, వాని ప్రభావమంతా ప్రధానంగా చదవడం మీద ఆధారపడి ఉంటుంది కవి తనచిత్తం వచ్చినట్టు అరుస్తాడు కూస్తాడు, తిడుతాడు, నిట్టూరుస్తాడు, నత్తిని నటిస్తాడు, ఈలి శేక పెడతాడు - అంటాడు ఆర్ప్ (చూ 'మోడర్నిజమ్'లో రాబర్టు షార్ట్ వ్యాసం)

30 'ది ఎన్డ్ ఆఫ్ ది వరల్డ్' అన్న హ్యూల్ సెన్‌బెక్ పైకి అర్థ రహితంగానే ఉన్నా, నాటి ప్రపంచ ఉద్విగ్నస్థితిని తెలియచేస్తోంది

ఈ పేరాలోని విషయాలకు సి డబ్లూ ఈ బిగ్స్‌బీ "డాడా అండ్ సర్రియాలిజమ్" ఆధారం

31 9 చూ బిగ్స్‌బీ పుస్తకం

32 చూ అదే పుస్తకం

33 చూ ఇ ఇ కమ్మింగ్స్ పద్యం "ఎని వన్ లివ్డ్ ఇన్ ఎ ప్రెటీ హౌ టౌన్" దీనిలోని వ్యాకరణం భాషాశాస్త్రజ్ఞులకే ఇంతవరకూ లొంగలేదట !

34 దీనికి "రోజీ డెక్" అన్న బ్రిటన్ పద్యం ఉదహరణగా ఇవ్వబడింది

35 సర్రియలిస్టుల శబ్దాలు స్వతంత్రమైనవి వాట్లి శక్తి జిగి, వానిలోని ప్రేరకశక్తి, వానికి ప్రయత్నపూర్వకంగా సంక్రమింప

చేసే అర్థాన్నుంచి అవి ఎంతగా వైదొలగుతే, అంత దివ్యంగా ఉంటాయి అధివాస్తవికుడు శబ్దం స్వయం ప్రతిపత్తికి ఎవ్విధం గానూ అడ్డు తగలకూడ దంటాడు ఈ సందర్భంలోనే అధివాస్తవికుల ఆటలు ప్రాముఖ్యాన్ని వహిస్తాయి (చూ బిగ్స్ బీ పుస్తకం)

36. చూ. 'మోడర్నిజమ్' లో రాబర్టు షార్టు

37 చూ శ్రీశ్రీ 'చతుర్రసం'

"రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా
ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చినా
మానవ జాతి కింకా మానసిక స్వాతంత్ర్యం ఏర్పడ లేదు
మన ఆలోచన లింకా అరాచక దశలోనే ఉన్నవి

మానసిక స్వాతంత్ర్యం సాధించడమే యీ నాటి మానవ సమస్య" దీనిమీద శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి వ్యాఖ్యానం ఆంద్రే బ్రిటన్ అన్నదానిని దృష్టిలో పెట్టుకొని చూస్తే, సరిగానే ఉన్నట్టు కనబడుతుంది (చూ రా రా 'సారస్వత వివేచన'లో 'మేర మీరిన మేధ')

38 "తెలుగు సాహిత్య వికాసం (1900 - 1947 మధ్య)" లో శ్రీ కడియాల గోపాలరావు 'అభ్యుదయ కవిత్వం' మీద వ్యాసంలో అభ్యుదయ కవితకూ, అధివాస్తవికతకూ సూచించిన తేడా- కమ్యూనిస్టుల దృష్టితో అధివాస్తవికత కిది అద్దం పడుతుంది

39 శాస్త్రజ్ఞులూ, పండితులూ కాంతి అనేది వైబ్రేషన్ అని నాకు బోధించారు, దాని వేవ్ లెంగ్త్ కొలిచి చూపారు, వారి తర్కబద్ధమైన శ్రమకు లభించిన ఫలితాల నన్నింటినీ నాకు అందచేసారు ఇన్ని చెప్పినా నా కండ్లు నాకు బోధించేకాంతి అసలు స్వరూపం కాని, గ్రుడ్డి నుండి నే నెలా వేరుపడి ఉన్నానో కాని వీళ్ళేమీ చెప్పలేక పోతున్నారు ఇవన్నీ తర్కానికి అతీతమైన, అతి మానుష, లోకాద్భుత విషయాలు (ఆరగన్ 'పారిస్ పె జంట్' నుండి బిగ్స్ బీ ఉదహరించిన దానికి యధేచ్ఛాను వాదం)

40 చూ "తెలుగు సాహిత్య వికాసం (1900-1947 మధ్య)" లో 'అభ్యుదయ కవిత్వం' గురించి శ్రీ కడియాల గోపాలరావు, శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి "సారస్వత వివేచన"లో 'తనలో తానొక ఏకాంత సౌందర్యం రచించుకున్న స్వాప్నికుడు' వ్యాసం

41 "నేను మార్క్సిజమును తెలుసుకొన్నది సాహిత్యం ద్వారానే కాని, రాజకీయాల ద్వారా కాదు" శ్రీశ్రీ-సృజన ఇంటర్వ్యూ

42 శ్రీ సోమ సుందర్‌కు శ్రీ ఆరుద్ర వ్రాసిన లేఖనుంచి, "త్వమేవాహం" తొలికూర్పు ప్రకాశిక చూడండి

43 చూ 'త్వమేవాహం' మూడో కూర్పులో చేర్చబడిన శ్రీఆరుద్ర శ్రీ దాశరథికి వ్రాసిన లేఖ (5-11-53)

44 "మార్క్సిజమ్ అండ్ లిటరేచర్"లో ఇ ఎమ్ ఎస్ నంబూద్రిపాద్ వ్యాఖ్యాలు డా॥ కోవెల సంపత్కుమారాచార్య "ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ సాంప్రదాయిక రీతి"లో 294 పుటలో ఉదాహరింపబడ్డాయి ఇది అఖిలభారత సంస్థను గురించి అయినా మన 'అరసం'కూ వర్తిస్తుంది

45 దిగంబర కవులను తీవ్రంగా తెగడిన వారు శ్రీ రా రా (సంవేదన జనవరి 1969) డా॥ నాయని కృష్ణకుమారి ఈ ఉద్యమాన్ని దాడా యిజంతో పోల్చారు ["తెలుగు సాహిత్య వికాసం (1940 - 1947 మధ్య)"లో 'సంప్రదాయ కవిత'ను గూర్చిన వ్యాసం] శ్రీశ్రీ మాత్రం "దిగంబర కవులపైన బీట్నిక్కుల, యాంగ్రీ యంగ్ మెన్ మొదలైన వుద్యమాల ప్రభావం వుంది వారు మొత్తం ప్రపంచంలోని అసంతుష్టినీ, సంచలనాన్నీ తమ కవిత్వంలో వ్యక్తం చేస్తున్నారు" శ్రీశ్రీ సాహిత్యం, మూడు (వచన విభాగం) పే 236

46 వివరాలకు చూ డా॥ చేకూరి రామారావుగారి వ్యాసం "తెలుగు సాహిత్య విమర్శలో ఆధునిక ధోరణులు"

("తెలుగు సాహిత్య వికాసం (1900-1947 మధ్య)

47. చూ కవిసేన మేనిఫెస్టో

48 చూ, డా॥ జి వి సుబ్రహ్మణ్యం - "ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం"లో "ప్రభావాలు-పరిధులు" అధ్యాయం

49 ఫ్రాయిడ్ 'క్రియేటివ్ రైటర్స్ అండ్ డ్రీమింగ్'

50 ఎల్ ట్రిల్లింగ్ 'ఫ్రాయిడ్ అండ్ లిటరేచర్'

51 సి జి యాంగ్ 'సైకాలజీ అండ్ లిటరేచర్'

52 మాడ్ బాడ్‌కిన్ 'ఆర్కిటైపల్ పాటర్న్స్ ఇన్ పొయిట్రీ' ఈ విషయంలో ప్రామాణికత్వాన్ని సంతరించుకుంది

53 చూ "జానపద గేయాలు-సాంఘిక చరిత్ర"కు ఉపోద్ఘాతం డా॥ బి రామరాజు, డా॥ నాయని కృష్ణకుమారి

54 జె. సి రాన్సమ్ మున్నగు అభినవ విమర్శకులు కావ్యాన్ని చూచిన దృష్టికి ఇది సారాంశం డా॥ జి వి సుబ్రహ్మణ్యంగారి 'ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం' కూడా చూడండి

55 రష్యాలో ప్రారంభమైన ఆకృతి వాదానికి అలగ్జాండర్ పొటెబ్‌న్యా (1835-1891), అలగ్జాండర్ వేసెలోవ్‌స్కీ (1838-1906) లను మూల పురుషులుగా పేర్కొనవచ్చుమ వీరు సాహిత్యాన్ని సాహిత్యేతర అంశాలనుంచి విడదీసి చూసారు, పొటెబ్‌న్యా గద్యకన్న కవిత ఏవిధంగా భిన్నమైనదో ఆలోచించగా, సాహిత్యాను శీలనకు మోటిఫ్, దాని ప్రయోజనాన్ని వేసెలోవ్‌స్కీ పర్యాలోచన చేసాడు (ఆకృతి వాదుల దృష్టిలో మోటిఫ్ అంటే ఏమిటో గమనించండి ఎమోటిఫ్. ఈజ్ ఎని సింపిల్ యూనిట్ ఎంటరింగ్ ఇన్టు ఎ వర్క్ ఆఫ్ ఆర్ట్, ఏజ్ వుయ్ సీ ఇన్ థిమాటిక్స్, ఎ స్కిల్డ్ అండ్ లాజికల్ క్రిటిక్ లైక్ బోరిస్ తొమాషివిస్కీ కన్ యాజ్ ది కాన్సెప్ట్ ఆఫ్ మోటిఫ్ టు ఇక్స్‌ప్లెయిన్ మచ్ ఎబౌట్ ది స్ట్రక్చర్ ఆఫ్ లిటరరీ వర్క్స్) - "రష్యన్ ఫార్మలిస్ట్ క్రిటిసిజమ్ ఫోర్ ఎస్సేస్"-లీ టి లెమన్, మారియన్ జె రియాస్ ఉపోద్ఘాతం

56 ఈ పేర్లు ఇక్కడ ఆకృతి వాదుల సాంకేతిక పదాలుగా వాడబడుతున్నాయి

57 చూ బోరిస్ తొమాషి విస్కీ 'థిమాటిక్స్' మీది వ్యాసం ఇందులో కథా కథన శిల్పాన్ని గురించిన అంశాలున్నాయి

58 చూ రీన్ వెల్లెక్, ఆస్టిన్ వారెన్‌ల "థియరీ ఆఫ్ లిటరేచర్" పుస్తకంలోని యూఫనీ, రిదిమ్, అండ్ మీటర్' అన్న అధ్యాయం

59 షెల్లీ "ఓడ్ టు వెస్ట్ విండ్"లో అంత్యప్రాసవల్ల పద్యానికి వచ్చిన గరువతనాన్ని డేవిడ్ లాడ్జి 'ది మోడ్స్ ఆఫ్ మోడర్న్ రైటింగ్'లో వివరించాడు

60 చూ డా॥ కోవెల సంపత్కుమారాచార్య "ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ సాంప్రదాయిక రీతి"లో 12వ అధ్యాయంలో నాచన సోమనను గూర్చి

61 డేవిడ్ లాడ్జి ఇచ్చిన ఉదాహరణ "షిప్స్ క్రాస్డ్ ది సీ"ని "కీల్స్ ప్లౌడ్ ది డీప్"గా మార్చినప్పుడు, 'క్రాస్డ్' బదులు 'ప్లౌడ్' వాడడం మెటఫర్, 'షిప్స్'కి బదులు 'కీల్స్', 'సీ'కి బదులు 'డీప్' వాడడం సినక్డకి, మిటానమీ

62, "ది పొయిటిక్ ఫంక్షన్ (ఆఫ్ లాంగ్వేజ్) (ప్రొజెక్ట్స్ ది ప్రిన్సిపిల్ ఆఫ్ ఈక్వివలెన్స్ ఫ్రమ్ ది ఆక్సిస్ ఆఫ్ సెలక్షన్ ఇన్టూ ది ఆక్సిస్ ఆఫ్ కాంబినేషన్" డేవిడ్ లాడ్జ్ పుస్తకంలో 'లింగ్విస్టిక్ అండ్ పోయిటిక్స్" అన్న యాకబ్‌సన్ వ్యాసంనుంచి ఉదాహరింపబడింది

63 చూ 'కావ్యానందం', 'శాకుంతలము యొక్క అభిజ్ఞానత విశ్వనాథ సాహిత్య విమర్శను గురించి I, డా జి వి సుబ్రహ్మణ్యం 'ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం'ను, II, విద్వాన్ తాటికొండ వెంకట కృష్ణయ్య, శ్రీ ముదివేడు ప్రభాకర రావు గారల 'బ్రహ్మీమయమూర్తి-విశ్వనాథ సాహితీ దర్శనం' లోని 'విమర్శక చక్రవర్తి' భాగాన్ని చూడండి

64 'బ్రహ్మీమయమూర్తి' పుస్తకానికి డా॥ టి కోటేశ్వరరావు పీఠిక: పుటలు 14 నుండి 17 వరకు చూడండి

(అయిపోయింది)



# హెచ్చరిక

## శ్రీ కలువకొలను సదానంద

ఓ చీకటీ !
నిన్ను అంతకంటే ఇంకేమని పిలువను ?
నువ్వు చీకటివి
కన్నులు లేవు నీకు,
చెవులా_వినిపించవు.
నీ తలలో ఆలోచనే మెదలదు
అందుకే__
నిన్ను చీకటి అని అంటున్నాను

పసిఫిక్ మహాసముద్రమంత కడుపుతో,
చైనా గోడనే బ్రద్దలు కొట్టుకుని బయటికి తొంగిచూచే ఆకలితో,
అన్నీ దిగమ్రింగి అవులించే హూయాంగ్ హూలాంటి విషపు నాలుకతో
తరుము కొస్తున్నావు

నన్ను, నామరూపాలు లేకుండా
నమిలి మ్రింగాలని చూస్తున్నావు.
బిక్కు బిక్కుమంటూ నీ క్రూరి రెక్కల నీడల అంచున
దిక్కుతోచక ఒదిగి కూర్చున్న చిన్ని దీపాన్ని నేను,
మానవుని మనుగడకు మార్గదర్శిని నేను,
మంచికీ, మానవత్వానికీ ప్రతిరూపాన్ని నేను,
నా తపస్సులో నేనున్నాను
నన్ను ఉఫ్ఫున ఊదివేసి
నా అంగణాన్నే ఆక్రమించుకోవాలని చూస్తున్నావు
అందుకే ఇంతగా బరితెగించి
మీది మీదికి వస్తున్నావు

సహించాను
ఇంతకాలమూ ఓర్పు వహించాను,
నీ అత్యాచారాలు మితిమీరి పోయినవి
కన్నులు మూసుకుపోయి నీకు ఆకలి బలిసింది
నీ నాలుక ఎన్నో యోజనాలు ప్రాకి వచ్చినా
నీ ఆకలి తీరలేదు,
చివరికి అదురూ బెదురూ లేక
సరిహద్దులు సైతమూ దాటుకొన్నావు,
కనుచూపు దూరం నుండి
నా ఇంటి ముందరికే వచ్చి నిలబడ్డావు__
మృత్యువు దగ్గరకే వచ్చావు !
అయినా, హెచ్చరిస్తున్నాను,
ఇప్పుడు నేను__
నీ రెక్కల విసురుకు అల్లలాడిపోయే
చిన్ని దీపకళికను కాను ..
ప్రళయ కాలరుద్రుని మూడోనేత్రాన్ని !
నేను ఒంటరిగా వున్నానని
ధీమాగా వచ్చావేమో, పాపం__
ఇదిగో, ఇటు చూడు !
పసిపాప కూడా క్షమించలేని
నీ దౌష్ట్యానికీ, దానవత్వానికీ,
అక్రమానికీ, అవినీతికీ
మనసు రోసిపోయి, సహనం కోలుపోయి,
నీ కోసమే ఎదురుచూస్తూ
చివరి హద్దున నిలబడిన నావంటి
కోటి దీపాలు !

ఇకనైనా కళ్ళు తెరిచి చూడు !
ముందరికి రాకు,
వెనక్కు పారిపో!
ఎక్కడికి ?
దిక్కుల కావలికి !
నా పొలిమేరల వెలుపలికి !

డా॥ యార్లగడ్డ బాలగంగాధరరావు

# కృష్ణానది - ఉభయపార్శ్వాల్లోని గ్రామనామాలపై దాని ప్రభావం

ఈ వ్యాసం విజయవాడకు దిగువ, ఇంకా చెప్పాలంటే ఎనమలకుదురు దిగువనుండి సాగరసంగమం చేసే పర్యంతం, దాని కిరువైపులాగల భూభాగానికే ఈ వ్యాసపరిధి పరిమితం. ఇలా పరిమితం చేయడానికి గల కారణం, కృష్ణానది ప్రభావం ఈ ప్రాంతానికే పరిమితం కావడం. నదికి ఎగువభాగంలో అనగా విజయవాడకు ఎగువన నదీప్రభావం భూభాగంపై కన్పించదు. దీనికిగల ఒకే ఒక కారణం భూమి వాలు తలం. దీని ప్రభావం వలన ప్రవాహం, విజయవాడకు ఎగువన భూమ్యోపరితలానికి చాల దిగువగా వుంది. విజయవాడకు దిగువన గల ప్రవాహం భూమ్యోపరితలానికి, సమానంగా కాదు గాని, చాల తక్కువ లోతులో ప్రవహిస్తుంది. విజయవాడకు తూర్పున గల భూభాగం సుమారుగా మైలుకు ఒక అంగుళం చొప్పున సముద్రంవైపు వాలి వుంది. దీని కారణంగానే వరద ప్రభావం సుమారుగా విజయవాడకు ఎగువన గల రాయపూడినుండి సముద్రపర్యంతం ఇరువైపులా ముఖ్యంగా విజయవాడకు దిగువ కృష్ణాజిల్లా భూభాగంపై వుంటుంది. ఈ ప్రభావం ఫలితమే గ్రామనామాల్లో కన్పిస్తుంది. అయితే గుంటూరుజిల్లా భూభాగంలోని ఊర్ల పేర్లలో కూడ ఈ ప్రభావం కన్పిస్తుంది కాని దానికి కారణం కృష్ణానది వరద కాదు ఇతర కారణాలు, కృష్ణాజిల్లాల్లోని గ్రామాల పేర్లతో సారూప్యం పొందేటట్లు చేశాయి వాటిని విపులంగా చర్చించడమే ఈ వ్యాసం లక్ష్యం దీనిని కృష్ణాజిల్లాకు ఆ పేరు ఎలా ఏర్పడిందనే పరిశీలనతో ప్రారంభిద్దాము.

కృష్ణ ఎక్కడో పుట్టింది ఎంతో భూభాగంగుండా ప్రవహించింది మన సౌకర్యంకొరకే పెట్టుకున్నా, కృష్ణ ఎన్నో జిల్లాలకు సరిహద్దుగా ప్రవహిస్తోంది కాని ఒకానొక ప్రాంతానికే కృష్ణానది పేరుమీదుగా కృష్ణాజిల్లా అనే పేరు వచ్చింది ఎప్పటినుండి వచ్చింది అనే దానికి సమమైన ఆధారాలు లేవు కాని ఉభయ గోదావరి జిల్లాల భూభాగాలకు ఆ నది పేరు రావడానికి పూర్వమే, ఈ భూభాగానికి కృష్ణాజిల్లా అనే పేరు స్థిరపడిందని చెప్పడానికి తగు ఆధారాలు కృష్ణాజిల్లాలో మాన్యువల్‌లో కనిపిస్తాయి. జిల్లాలను పునర్వ్యవస్థీకరించిన సందర్భంలో, మచిలీపట్నం జిల్లానుండి, గుంటూరు భాగాన్ని, ఏలూరు భాగాన్ని, ఇంకా పైభాగాన్ని విడదీసిన సందర్భంగా గోదావరి జిల్లా ఏర్పాటయినట్లు దానిలో వివరణ కన్పిస్తుంది. కృష్ణాజిల్లా అనే పేరు ఎలా ఏర్పడింది అనే విషయంలో మౌనం వహిస్తుంది. చారిత్రక ఆధారాలు కన్పింపవు. చరిత్ర కాలాల్లో ఈ భూభాగాన్ని ఉత్తరకంర్డ వాడినాడు (విజయవాడ, నందిగామ తాలూకాలోని కొంత భూభాగం) వెలనాడు (దివితాలూకా భాగము) గుద్దవాదినాడు (గుడివాడ తాలూకా ప్రాంతము) కొండపల్లి సీమ (కొండపల్లినుండి సముద్రపర్యంతంగల భూభాగం)అనే పేర్లున్నట్లు మాత్రమే తెలుస్తుంది తప్ప కృష్ణాజిల్లా, కృష్ణానదినాడు అనే పేర్లున్నట్టు దాఖలా లేదు. కృష్ణకు మరోపేరైన పేరకమ్మ పేరుతో కూడ ఈ భూభాగానికి పేరు లేదు. గుంటూరుజిల్లా భాగానికి ఒంగోలు వరకు గల ప్రాంతానికి మాత్రం, గుండ్లకమ్మ పేరకమ్మల నడిమిప్రాంతంగా కమ్మనాడు అనే వ్యవహారం మాత్రం వుంది. మరి కృష్ణాజిల్లా ప్రాంతానికి ఆ పేరు ఎలా ఎప్పుడు వచ్చిందనేది ప్రశ్న. దీనికి సరియైన సమాధానం లేదని ముందే చెప్పడం జరిగింది. అయితే ఇది జనం వాడుక నుండి, ఏర్పడియుంటుందని నా ఊహ నా ఊహకు ఉపబలకమైన కారణాలు. కృష్ణానది ఎక్కడ పుట్టినా, దాని ప్రభావాన్ని వరద కారణంగా చవిచూసేది ఈ ప్రాంతం మాత్రమే. ముఖ్యంగా గుడివాడ, బందరు, కైకలూరు, దివితాలూకాలు వరదతో ముంచెత్తబడేవి. దీనికి కారణమైనవి కృష్ణనుండి చీలిన ప్రవాహాలు లేక పాయలు అవి పుల్లేరు, (దీనికి మరోపేరు మలాపహారిణి) గండికోడు, (ఇది పుల్లేరునుండి మద్రివాడ దగ్గర చీలుతుంది) పోలరాజు ఛానల్ (పుల్లేరునుండి గుడ్లవల్లేరు దగ్గర చీలుతుంది) భీమనది (ఇది కృష్ణ నుండి పెనమకూరు దగ్గర చీలింది. చూ అనంతామాత్యుని భోజరాజీయము), గుండేరు (ఇది శ్రీకాకుళానికి ఎగువన ఉత్తరాన చీలింది) ఏనుగులకోడు, ఇక దివిసీమలోని తెల్లేరు, బల్లలేరు, కట్టలేరు, పులిగడ్డవద్ద చీలిన పాయ-ఇవి కృష్ణానది ప్రధాన ప్రవాహం నుండి చీలిన పాయలు. ఇవి ప్రవహించినంతమేర, వరద సంభవించినప్పుడు ముంపుకు గురిఅయ్యేది. ఆ విధంగా ఆ ప్రాంతపు జన

జీవితాన్ని తీవ్రమైన ప్రభావానికి గురిచేసింది. వరద సమయంలో కష్టనష్టాలకు గురిచేసినా, తిరిగి వారికింత అన్నాన్ని పెట్టింది, ఆ ప్రాంతపు జనజీవితాన్ని సౌఖ్యయుతంగా తీర్చిదిద్దింది ఆ నదీ ప్రవాహాలే. దాని ప్రభావానికి గురియైన ప్రాంతం కనుక, దానికా పేరు అక్కడివారే పెట్టుకొనియుండవచ్చు, లేదా ఇతరులు ఆ ప్రాంతాన్ని అలా పిలిచియుండవచ్చునని ఊహించడంలో విప్రతిపత్తి లేదు. ఇదిలావుండగా, కృష్ణానదిపై విజయవాడవద్ద ఆనకట్ట కట్టిన తరువాత తూర్పు కృష్ణాభాగం మాగాణి సాగులోనికి వచ్చింది గదా! అయినపుడు కృష్ణానది, పైన పేర్కొన్న దానికిగల పాయలలోని నీరు వ్యవసాయానికి ఎలా అందివచ్చింది అనే అభ్యంతరం పై ఊహకు ప్రతిబంధకంగా కన్పించవచ్చును. కాని, ఆనకట్ట నిర్మింపక పూర్వమే, తూర్పు కృష్ణాభాగం, ముఖ్యంగా గుడివాడసీమ మాగాణి సాగులో వుంది. పై ప్రవాహాలనుండి నీరు పారించి, చెరువులను నింపి తద్వారా సాగు కావించినట్లు, ఆ చెరువులకు వడ్డి చెరువులనే పేరున్నట్లు, ఆ ప్రాంతంలోని భూములను దేవాలయాలకు వ్యక్తులకు దానంగా ఇచ్చినపుడు, వాటిని వ్రీహిక్షేత్రాలుగా పేర్కొన్నట్లు, ఆ ప్రాంతంలో లభ్యమైన శాసనాలు సాక్ష్యం పలుకుతున్నాయి. అంతేగాక నిన్న మొన్నటివరకు గుడివాడ తాలూకా, కైకలూరు తాలూకాలను పల్లపుప్రాంతంగా వ్యవహరించే వాడుక మిగతా తాలూకాలలో (దివితాలూకాతోసహా) వుంది. కోడూరు (గుడివాడ తాలూకాలోనిది) బురదనుకుంటే మేడూరులో మెట్టశిస్తు జాస్తి అనే సామెత కూడ. ఆ ప్రాంతం పల్లపుప్రాంతమనే దానిని సమర్థిస్తుంది. కనుక, నేటి తూర్పు కృష్ణాభాగం అనాదిగా కృష్ణామండలంగా జనవ్యవహారంలో వుండివుండవచ్చునని, ఇంగ్లీషువారు జిల్లాలను వర్గీకరించిన స్థితిలో సాధికారికంగా స్థిరపడి నేటి పశ్చిమ కృష్ణాజిల్లాగా వ్యవహరింపబడుతున్న ప్రాంతంతోసహా (ఒకే యూనిట్ గనుక) కృష్ణాజిల్లాగా వ్యవహారంలోనికి వచ్చియుండవచ్చు. వెనుకటితరాల్లో, తాము కృష్ణాతీరంవారమనే చెప్పుకునే వ్యవహారం ఈ ప్రాంతానికే చెల్లిరావడం కూడ ఈ సందర్భంలో గమనింపదగ్గది. ఏమైనప్పటికి నది ఎక్కడ పుట్టినా, దాని ప్రభావానికి గురైన నది_అది మంచిఅయినా చెడుఅయినా_ ఈ ప్రాంతం మాత్రమే. కనుకనే దానికా పేరు చెల్లివచ్చింది ఇక్కడ ఒక విషయం గమనించాలి ప్రభావంవల్ల కల్గిన ప్రతిస్పందనే, దేనినికైనా గుర్తించడానికి కారణమవుతుంది. వ్యక్తుల విషయంలో వాడ అంతే. బుడమేరు ఎక్కడో పుట్టింది పుట్టినచోటగాని, విజయవాడకు ఎగువనగల ఆ ప్రవాహాన్ని గూర్చి ఎప్పుడూ ఎవరూ పట్టించుకోరు. కారణం అక్కడి జనజీవనంలో దానికేమీ పాత్రలేదు. విజయవాడకు దిగువస్థితి అలాంటిది కాదు. దాని వరద ప్రభావం ఇక్కడే కన్పిస్తుంది. ఇక్కడే జనుల ప్రతిస్పందన వుంటుంది. నిన్న మొన్నటి గోదావరి వరద ప్రభావం కూడా రాజమహేంద్రవరానికి దిగువన తప్ప ఎగువన దాని వరదను గూర్చి పట్టించుకోవాల్సిన అవసరం ఏమంత ఏర్పడింది? ఆ ప్రవాహభాగాన్ని అంటివున్న ఎగువ భూభాగంపై దాని ప్రభావమేమీ ఉండదు. దానికి కారణం భూమ్యోపరితలానికి చాల దిగువగా ప్రవాహం వుండుటయే. వరద వచ్చినపుడు నది పైకి పొంగుతుందేతప్ప భూభాగాన్ని ముంచెత్తదు. దిగువన అలాకాక ప్రవాహం ప్రక్కలకు విస్తరిస్తుంది. దాని ప్రభావానికి ప్రజల ప్రతిస్పందన వుంటుంది. కృష్ణానది విషయంలో కూడ విజయవాడకు ఎగువన జనజీవనంలో దానికి అస్తిత్వం లేదు. దిగువన అది కల్గించే ప్రభావం వలన దాని అస్తిత్వాన్ని గుర్తించి తీరవల్సిన అవసరం జనానికేర్పడుతుంది. ఈ గుర్తించి తీరవలసిన అవసరమేదైతే గలదో అదే వారి నివాస ప్రాంతాలకు పేర్లుంచిన తీరులో కూడ ద్యోతకమవుతుంది.

## గ్రామనామాలపై నదీప్రభావం

శీర్షిక కృష్ణానది ప్రభావమని మాత్రమే వున్నా పైన సూచించిన దాని పాయలన్నింటిని - ఆ మాటకొస్తే అక్కడి ప్రవాహాల నన్నింటిని, పరిగణనలోనికి తీసికోవాలి. శీర్షిక కేవలం సౌలభ్యం కొరకు మాత్రమేనని, అధికతమమైన పాత్ర దానిది, దాని ఇతర పాయలది కావడం వలన శీర్షిక అలా ఉంచవలసి వచ్చిందని మనవి. తూర్పు కృష్ణాప్రాంతంలో పైన పేర్కొన్న పాయలుగాక, ప్రధానమైన ఇతర ప్రవాహాలు బుడమేరు, తెన్నేరు, వన్నేరు, చంద్రయ్య కాలువ. నెహర్లి ఛానల్, దీక్షితులకోడు, జంగాలకోడు, మామిళ్ళకోడు, లేళ్ళపూడి ఛానల్ ప్రధానమైనవి. పైవాటిలో తెన్నేరు కేవలం గ్రామనామంగా మాత్రమే కన్పిస్తుంది. (తెన్నేరు: దక్షిణపు ఏరు, వన్నేరు. ఉత్తరపు ఏరు). ఇక గుంటూరువైపున తుంగభద్ర, గోదావరి, వలివేరు, జగజ్జేరు, ఉప్పుకాల్వ, గంగోలు అనేవి ప్రధానమైన ప్రవాహాలు. వీటిలో తుంగభద్ర (ప్రస్తుతపు వెస్ట్రన్ డెల్టా మెయిన్) మెల్లెంపూడి ఇప్పటం గ్రామాలవద్ద తుంగభద్ర, గోదావరి అని రెండుగా చీలింది. తుంగభద్ర, తుమ్మపూడి సంగం జాగర్లమూడి, అంగలకుదురు, పొన్నూరుల మీదుగా ప్రవహించి సాగర సంగమం చేస్తోంది. గోదావరి మెల్లెంపూడి నూతక్కి మీదుగా ప్రవహించి తిరిగి కృష్ణలోనే సంగమించేది. ఇవి కృష్ణానది పాయలే. వీటి పుట్టుక సీతానగరంవద్ద (నేటి మెయిన్ కాలువ పుట్టిన చోటు). అక్కడే ఎగువనుండి కొండవీడు ప్రాంతాలనుండి తాడికొండలో అక్కదేవర చెరువునునింపి, నీరుకొండ, నిడమర్రుగ్రామాల మధ్యగా ప్రవహించి నవులూరు ఆవను నింపి కృష్ణాయపాలెంవద్ద రెండుగా చీలి, ఒకటి సీతానగరంవద్ద రెండవది మందడం గ్రామానికి

దిగువ కృష్ణలో సంగమించేవి ఇవి పలివేరు నెరుగ్రామనామం మాత్రమే. జగాకోడు ఉనికి రేపల్లెతాలూకా బేతపూడిపద్ద గమనించ వచ్చును. ఇవి స్వతంత్రమైన ప్రవాహాలు దీనినిబట్టి గడివాడ తాలూకా, కైకలూరు, బందరు దివితాలూకాలు, మంగళగిరి తాలూకా లోని కొంతభాగము, దుగ్గిరాల, తెనాలి, రేపల్లె పల్లిపట్ల తాలూకాలు జలప్రవాహాలమయంగా ఒకప్పటి స్థితిగా గోచరిస్తుంది; ప్రస్తుతము ఇవి వున్నాయి. కాని జనజీవనంలో వాటికి అస్థిత్వంలేదు, దీనికి కారణం కృష్ణపైన ఆనకట్ట నిర్మించిన తరువాత పైప్రాంతపు భూభౌతికస్థితిలో వచ్చినమార్పు. మొత్తం ప్రాంతమంతా మాగాణి సాగులోనికి రావడం, నాటి ఇంజనీరు ఆర్ సహజ ప్రవాహాలను పంట కాలువలుగా, మురుగు కాలువలుగా తీర్చిదిద్దిన తీరు (వివరాలకు చూడు కృష్ణాజిల్లా మాన్యుయల్) ప్రస్తుతం ఆ వివరాలతో మనకు పని లేదు. ఈ ప్రవాహాల ప్రభావం, ఆ ప్రాంతపు ఊళ్ళపేర్లలో ఎలా ప్రతి ఫలించిందో అంచనా వేయడం, మరొకమాటలో చెప్పాలంటే-తమ ఆవాస నామ్మీకరణంలో జనానీకం ప్రకృతికి ఎలా ప్రతిస్పందించారో గమనించడం.

## ఉద్దేశిత ప్రాంతంలోని గ్రామనామాల ప్రత్యేకత

తెలుగు గ్రామనామాల్లో సాధారణంగా రెండు భాగాలుంటాయి. **ఉదా:** విజయవాడ. ఇందులో విజయ ఒక భాగం కాగా వాడ రెండవ భాగం రెండవభాగంలో కన్పించేవాటిలో, ఊరు, పాడు, పల్లె, గూడెం, కొండ, వాడ, పురం, పరం, పఱ్రు, పూడి, లంక, దిబ్బ, మెరక, తుఱ్రు, కుఱ్రు, గిరి, మల, పాలెం మొదలైనవి చాల కన్పిస్తాయి. అయితే ఇందులో కొన్ని, కొన్ని ప్రాంతాలకే పరిమితం. మరికొన్ని, మరికొన్ని ప్రాంతాలకు పరిమితం. అంటే అవి నెలకొన్న తీరులో ఒక నియతి ఒక క్రమం వుంది. దీనిని గమనించినపుడు, ఆ పేర్నుంచిన జనుల ఆలోచనా విధానం స్పష్టమవుతుంది. భౌతిక లేక ప్రాకృతిక పరిస్థితులు వారి ఆలోచనావిధానాన్ని క్రమబద్ధీకరించిన తీరు వ్యక్తమవుతుంది. ఈ నేపథ్యంలో ఉద్దేశిత ప్రాంతంలోని గ్రామ నామాలను పరిశీలిస్తే - చాలా ఆశ్చర్యం గొలుపుతుంది.

పైప్రాంతంలో, పఱ్రు, పూడి, కుఱ్రు, లంక, దీవి, మెరక, తిప్ప, దిబ్బ, గడ్డ, మొదలైనవి రెండోపదంగా అనేక గ్రామనామాల పేర్లలో కన్పిస్తాయి. అయితే ఊరు,పల్లె,పాడు, పురం అనే ఇతరమైన పదాలు గల గ్రామాలు అక్కడ లేవని కాదు, ఉన్నాయి. కాని ప్రయత్నం మీద, అవి ఎప్పుడు ఏర్పడ్డాయో తెలుసుకోవడానికి వీలుంది. ఎందు కంటే దేనిని ఊరు అనాలో, పురమనేదానికి లక్షణాలేవో చెప్ప బడిందంటే, సంస్కృతిపరంగా, నాగరకతపరంగా మానవుడు ఎదిగి వచ్చిననాటి స్థితిని బోధిస్తోందన్నమాట, పైన చూపిన పఱ్రు, పూడి ఇత్యాదిగా గలవికూడ కొన్ని ప్రత్యేక లక్షణాలున్నచోటే ఏర్పడలాయి. ఆ లక్షణాలు మానవ మస్తిష్కాన్ని ప్రేరేపించాయి కనుకనే ఆపేర్ల వచ్చాయి ఏ ప్రభావము లేకుండా పేరు ఏర్పడదనేది సిద్ధాంతం కాని అవి నిర్వచింపబడలేదు కనుక, ఊరు, పాడు, పురం, నగరం అనే భావన జనులకు ఏర్పడటానికి పూర్వం అవి వాడుకలోనికి వచ్చాయని, భావించవచ్చు దేనిని పఱ్రు అనాలో, దేనిని పూడి అనాలో, దేనిని కుఱ్రు అనాలో - ఒక స్పష్టమైన అవగాహన జనుల మస్తిష్కంలో వుందనేది సిద్ధాంతం ఈ విధమైన నిర్ణయానికి రావ డానికి, పై పదాలు, ఉద్దేశితప్రాంతం వంటి లక్షణాలున్నచోట్లకు మాత్రమే పరిమితం గావడం విశేషం గోదావరి ఉభయపార్శ్వాల్లోన ఇలాంటి స్థితి కన్పిస్తూంది ఇంకా పైకి వెళ్తే విశాఖపట్నం (దొండ పర్తి పెందుర్తి) వరకు కన్పిస్తాయి. దక్షిణాన పాలపఱ్రు, బొప్పూడి (గుంటూరుజిల్లా) కన్పిస్తాయి అవి కూడ ప్రవాహాల ఒడ్డున వుండటం విశేషం, ఇంకా దిగువన కూడ చెదురు మదురుగా కన్పిస్తాయి. అదైనా నదులు పీఠభూమిని వదిలి, మైదాన ప్రాంతంలోనికి వచ్చిన తరువాత-ఎక్కడ ఆ ప్రవాహపు ప్రభావం కన్పిస్తుందో అక్కడ మాత్రమే కన్పిస్తుంది మిగతా ఆంధ్రదేశభాగంలో కన్పించదు. దీనినిబట్టి, భౌతిక పరిస్థితులకు, మన పూర్వులు ప్రతిస్పందించిన తీరు గోచరమవుతుంది. ఆంధ్రదేశంలో చాల నదులున్నాయి. మైదాన ప్రాంతంలోను ప్రవహిస్తున్నాయి. నాగావళి, వంశధార, శారద, తాండవ, పెన్న, స్వర్ణముఖి, మొదలైనవి సకృత్తుగా తప్ప వాటి దగ్గర ఇలాంటి ఊళ్ళపేర్లు రాలేదు. అధికసంఖ్యలో కన్పిస్తోంది. కృష్ణా గోదావరి నదుల దగ్గర మాత్రమే. భాషాపరంగా కూడ, ఈ ప్రాంతం ఒక మాండలిక (మధ్యాంధ్ర మాండలికం) విభాగానికి చెంది వుండడం గమనార్హం.

ఇదిలావుండగా ఉద్దేశిత ప్రాంతంలో కూడ కొంత ప్రత్యేకత వుంది. కేవలం గుడివాడ, కైకలూరు, తాలూకాల్లో మాత్రమే (తాలూకాల విభజన మన ఉపయోగం కొరకు చేసింది మాత్రమేనని గుర్తుంచుకోవాలి) పఱ్రు, పూడి, కుఱ్రు, అధికాధికంగా కన్పిస్తాయి. ఇదే పరిస్థితి రేపల్లె, తెనాలి తాలూకాల్లోను కన్పిస్తుంది. కాగా దివి తాలూకాలో, గడ్డ, లంక, దీవి, తిప్ప, కుదురు (ఇది గుంటూరుజిల్లా భాగంలోకూడ కన్పిస్తుంది. నడకుదురు,అంగలకుదురు, ములుకుదురు) ప్రముఖంగా కన్పిస్తాయి. పై రెండు విభాగాలకు చెందిన పదాలు వీటి ప్రభావంతో ఏర్పడినవే అయినా అచ్చటి భూభౌతిక స్థితి కారణంగా, పేర్లలో ఈ భేదం ఏర్పడింది. దానికి కారణం మళ్ళీ, భూమ్యోపరి తలానికి, నీటి ప్రవాహానికి గల అంతరంలోని భేదమే పూడి అనేది వరదముంపుకు గురయ్యేచోట, పఱ్రు అనేది కేవలం తాకిడికి గురయ్యేచోట, కుఱ్రు అనేది పఱ్రుకు ఎగువన గల భూభాగంలోను వస్తాయి. ఇక గడ్డ అనేది ప్రవాహపు ఒడ్డున గల ఎత్తైన భూభాగం వున్నచోట, లంక, ప్రవాహపు మధ్యభాగంలో ఏర్పడిన పెద్ద

భూఖండానికి, తిప్ప అనేది, పరిమాణంలోను, ఎత్తులోను చిన్నదైన భూమికి, కుదురు అనేది రెండు ప్రవాహాల కలయిక గలచోట లేదా ప్రవాహం ప్రవహిస్తూ మార్గమధ్యంలో కొంతమేర స్థిమితాన్ని పొంది మళ్ళీ ప్రవాహంగా సాగిపోవడానికి అనువైనచోట వస్తాయి ఈ వివరణనుబట్టి, ఉద్దేశిత ప్రాంతపు భూభౌతికస్థితిని ఎవరైనా తేలికగా అంచనా వేయవచ్చును. ఆ ప్రాంతపువారికి ఆ స్థితి అనుభవంలోనిదే

ఇక్కడ మరొక విషయిం గమనించాలి. గుడివాడ తాలూకాలో, ఒకే పేరుగల గ్రామాలు రెండు, కొన్ని సందర్భాల్లో మూడు కూడ కన్పిస్తాయి. వివక్ష కొరకు శేరీ అనీ, జమీ అనీ, లేక చిన్న, పెద్ద అనే విశేషణాలతో కన్పిస్తాయి. ఎందుకిలా జరిగిందనేది ప్రశ్న. గుడివాడ తాలూకా అనాదిగా వరి పండే ప్రాంతమని ముందు చెప్పడం జరిగింది వరి పండేచోట జీవనంలో స్థిరత్వం, నెమ్మది ఏర్పడతాయి.. మిగతా ఆహారధాన్యాలకంటె, పరిమాణంలో వరి ఎక్కువ పండటం దానికి కారణం ఏమైనా ఈ స్థిరత్వం, నాగరికతకు, సాంస్కృతికాభివృద్ధికి కారణమవుతుంది. జనసాంద్రత పెరగడానికి దోహదమవుతుంది (మిగతా తాలూకాలతో పోలిస్తే - ఇప్పటికి గుడివాడ తాలూకా జనసాంద్రత హెచ్చు). జనసాంద్రత పెరుగుదలతోపాటు, వ్యవసాయయోగ్యమైన భూమి విస్తీర్ణం పెరగదు కనుక జనం ఆ చోటునుండి కదిలి వెళ్ళవలసిన స్థితి ఏర్పడుతుంది. ఎక్కడకు వెళ్ళాలి. తమకు తెలిసిన వ్యవసాయ పద్ధతులలో సాగు చేయడానికనువైన పరిస్థితులున్నచోటికే వెళ్ళాలి. ఆ దిశగా అచ్చటి ప్రవాహాల వెంట వెనుకను ముందును కదిలారు. వారి జ్ఞాపకాలవెంట వారి పూర్వపు ఆవాసాల పేర్లు కూడ వచ్చాయి. క్రొత్త నివాసప్రాంతాలకు మళ్ళీ అవే పేర్లు వచ్చాయి. తిరిగి జనసాంద్రత పెరిగింది ఇంక చోటులేని స్థితి వచ్చింది. మళ్ళీ వలస తప్పదు. మిగిలింది దివితాలూకాకు వెళ్ళడం లేదా, పడమటివైపుకు పయనించడం, ఇందులో దగ్గర వున్నది దివితాలూకా. కాని జనులు అటువైపు సాగలేదు పడమటివైపు నడిచారు. కారణం అప్పుడప్పుడే దివితాలూకా జనావాసయోగ్యమవుతోంది. లేదా జనావాసయోగ్యం చేయబడుతోంది ఈ వివరాలు జయపసేనాని వేయించిన శాసనంలో దొరుకుతాయి తాను కట్టించిన గణపేశ్వరాలయం (దివితాలూకా గణపేశ్వరం) పోషణకు ఆ ప్రాంతపు భూమినిగాక, వలసాయాన్ని ఇవ్వడానికి అనువైంది కాకపోవడంవల్ల) గుడివాడ తాలూకాలోని ఎలమర్రు మొదలైన గ్రామాలను ఇవ్వాల్సిన స్థితి వచ్చింది. అంతేగాక తమిళనాడు నుండి (తంజావూరు నుండి) దివితాలూకాకు జనుల వలస ప్రారంభమైంది. ఏతత్ప్రాంతం ఆక్రమింపబడుతోంది. ఇతరులు వచ్చే అవకాశం లేదు కనుక విధిగా గుడివాడ తాలూకా నుండి పడమటివైపుకు నడిచారు. వ్యవసాయంపై ఆధారపడ్డ కుటుంబాల వారి ఇంటిపేర్లను పరిశీలిస్తే దివితాలూకాను, గుడివాడ తాలూకాకు ఏమి పోలిక అంటే ఆ ఇంటి పేర్లలో కన్పించదు కాని, గుడివాడ తాలూకాలో కన్పించే ఇంటి పేర్లు నూజివీడు, తిరువూరు, మైలవరం తాలూకాల్లో కన్పిస్తాయి దీనివలన జనులు తూర్పునుండి పడమటికి వలస వచ్చారని బోధపడుతుంది. ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. కృష్ణా పడమటి ప్రాంతంలో పూడి, పర్రు, కుర్రు మొదలైన పదాలు గల గ్రామాలు కన్పించకపోవడానికి కారణ మేమిటనేది ఆ ప్రశ్న. గుడివాడ తాలూకాలోని అక్కడి జలప్రవాహాలు జనజీవనాన్ని ప్రభావితం చేశాయి గనుక ఆ పేర్లు వచ్చాయి. ఇక్కడ ప్రవాహాలున్నా, జనజీవనంపై వాటి ప్రభావంలేదు అవి భూమ్యోపరితలానికి చాల దిగువగా ప్రవహిస్తున్నాయి. అంతేకాదు. తూర్పుకృష్ణాలో వ్యక్తుల పేర్లమీదుగా వచ్చిన గ్రామాలు చాల తక్కువ. ఉన్నవాటి చారిత్రకతను పట్టిచూపవచ్చు. అవి ఇటీవలి కాలంలో ఏర్పడ్డాయి. కాని పడమటి కృష్ణాలో వ్యక్తుల పేర్లమీదుగా కులాల పేర్లమీదుగా వచ్చిన గ్రామాలు అధికం. దానికి కారణం మొదటగా వచ్చిన కుంటుబాల, వ్యక్తుల, వృత్తుల అస్తిత్వాన్ని తరువాత వచ్చినవారు విధిగా గుర్తించి తీరవలసిన అవసరం వుండి. ప్రకృతి ప్రాధాన్యం వహించేచోట, వ్యక్తులకు, వారి వృత్తులకు కాక కులాలకు ప్రాధాన్యం లేదు. అందువలన తూర్పు కృష్ణాలో అలాంటివి చాల తక్కువ. ఇక, పడమటి కృష్ణాలో గూడెం, పేట అనేవి అధికంగా కన్పిస్తాయి. గూడెం అనేది అటవీ భూభాగంలో వచ్చే పేరు. అరకు ప్రాంతంనుండి ఖమ్మంజిల్లా వరకు గల భూభాగంలో ఇవి కన్పిస్తాయి. పేట అనేది కొన్ని జనావాసాల మధ్య, వ్యయసాయ ఉత్పత్తులమార్పిడికి ఏర్పాటు చేసికొన్నచోటు తూర్పుకృష్ణాకు, పడమటికృష్ణాకు ఊళ్ళ పేర్లలోగల అంతరం పై వివరణవలన తేలికగా బోధపడుతుంది. తూర్పుకృష్ణాలో ఎక్కడా గూడెం, పేట అనేవి కన్పించవు. అయితే ఇదంతా భూమిపై మనవూరు అవతరించిననాడుగాక, వరి పండించిననాటినుండి వచ్చిన మార్పులుగా గమనించాలి. అంతకు పూర్వకాలాల్లో జనులు పడమటి నుండి తూర్పుకు కదిలారు. అది వేరే సంగతి. ఆ చర్చకు ఇక్కడ తావులేదు.

ఏమైనా, ఒక ప్రాంతపు స్థితిగతులు, ఆ ప్రాంతపు గ్రామాలకు పేర్లివ్వడంలో, ప్రముఖపాత్ర వహించాయనేది ఫలితాంశం. ఒక నియతి, క్రమం ఏర్పడే దిశగా మానవ మస్తిష్కాన్ని ప్రేరేపించడంలో లేదా మానవులు ప్రతిస్పందింపచేయడంలో భౌతిక పరిస్థితులు తగినంత ప్రభావాన్ని చూపుతాయనేది ముఖ్యంగా గ్రామనామీకరణంలో ఇది స్పష్టపడుతుందనేది సిద్ధాంతం.

# "జ్ఞానమూర్తి యని సంభావింతు రామానుజన్"

## డా॥ విశ్వనాథ అరుణాచలం

గణితార్థం బుదయించి సద్గణిత సాక్షాత్కార దీక్షాతపో
ధనుడై, భ్రాజిత దేవదత్త నవమేధా వైభవోపేత స
ద్గుణుడై, భారత భారతి గణిత విద్యుద్దీప్తి శౌండీరుడై
ప్రణుతిన్ గాంచిన జ్ఞానమూర్తి యని సంభావింతు రామానుజున్.

ఆదిశంకరు వలె, నల వివేకానందు
మల్లె, నాంగ్ల కవులు షెల్లి, కీట్సు-
గణితమూర్తులైన గ్యాలువా*, ఏబెలుల్**
భాతి-శ్రీనివాసు ఖ్యాతి వెలుగు.

జగదాశ్చర్య కరత్వదీయ పటు ధీచాతుర్య లీలా విలా
స గణేయ క్రియలెన్నియో కలవు-విస్తారించి చెప్పంగ పె
ద్దగ యత్నించె జగమ్ము; సద్గణిత కాంతారమ్ములన్ దిర్గు మ
త్తగజ వ్రాతములే శ్రమించినవి తత్తాత్పర్యమూహింపగన్-

గణిత పండితుల్ మెచ్చిన గణితవేత్త-
"సంఖ్యల మనస్సు చవిగొన్న సంగడీడు"
నామగిరి తల్లి వరమున నోముకొన్న
దివ్యశేముషీ భరితుడు-దిట్ట యతడె
శ్రీనివాసరామానుజన్ - "చిన్న స్వామి"••

సున్నలో నిర్గుణ బ్రహ్మమున్నది గద-
సర్వ కల్యాణ గుణనిధి చక్రి కలడ
నంతమునను, నీ గణిత వేదాంత పథము
చేర్చదా, ద్వైత సన్నిధి శ్రీనివాస?

మల మల మాడుచుండినను, మాసిచిరుంగులు వడ్డ ప్రాంత గు
డ్డలె శరణమ్ములైనను, కడల్గొనుశేముషి కెట్టిలోపమున్
కలుగదు-శాస్త్రచింతనకె, కాలమునంతయు ధారవోసి తు
జ్జ్వల గణిత క్రియల్ వెలసె-జన్మ తరించెను జ్ఞానసాగరా!

సంగీతమ్మున, సాహితీ జగమునన్, సొంపుల్ విరాజిల్లగా
రంగుల్ పొంగులువారు చిత్రరచనన్, ప్రాగల్భ్య సంసిద్ధితో
అంగాంగంబుల చాలసద్యుతుల హృద్యంబైన నృత్తాలలో
నంగాన్పించు మహాద్భుతంబైన ప్రజ్ఞాదుల్, సుసంపన్న మి
ఛ్ఛంగిన్ "సైన్సుల"లోన కల్గుటరుదప్పా! శ్రీనివాసాహ్వయా!

---

*గ్యాలువా(1811-32)ఫ్రాన్సుదేశపుగణితశాస్త్రవేత్త **ఏబెల్(1802-29)నార్వేదేశపుగణితశాస్త్రవేత్త ••శ్రీనివాసరామానుజున్ముద్దుపేరు

బడి తరగతులు చదువు న
ప్పుడె ప్రకటితమయె, త్వదీయ బుద్ధి బల; మ్హా
ఢ్యుడవై గణితమ్మున, పూ
జ్యుడవై తివయా! సఖుకులకు, జోహారులివే!

ఎందరో మహనీయుల డెందములను
చూరగొన్న ఉత్తముడు — విశుద్ధ వర్త
నుడు, వినయ భూషణుడు — జగన్నుతి బడసిన
మాన్యగణిత నిర్మాత, రామానుజుండు—

"తూర్పుసీమల నుండు అద్భుతము గాదు—
మూర్ఖజనిత భావావేశము, నపురూప
మానసిక శక్తి జృంభణమౌన? కాదు—
నిండు ఇంగితముగల మనీషి — యతడు
సహజ ధిషణా సముద్భూత సత్యగణిత
సూత్రశిల్ప నిర్మాత రామానుజుండ"ని* — నిను
గూర్చి గణిత కోవిదులు వ్రాకుచ్చినారు—
తలచునప్పుడు పులకలు దాల్చు మేను—

మరణశయ్యపై పరుండి, మహిత రీతి
"హంసగీతి" నాలాపించినట్టి ఖ్యాతి
గణితశాస్త్ర చరిత్రలో కలుదు నీకె—
శ్రీనివాసరామానుజా! జ్ఞానతేజ!

అదిగో! నీదు జీవిత చరమాంక మద్ది—
గణితకాంతిని దిగమ్రింగ గడగినట్టి
కాలభీకర క్రూరరోగమ్ము వలన
బడలిన ఒడలు కృశియింప, బాధ ప్రబల—
"గణితచింతన" బాధాహరణ గుళికగ
స్వీకరించి, శీఘ్రగతిని చేసినట్టి
గణిత సామగ్రి — "జీవితకాల మెల్ల
ఒక మహా పండితుడొనర్చు ఉత్తమ కృషి
కి సమ**"మిది విజ్ఞుల ఉవాచ - కేలుమోడ్చి
సన్నుతింతు రామానుజా! సతము నిన్ను-

---

* జి. హెచ్. హార్డీ అభిప్రాయము.  ** రిచర్డ్ ఆస్కీ ఉవాచ.

జ్ఞానమూర్తి యని సంభావింతు రామానుజున్

కల్పనజేసి గాథలను, కావ్యములన్ రచియించు వారికిన్
తెల్పిన నీదు జీవితము తీరు, భవత్కృత సూత్రముల్, మహా
శిల్పనిధాన రమ్యములు, శ్రేష్ఠములైన "వహో, అభూతమౌ
కల్పనల"ంచు నమ్మరు జగమ్మున - అబ్బురమయ్యెడిన్ గదా!

గణిత విశ్లేషణాకృతి, ఘనయశస్వి
"ఆయిలర్"* - మహాగణిత తపస్వి
న్యాసనమ్రాట్ "జకోబి"** - ప్రఖ్యాతులు భువి-
శాస్త్రకౌశలమున నీకు, జాకొబీకి
ఆయిలర్‌కు నడుమ పెద్ద ఆసనమ్ము
ఏర్పరచినారు పండితు-లెంత గౌర
వాస్పద మది - రామానుజా! అభినుతింతు.

---

* ఆయిలర్ : ( 1707-83 ) ఎనాలిసిస్ ఇన్ కార్నేట్, స్విట్జర్లాండ్ గణిత శాస్త్రవేత్త
** యాకోబీ ( 1804-51 ) ది గ్రేట్ ఆల్గోరిస్ట్, జర్మనీ గణిత శాస్త్రవేత్త

# చైతన్య నర్తనం

శ్రీమతి పి. ఆదిలక్ష్మి

ఈ సకల చరాచర సృష్టిలో
అణువణువున శోభిస్తోంది ఒక మనోజ్ఞ సౌందర్యస్ఫూర్తి
మానవతకు పరిపూర్ణతను ప్రసాదిస్తోంది
ఒక మహాశక్తి తత్వం
అదే చంద్రార్థ చూడుని చైతన్య నర్తనం
అదే ప్రకృతి పురుషుల పరమాద్భుత
నాట్య నిర్వహణా మాధుర్యం
ఆ పవిత్రపాద మంజీర రవళిలో
పొంగి పొర్లింది అమృతత్వ మహాసాగర కెరటం
ఆ తాండవ ఝల్లరిలో
ప్రవహించింది జ్ఞాన ప్రకాశ ధారానదం
ఆ నదీసాగర విలాస సంయోగంలో
రూపొందింది జన్మపరంపరా రసమయ జగత్తు
ఆ మంగళ ఘోషాతరంగ ధ్యానంలో
అనంతమై వెలసిన ఆత్మతత్వ బోధనావృక్షం కుసుమించిన
సత్యధర్మ పూజా పుష్పం
పరిణమించింది ఆనందఫలమై.

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

# ఆంధ్రుల గ్రంథాలయోద్యమ తత్త్వం సిద్ధాంత విశ్లేషణ

## గ్రంథాలయ వేదం

"వాయువెల్ల వారికి నెట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలయును.
ఉదక మెల్లవారికి నెట్లు సేవ్యమైయున్నదో
జ్ఞానమును నట్లు సేవ్యమైయుండవలయును
సూర్యచంద్ర మండలముల తేజస్సు
ఎల్లవారికి నెట్లు సౌఖ్యప్రదముగనున్నదో
జ్ఞానమును నట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును"[1]

అని తొలిసారిగా కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారు బెజవాడ (విజయవాడ) రామమోహన గ్రంధాలయ ఆధ్వర్యంలో 1914 ఏప్రిల్ 10వ తేదీన జరిగిన ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగార మహాసభ అధ్యక్షోపన్యాసంలో ఆశువుగా చెప్పిన ఉత్తేజకర ప్రవచనాలివి.

చిలకమర్తి ప్రవచనాన్ని దృష్టిలోఉంచుకొనే ప్రముఖ గ్రంథాలయ కార్యకర్త మల్లెల శ్రీరామమూర్తిగారు మరో గ్రంధాలయ వేదాన్ని అందించారు. (1937)

'గ్రంధాలయములు అజ్ఞానమును పారద్రోలి-
సుజ్ఞానోదయమును కలుగ జేయును.
దేశస్వాతంత్ర్యమునకు గ్రంధాలయములు పునాది-
విద్యావిహీనులగు ప్రజలు స్వాతంత్ర్యమును పొందనర్హులుకారు
స్వాతంత్ర్య వీరులచరిత్రలు చదువనిదే స్వాతంత్ర్యేచ్ఛకలుగదు
భారతదేశమున గల ప్రతిపల్లె గ్రామములో గ్రంధాలయము
లేర్పడ వలెను."-

అయితేచిలకమర్తివారి పలుకులలోనిసారళ్యం, విశాలదృక్పథం చేత తొలి మహాసభ రోజున ఏర్పడిన ఆంధ్రదేశ గ్రంధ భాండాగార సంఘం (1918 నుండి ఆంధ్రగ్రంధాలయ సంఘం, 1956 నుంచి ఆంధ్రప్రదేశ్ గ్రంధాలయ సంఘం) తాలూకు కార్యకర్తలు-"వేదము" ఆర్షసాంప్రదాయాను సారులకే గాక ప్రపంచమునంతను మార్గదర్శకమైన ప్రమాణగ్రంథము. అట్టి వేదోక్తులతో సమానమైన- గ్రంధాలయోద్యమమునకు ఆదర్శప్రాయమైన చిలకమర్తి వారి సూక్తులను [2]"గ్రంథాలయవేదం" పేర అప్పట్నుంచీ ప్రచారం చేస్తున్నారు. ఈ వేద ప్రవచనం లేందే తెలుగు దేశంలో ఏ గ్రంథాలయం ప్రారంభం కాలేదు. ఏ మహాసభ జరగలేదు. ఏ సదస్సు నిర్వహించలేదు. అంతటి శక్తిని, పలుకుబడిని ఈవేదం సంతరించుకుంది. ఆనాటి నుంచి ఈ నాటివరకు (1914-1986) ఇంత ఉదాత్తమూ, ఉత్తేజకరమూ, కాలోచితమూ, అవసరమూ, ఆలోచనాత్మకమూ ఐన రీతిలో గ్రంధాలయ ప్రయోజనం గురించి చెప్పినవారు ప్రపంచ గ్రంధాలయ చరిత్రలో లేరనవచ్చు. ఈ వేదప్రవచనాలు చిలకమర్తివారి నోటి నుంచి ఆశువుగా రావడానికి వెనుక వారిని కదిపిన ఆనాటి పరిస్థితులు, ఆవేశం కలిగించిన సంఘటనలు లేక పోలేదు.

17, 18 శతాబ్దాల కాలంతో భారతీయులు అంధ యుగంలో ప్రవేశించారు. సాంఘింక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు క్షీణదశకు వచ్చాయి. "పాత సమాజం, పాలనావ్యవస్థ, చిన్నాభిన్నమయ్యాయి. ఒక ప్రాచీన సాంఘిక వ్యవస్థ బీటలిచ్చింది. దానిని కట్టుదిట్టం చేసే వారు లేకపోయారు. నిర్జీవమైన సంప్రదాయాలూ, నేలలో కూరుకుపోయి శిలారూపం దాల్చిన ఆచారాలు, అర్థం పర్థం[3] లేని ఆనవాయితీలు జాతి జీవన స్రవంతిని ఇంకిపోయేట్టు చేసింది. ఈ పరిస్థితి చక్కదిద్దుకోడానికి ప్రజల సామూహిక శక్తిని సమీకరించి సంఘపరమైన వ్యవస్థాపరమైన మార్పుకోసం ఒక ఉద్యమాన్ని లేదా పోరాటాన్ని దీర్ఘకాలం నడపాల్సిన అవుసరం ఏర్పడింది. అందుకు ఒక మెరుపులాంటి ఆలోచన, ఉత్తేజం కలిగించే స్ఫూర్తినిచ్చే ప్రేరిత శక్తి అవసరమైంది. ఆ అవసరానికి చిలకమర్తివారి గ్రందాలయ వేదనినాదం కొంతవరకు దోహదం చేసింది. "1914లో మొట్టమొదటి సారిగా దీనిని ప్రకటించినప్పుడు ఈ నినాదం ఇంచుమించు పెద్ద సంచలనాన్నే కలిగించింది. అప్పట్లో సమాజ సంప్రదాయాలకు బందీగా ఉండేది. మూఢనమ్మకాలు స్వైర విహారం చేస్తుండేవి. అక్షరాస్యులు అతి తక్కువ. పాఠశాల విద్య మూడో తరగతి వరకు

లభించేది. స్త్రీలు ఘోషాలలో ఉండేవారు. స్త్రీవిద్యను సంఘం ఒప్పేది కాదు. ఉన్నత కులాలనబడే వారిలోగూడా చదువుకునేవారు బహు తక్కువ. అందులో స్త్రీలు మరీ తక్కువ. సాంప్రదాయ విద్యా విధానం పూర్తిగా దెబ్బతినిపోయింది. కొత్తవిధానం ఇంకా కనుచూపు మేరలో కానరావడంలేదు. అటువంటి పరిస్థితుల్లో ప్రజల్లో జ్ఞానరోచిస్సులను వెదజల్లాలంటే గ్రంథాలయోద్యమ నినాదాన్నిచ్చి ఆ లక్ష్యం కోసం పరిశ్రమించాలంటే ఎంతో ముందుచూపుండాలి. ధైర్యంకావాలి గట్టి పట్టుదల ఉండాలి. జీవితాంతం దానికి అంకితమై నిర్విరామంగా కృషిచేయగల సత్తాఉండాలి. ఇన్నిటికీ సిద్ధపడి జనం ముందుకొచ్చారు."[4]

ముఖ్యంగా యువకులు నడుంకట్టారు. గ్రంథాలయ స్థాపన. నిర్వహణను ఒక ఉద్యమంగా ప్రారంభించారు. అది చిలువలు, పలువలుగా విస్తరించి ఒక మహోద్యమంగా వ్యాప్తిచెందింది. తెలుగు జాతిని ప్రభావితం చేసింది. నవోత్తేజంతో, నవచైతన్యంతో, నవభావనతోమోసులెత్తించింది

## ఉద్యమ స్వరూప స్వభావాలు

ఆంధ్రదేశంలో వెలసిన గ్రంథాలయోద్యమానికి ఒక విశిష్టత ఉంది. ఈ ఉద్యమం మన దేశంలో వెలసిన ఏ ఉద్యమానికి అనుకరణ కాదు. ఏ దేశాన్నుంచీ భావాలూ, నిర్వహణా యుక్తులూ అరువు తెచ్చుకోలేదు. అయితే "ప్రపంచమందు ప్రసిద్ధిగాంచిన గ్రంథాలయోద్యమము లన్నిటినీ జీర్ణించుకుని వానియందలి మంచి విషయము లన్నిటినీచేర్చి, మనదేశపరిస్థితులకు, సంప్రదాయములకు ఆచారములకు తగునట్లు "ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ముద్భవిల్లినది"[5] అంటారు గ్రంథాలయోద్యమ సిద్ధాంత కర్తలైన సూరి వెంకట నరసింహశాస్త్రిగారు (1880-1933)

ఈ విషయాన్ని మరికాస్త విస్తరించి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘస్థాపకులు, గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకట రమణయ్య(1890-1979)గారు ఆంగ్లేయ భాషాసంపర్కము- ఆంగ్లేయ సంప్రదాయ సంసర్గము ఏ మాత్రమును లేని వ్యగ్రోత్సాహులగు యువకులవలననే ఈ యుద్యమము ఆంధ్రదేశమున జన్మించి వ్యాపించినది. అందువలన ఈ యుద్యమము "స్వయంభువు" అని చెప్ప సాహసించుచున్నాను స్వయంభువు అనగా ఇతరులచేత ప్రారంభించబడినదికాదు తనకుతానే ఆవిర్భవించినది"[6] అన్నారు

భారతీయులకు, తెలుగువారికీ "స్వయం తీర్ణః పరాం స్తారయతి" అనేసూక్తి.

"ఈ యుద్యమమునకు ప్రేరణము- తాముబాగై తమతోడివారలను బాగుచేయవలెనను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛయే. ఈ యుద్యమ ప్రచారకులు కోరుఫలము తమకును తమతోటివారికిని గలుగు జ్ఞానాభివృద్ధి వలన పొందెడు ఆనందమే. ఈ యుద్యమమును పురికొల్పు మహాశక్తి-ప్రపంచాభివృద్ధి కొరకు అప్పుడప్పుడు ఆవిర్భవించు మహోద్యమములను పొడుకొల్పి వానికి జవసత్త్వములను గల్పించు ఈశ్వర-ప్రేరితశక్తియే. ఈ యుద్యమ ప్రచారకులు తాము ఈశ్వర ప్రేరితులనియు ఈశ్వరోద్దిష్ట కార్యములను తాము నెరవేర్చుచున్నామనియు దృఢతర భక్తి పూరితులై యున్నారు.

ఈ యుద్యమము ఇతర ఉద్యమములవలె మూడునాళ్ళ ముచ్చటతో బోవునదికాదు. ఇది నాయకుల యధీనమందున్న యుద్యమమును గాదు. గ్రంథాలయములు తాత్కాలికముగ ప్రారంభింపబడి స్వల్పకాలము నిర్వహింపబడి మూయబడునవిగావు. వానియందు సంవత్సరము పొడుగునను పనిజరుగుచునే యుండును. నవోత్సాహపూరితులైన యువకులే ఈ యుద్యమమునకు మూలకారకులైన యున్నారు"[7]

కనుక యువకులు ఈ యుద్యమానికి అండగాఉన్నంతకాలం జలజలపారే సెలయేరులా ఈ ఉద్యమం సాగుతుంది.

ఇతర దేశాల్లో వెలసిన గ్రంథాలయోద్యమాలకు తెలుగుదేశపు నడిబొడ్డున ప్రారంభమైన తెలుగునేల నలుచెరగులా ముమ్మరంగా వ్యాపించిన గ్రంథాలయోద్యమానికి ఒక పెద్ద వ్యత్యాసం ఉంది. "ఇతరదేశ గ్రంథాలయములన్నియు మనుజుని మేధాశక్తిని వృద్ధిపొందించుటకే ప్రయత్నము లొనర్చుచుండ, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమున మనుజుని సంపూర్ణ మనుష్యత్వము వ్యక్తీకరించుటకు తగిన సాధనావలంబన యంతయు చేరియున్నది. కావుననే మన ఉద్యమముయొక్క ప్రాప్యము మనుజుని జీవితము పవిత్రముగను, పురుషార్థ సాధకముగను చేయుటయై యున్నది. ఈ ప్రాప్యసాధనకు మన సాంప్రదాయాన్ని బట్టి అలవాట్లను బట్టి పరిస్థితులను అనుసరించీ ఉద్యమాన్ని రూపొందించుకోవలసి ఉన్నది."[8]

ఈ సిద్ధాంతాన్ని అనుసరించి-

"గ్రంథాలయోద్యమమనగా, కొన్ని గ్రంథములు, పత్రికలను ఒక చోటచేర్చి అవి అందరికిని అందుబాటులోనికి దెచ్చుట మాత్రమే గ్రంథాలయోద్యమ పరమావధిగాదు. అది గ్రంథాలయములకెల్ల ప్రాతిపదిక మాత్రమే. గ్రంథాలయము ఒక గ్రామమందుగాని-పట్టణమందుగాని సాంఘిక సంక్షేమ కార్యకలాపములకెల్ల కేంద్ర స్థానమై. విలసిల్లవలసినది మానవత్వ సర్వసమానత్వ సాధనకు అది సరస్వతీ దేవి ఆలయమే"

అందుచేత బాలభటోద్యమము, ప్రకృతి ఉద్యమము దివ్యజ్ఞానోద్యమము, సహకారోద్యమము, హరిజనోద్యమము, ఆంధ్రోద్యమము-ఆదిగాగల సేవోద్యమములనెల్ల గ్రంథాలయము యొక్క నిత్యనైమిత్తిక ప్రణాళికలకు సాధన మార్గములుగ జేపట్ట"[9] వలసిఉంది. ఆ విధంగా గ్రంథాలయోద్యమం తెలుగుదేశంలో కాలూనింది.

ప్రారంభ దశనుండి ఆంధ్ర గ్రంథాలయోద్యమం గ్రామీణ గ్రంథాలయాలకు అంకితమైనదని చెప్పటం అతిశయోక్తికాదు. దేశ పురోగతికి పల్లెప్రజల విజ్ఞానం, వికాసం, చైతన్యం ముఖ్యమన్న భావాన్ని ఉద్యమ నాయకులు గ్రహించారు గ్రంథాలయోద్యమాన్ని గ్రామాలలో విరివిగా ప్రచారం చేసారు. వేలకొలది గ్రంథాలయాలను గ్రామాలలో స్థాపించి, నడుపుటకు తగిన ఉత్సాహాన్ని, సహకారాన్ని కల్పించారు. సాంఘిక దురాచారాలు, మూఢవిశ్వాసాలు,

**Statement about Ownership and other Particulars about Newspaper.**

# BHARATI

Form IV [See Rule - 8]

1. Place of Publication : VIJAYAWADA.
2. Periodicity of Publication MONTHLY.
3. Printer's Name S Radhakrishna.
   Whether citizen of India Yes
   Address : 14-14 21, Mallikarjuna Rao Street, Vijayawada 3.
4. Publisher's Name · Sri S Radhakrishna
   Whether Citizen of India Yes
   Address . 14-14-21, Mallikarjuna Rao street, Vijayawada-3.
5. Editor's Name . S Radhakrishna
   Whether citizen of India Yes
   Address . 14-14-21, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3.
6. Name and addresses of Individuals who own the News paper and partners or share holders holding more than one percent of the total capital
   [1] Name · S Kamakshmma, 1 Luz Avenue Mylapur. Madras 600004 [2] S Radhakrishna Address 14-14 21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada - 3. [3] Name S. Nageswara Rao, Address 1 Luz Avenue, Mylapur, Madras-600004 [4] Name S Rajeswari Address . 14 - 14 . 21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada - 3 [5] Name : S. Seshamma, Address 1 Luz Avenue, Mylapur, Madras - 600 004· [6] Name G V Subba Rao, Trustee Amrutha Dharma Nidhi, Address 42-45 Luz Church Road, Madras-600004 [7] Name : S Ramayamma, Address 1 Luz Avenue, Mylapur Madras-600004 [8] Name . P. Satyanarayana Address . Plot No. 28. Bhagyalakshmi Nagar, [Behind Kalpana Talkies], Hyderabad-500380. [9] M/s Sambnu Prasad & Sons P Ltd. 63, Raya-pettah High Road, Madras-4 [10] Mr S Kini, 1-9-1122/3/1' Dayananda Nagar, Hyderabad-4. [11] Sri Venkata Rao Kordale, 1-1-593/2, Gandhi-nagar, Hyderabad-38. [12] Sri V Sundaram No. 20 First Main Road, Thiruvanmiyur, Madras-14 [13] Sri R Gopalakrishnan, 79 Venkateswara-nagar, Kottivakkam, Madras - 41 [14] Sri S Sreeramamurthy, 63 Rayapettah High Road, Madras-4 [15] Master S V-S. Arvind, 1 Luz Avenue, Madras-4 [16] Sri M S. Ramesh, 16-11-19/5/2/A, Saleemnagar Colony, Malakpet, Hyderabad-36 [17] Smt. P. Nageswaramma, 1, Luz Avenue, Madras-4.

I, S. Radhakrishna hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

1-3-1988

**S. RADHAKRISHNA,**
Signature of Publisher.

నిరక్షరాస్యత, పేదరికం, నిర్లిప్తత స్వైర విహారం చేసే గ్రామసీమలలో విజ్ఞాన కేంద్రాలనేర్పరచి నిర్వహించారు."[11] దీన్నొక చారిత్రక ఉద్యమంగా తీర్చిదిద్దారు.

తెలంగాణా ప్రాంతంలో ఈ ఉద్యమం మరోతీరుగా నడిచింది. తెలుగువారి ఆత్మగౌరవాన్ని పరిక్షించుకోడానికి, తెలుగు భాషను నిలుపుకోడానికి, తెలుగుసంస్కృతిని దక్కించుకోడానికి ఈఉద్యమం కొండంత అండగా నిలబడింది.

"తెలంగాణాలో ఏ ఉద్యమం నడవకుండా ప్రభుత్వం అనేక అడ్డంకులు కల్పించేది. ఏ ఉద్యమం పెట్టుకోవాలన్నా ఆ ఉద్యమానికి ప్రభుత్వం అభ్యంతరం పెట్టేవారు. గ్రంథాలయోద్యమం, విద్యా ఉద్యమం కాబట్టి "ఇది విద్యా ఉద్యమమయ్యా దీనికెందుకు అభ్యంతర పెడతారు" అని చెప్పుకోడానికి అవకాశం ఉండేది. గ్రంథాలయోద్యమం తప్ప ఏ ఉద్యమంలేని రోజుల్లో ఈ ఉద్యమం అన్ని ఉద్యమాలకు కాణాచిఅయింది. విద్యావిషయాలు కానివ్వండి ప్రజల జీవితాలను ప్రభావితం చేసే అంశాలుగురించి మాట్లాడుకునే వాళ్ళం. మాగ్రంథాలయోద్యమానికి ఒక ఒరపిడిరాయి ఉంది. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంత రావుగారిని ఒక విషయం అడిగారట. "అయ్యా మా ఊళ్లో గ్రంథాలయం ఉంది. చూచిరమ్మన్నారు". ఆ ఊరు వెళ్ళాము. అచట ఊరుందిగాని గ్రంథాలయంలేదు. ఆలయమూ లేదన్నారట. అప్పుడు హనుమంతరావుగారు నవ్వుతూ "మా గ్రంథాలయానికి, మా గ్రంథాలయోద్యమానికి గ్రంథాలు అవసరం లేదు. భవనాలు అవసరంలేదు. దేశంకోసం పరితపించే ప్రాణి ఒకడుంటాడు. వాడే గ్రంథాలయం" అన్నారట. ఆవిధంగా గ్రంథాలయోద్యమం ఏపని నిర్వహించినా అది దేశంకోసం పరితపించుప్రాణుల సంఘమని చెప్పాలి. ఆవిధంగా అన్ని ఉద్యమాలకు కేంద్రంగా వర్ధిల్లింది. అందుకనే ఈనాడు తెలంగాణాలోని ప్రజాసేవకులకు గ్రంథాలయోద్యమమంటే పవిత్రమైన భావం ఉంది."[12] ఇదీ తెలంగాణాలో గ్రంథాలయోద్యమ స్వరూపం.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో గ్రంథాలయోద్యమం వేరువేరుగా భిన్న లక్ష్యాలతో నడిచింది. భారత గ్రంథాలయ చరిత్రలో తనదైన ప్రత్యేకతను నిలుపుకుంది.

## రెఫరెన్సులు

1. ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్ర. ఆంధ్రదేశ గ్రంథభాండాగారసభ. 1915
2. వెంకట రమణయ్య అయ్యంకి గ్రంథాలయజ్యోతి, 1967.పు
3. రామలింగడి భారతీయ పునరుజ్జీవనం 1980. పు 3
4. గోపాలకృష్ణయ్య, వావిలాల ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం. 1977. పు. 4.
5. వెంకట నరసింహశాస్త్రి, కూచి గ్రంథాలయోద్యమము-ఆంధ్రుల సిద్ధాంతము. 1918. పు. 5
6. వెంకట రమణయ్య అయ్యంకి గ్రంథాలయజ్యోతి. పు. 52
7. వెంకటనరసింహశాస్త్రి, కూచి. గ్రంథాలయోద్యమము-ఆంధ్రుల సిద్ధాంతము. 1918 పు. 5.
8. వెంకటరమణయ్య, అయ్యంకి గ్రంథాలయజ్యోతి 1967పు277
9. మోహన్‌దత్ న్యూటన్ బరోడా ఎండ్ ఇట్స్ లయిబ్రరీస్.
10. శారద, కాట్రగడ్డ ఆంధ్ర గ్రంథాలయోద్యమం వర్తమాన పరిశీలన. గ్రంథాలయములు. 5 భా. 1981. పు 2-3
11. నారాయణరావు కోదాటి క్యాసెట్ టేపు.

శ్రీ సోమసుందర్

# స్మృతుల్నీ ఆశల్నీ అనుసంధించేది కవిత్వమే

మధ్యయుగాల రాచరికవాద ప్రభావంలో మత ప్రసక్తిలేని కళలూ సారస్వతమూ వెలువడనేలేదు. ఆధునిక యుగంలో మత బంధాలను రాజకీయాలు త్రోసిరాజన్నాయి. రాజకీయాల ప్రసక్తీ దృష్టీ లేకుండా ఆధునిక సమాజ వాస్తవికతను మనుగడే దుర్లభమై పోయింది. ఈ యదార్థాన్ని తిరస్కరించేవారు జీవన సత్యాలను పరిశీలిస్తున్న వారు కాదు.

ఆధునిక కవిత్వం షష్టిపూర్తి జరుపుకుంది. ఐనా సంప్రదాయవాదులు నేటికీ వివాదాలు లేవనెత్తుతూనే వున్నారు. ప్రపంచలో ఏ దేశంలో కవిత్వం గురించి మీమాంస జరిగినా, దానిస్వరూపం గురించీ రీతిగురించీ, శైలిగురించీ విపరీత ప్రాముఖ్య మివ్వబడటమేలేదు. దాని అంతస్తత్వం గురించే విపులమైన చర్చజరుగుతోంది. స్వభావ పదార్థాల గురించి మాత్రమే వ్యాఖ్యానాత్మక పరిశీలన పెంపొందుతోంది.

మనదేశంలో ఇలాంటి దురదృష్టం ప్రబలడానికి బొత్తిగా కారణం లేకపోలేదు. మన దేశీయ సాంఘిక వ్యవస్థ యిప్పటికీ ఫ్యూడల్ బంధాలనుంచి పూర్తిగా విముక్తం కాలేదు. నేటి రాజకీయ ఆర్థికాది సర్వరంగాలలోనూ పెట్టుబడిదారీ విధానం గడాబరించుకొంటున్నప్పటికీ- సామాజిక అంతస్సంబంధాలలో భూస్వామ్య వ్యవస్థావశేషాలు తమ ఉనికిపట్లను పూర్తిగా వదులుకోలేదు. అందుకే పెట్టుబడిదారీ విధానం భూస్వామ్యావశేషాలతో రాజీపడుతూ లంకెపెట్టుకుని బ్రతుకుతోంది.

ఈ సంధిగ్ధావస్థ కలిగించే భావ ప్రతిబింబంగానే కవిత్వరీతి, స్వరూపాదులకు అతికాల ప్రాధాన్య మివ్వబడుతోంది. ఈ సంధిగ్ధత వల్లనే మన మేధావులలో సైతం ఆధునిక కవిత్వం గురించి స్థూలంగా నైనా ఏకాభిప్రాయం కలగడంలేదు. సంప్రదాయవాదుల గతానురక్తినీ సనాతనవాదుల మూఢభక్తినీ అలావుంచుదాం. తమనితాము నూటికి ఎనభైపాళ్ళు ఆధునికులుగా భావిస్తున్న మేధావులలోసైతం ఆధునిక కవిత్వం గురించి ఎన్నో అరలూ, పరిధులూ అరమరికలూ ఏర్పడే వున్నాయి.

ఇలాంటివారు అచ్చమైన కవిత్వాన్ని అమేయ విశేషణాలతో కీర్తిస్తూంటారు. కవిత్వమేదో ఒక జీవనాతీత పదార్థంగా భ్రమపడి భ్రమలు నెలకొల్పుతుంటారు. వ్యవస్థపట్ల తీవ్రాభినివేశంగల కవితలను టెండెన్షియస్ పొయిట్రీగా యీసడిస్తూ ఉంటారు. 'ఇజాల ప్రిజన్‌లో పడిపోయిన కవిత్వం' అంటూ దొంగకన్నీళ్లు కారుస్తూంటారు. ఆధునిక కవిత్వానికి అవధులు నిర్ణయిస్తూంటారు. కవితాచేతనకుగల అపార శక్తిని సంకుచిత పరుస్తుంటారు. కవిత్వానికిగల సామాజిక బాధ్యత పట్ల అవిశ్వసనీయత ప్రకటిస్తూంటారు.

తద్వారా ప్రయోజనా పరమావధి గురించి సంకల్ప సిద్ధులైన ఉత్తమ కవుల ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతీయడమే వీరిధ్యేయం. ఇది వారు బుద్ధిపూర్వకంగా చేస్తున్న క్రమానుగత ప్రయత్నమే ! ఏదోఒక రోజున ఎవరో ఒకవ్యక్తిద్వారా,యాదృచ్ఛికంగా బయట పడుతున్నది. ఇలాంటివారికి ఒక వర్గచైతన్యం లేదనడానికి ఆధారాలు కనిపించవు. వారి ప్రయత్నం ఏ వర్గ ప్రయోజనాలను కాపాడు తున్నదీ మాత్రమేగమనార్హం.

## 2

ఏ కళాఖండమైనా ఒక కాలపరిమితిలో సంభవించిన సృజనాత్మక సంఘటనే, అది చిత్రంకావచ్చు, శిల్పం కావచ్చు, సంగీతప్రద

ర్శన కావచ్చు. నాట్యం కావచ్చు, సాహిత్య కళా ప్రక్రియలకు సంబంధించిన ఏస్వరూపమైనా కావచ్చు. ముఖ్యంగా ఒక కావ్యం ఒక కాలం కలిగించే ఆంతరిక ప్రేరణతో, కాలీన సంఘటనల త్వర మాణంతో కవి ముఖతా వెలువడిన కళాపీఠిక.

కాలానుభవంనుంచి ఏ కవితాహృదయమూ పలాయనం చేయ జాలదు. పైగా ఏదో స్థాయిలో అనుసంధానతనే ప్రదర్శిస్తుంది.

కాలం ఒక అనుస్యూత ప్రవాహ మనుకుంటే దానకేంద్ర బిందువుతో ప్రయాణించేవారే వర్తమానులు, వారికి కాలాంతంతో నిమిత్తంలేదు. కాలారంభమూ స్పృహణీయం కాదు. తమ పంచేంద్రియ జ్ఞాన ప్రత్యయాలద్వారా, అనుభూతుల ద్వారా, కాలాన్ని గ్రహించగలుగుతారు. కాలం కలిగించే వివిధసంఘటనల పరంపరను వారి పంచేంద్రియ జ్ఞానం, వారి మానసిక సంస్కారానికి దోహదం కలిగిస్తుంది.

ఒక మనిషి జీవిస్తున్న కాలమంతా ఒక నిరంతర వర్తమానం వంటిదే! దీనిలోని ఒకపాయ గతం. గతస్మృతి తరంగం రక్తనిష్ఠమై ధ్వనిస్తూ వుంటుంది. నేపథ్య భూమికగా స్ఫురిస్తూంటుంది. భవిష్యత్తు ఒక ఆశాస్వరూపంగా భాసిస్తూంటుంది. ఒక మధుర స్వప్నంగా భావనా పరిధి అంచులను తాకుతూ కదలిపోతూ వుంటుంది. వర్తమానం ప్రతి క్షణమూ భవిష్యత్తులోనికి ఉరకలు పెడుతూనే, తనను తాను గతంలో విలీనం చేసుకుంటూ సాగుతుంది.

అవిధంగా వర్తమాన జీవులు ప్రస్తుతమందించే పాదార్థిక అనుభవాన్ని విస్తరింప చేసుకుంటారు. ఇటు గతంలో కలిగే అనుభవ తరంగాన్ని స్మృతులుగా నిక్షిప్తం చేసుకుంటారు. అటు భవిష్యత్తు వైపుగా ఉరకలు తీసే ఆశల్ని స్వాప్నిక తరంగాలుగా చలింప చేసుకుంటూంటారు. ఐతేవీటిని భౌతికంగా అదుపుచేయలేని నిస్సహాయులూ అవుతూంటారు. ఆ నిస్సహాయ స్థితినుంచి మానవ హృదయాన్ని రక్షించడానికే మనోపరికరం కవిత్వాన్ని సమాయత్తపరచింది.

గతమూ కొంతవరకూ భవిష్యత్తూవర్తమానంలోనే సహజీవనం చేస్తుంటాయి. ఆ సహజీవనాన్ని సంస్కృతీ రసస్వరూపంగా ఉద్దీప్తం చేసేది కవిత్వమే.

## 3

కవిత్వమనేది గతాగతాలతో నిమిత్తం లేని బ్రహ్మపదార్థం వంటిదని, దానికి కాలగుణాది విశేషణాలు తగిలించడం వ్యర్థమనీ కొందరు వాదిస్తూ వుంటారు. ఇలాంటి అతి మానుష విచిత్రవాదాలు ప్రచలితం చేసేవారు కుహనామేధావులే ! కవిత్వమంతా ఏకరాశి పదార్థం ఎన్నటికీ కాబోదు. కవిత్వంలో ప్రాచీనత్వమూ ఆధునికత్వమూ సంప్రదాయ ప్రభావమూ అభ్యుదయ చైతన్యమూ వంటి లక్షణాలన్నీ విస్పష్టంగా ద్యోతకమవుతున్నవే !

కవిత్వాన్ని వింగడించడం సంకుచితమని వాదించేవారి వాదం స్థూలదృష్టికి ఉదారంగానే కనిపిస్తుంది. ఎంతో న్యాయసమ్మతమైనదిగానూ భ్రమ కొలుపుతుంది. కాని వారివాదం వెనుక వారాశించిన ఫలితార్థం కాని, ప్రపంచించదలచిన దృక్కోణంగాని అంత ఆరోగ్యప్రదాలుగావు.

ఇలాంటి మేధావు లెంత మొత్తుకున్నా కవిత్వం కేవలద్రవస్థితినో లేదా కేవల వాయుస్థితినో భజించేదికాదు. నిరంజన పదార్థమసలేకాదు. ఆబ్‌స్ట్రాక్ట్ ఫీలింగుస్థాయిలో సార్వకాలిక నిశ్చల స్థితిలో నిలిచేది కాదు. రూపగంధాదులు కలిగిన ఘన పదార్థ స్థితిలో తప్ప మనం కవిత్వాన్ని ఊహించలేం !

కవిత్వం ఒకమానవవ్యక్తి ఉత్పత్తిచేసే పదార్థమే అది గాలి వలెనో నీటివలెనో ప్రాకృతిక శక్తుల ద్వారా ఊడిపడేదికాదు. ఎప్పుడైతే కవిత్వం ఒక ఉత్పాదక పదార్థంగా ద్యోతకమవుతుందో అప్పుడే దానిని ఇతర ఉత్పత్తి సరుకుల స్థాయికి దించి మాట్లాడుకోక తప్పదు. ఇతర వినిమయ పదార్థాలవంటి విలువలూ ఆపాదించక తప్పదు.

శుద్ధ కవిత్వంగురించి పదే పదే కీర్తించే పెద్దలు అసలే శుద్ధ కవిత్వమనేది ఎక్కడుందో వివరించరు. వర్గాలుగా విభక్తమైన ప్రస్తుత సమాజంలో ఏ ఏ రూపాలుగా ప్రవర్తిల్లుతోందో విశదం చేయరు. సర్వసౌఖ్యాలూ అనుభవిస్తున్న వర్గానికి కవిత్వంకూడాభోగ్యవస్తువుగా తనరారాలన్నదే ఈ శుద్ధ కవితావాదుల చరమ లక్ష్యం.

# చారిత్రక నేపథ్యంలో పంచముఖేశ్వర ఆలయం

కృష్ణాజిల్లా నందిగామ మండలములోని 'కాండ్రపాడు' చారిత్రక ప్రాధాన్యం గల 'గుడిమెట్ట' గ్రామానికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉంది. నందిగామ నుండి 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఈ గ్రామాన్ని కోనాయపాలెం శివారుగ చెపుతారు.

మన జాతి జీవన గమనంలో కలసిపోయి, నూతనత్వాన్ని ఆవిష్కరించిన ప్రాచీన సంస్కృతుల ప్రభావానికి ప్రత్యక్ష నిదర్శనం ఈ గ్రామమందు వెలసిన-అపూర్వమైన 'పంచముఖేశ్వర ఆలయం'.

నాలుగున్నర అడుగుల ఎత్తు, మూడున్నర అడుగుల చుట్టు కొలత కలిగిన నల్లని లింగాకారపు అగ్రభాగాన దర్శనమిచ్చే పంచ ముఖాలు చూపరులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ, భక్తులకు ఆనంద నిధానాలై విలసిల్లుతున్నాయి. ఎనభై సంవత్సరాలకు పూర్వం పాటిమన్ను తవ్వుతుంటే ఈ పంచముఖ శివలింగం బయల్పడినట్లు వృద్ధులైన గ్రామస్థులు చెపుతుంటారు. ఊరునిండ పాటిదిబ్బలే. చుట్టుప్రక్కల మూడు నాలుగు గ్రామాలకు చెందినవాళ్ళు పాటిమన్నును ఈ ప్రాంతంనుండే త్రవ్వి కెడుతుంటారు. అటువంటి సమయంలో బంగారునాణాలు, వెండివస్తువులు, దీపపు షమ్మెలు, గింజల పాత్రలు, ఎముకలు, కుండ పెంకులు మొదలైన ప్రాచీన అవశేషాలు లభిస్తున్నట్లు పరిసర గ్రామప్రజలు సైతం అంగీకరిస్తున్న సత్యం.

ఈ అపురూప శివలింగం బయల్పడిన ప్రదేశంలోనే మరికొంత వెడల్పు త్రవ్విచూడగ మరి నాలుగు చిన్న శివలింగాలు ఒక చతురస్రాకారపు రాతి ఫలకము ముగురక్కల శిల్పం, మరికొన్ని చిన్న చిన్న శిల్పాలు లభించాయి. అయితే ప్రధాన లింగానికి మాత్రం పానమట్టం లేదు. చుట్టు లభించిన నాలుగు లింగాలకు పానమట్టం ఉంది. అక్కడే లభించిన చతురస్రాకారపు రాతిఫలకం మీద ఒక ప్రత్యేకమైన చెక్కడం కన్పిస్తోంది - దీన్ని పరిశీలిస్తే ఈ ఐదు శివ లింగాలకు, ఈ ఫలకానికి ఒక ప్రత్యేక సంబంధం కలదేమోనన్న అనుమానం దృఢమవుతుంది. ఎందువలనంటే - ఈ రాతి ఫలకం మీద నాలుగు మూలల నాలుగు, మధ్యలో ఒకటి మొత్తం ఐదు గుంటలు వృత్తాకారంలో చెక్కబడి ఉన్నాయి. వాని నడుమ వచ్చే ఖాళీ ప్రదేశంలో ఎదురెదురుగ రెండు పూర్ణకుంభాలను, అదేవిధంగా మరి రెండు దిక్కులలో ఒకవైపు మీనములజంట, రెండవవైపు శంఖము చెక్కబడియున్నాయి. 'పూర్ణకలశం' అమరావతీ స్తూపం లోని కలశాన్ని పోలి ఉండటం మూడవ చిత్రంలో చూడవచ్చు. ఇది దేవాలయ నిర్మాణంలో - ముఖ్యంగా విగ్రహప్రతిష్ఠ సమయంలో వాడే యంత్రంగ చేయబడిందా అన్న సందేహం కలుగుతోంది. రెండు చేపలజంట, శంఖము, పూర్ణకలశాలు 'శాంతియంత్రం' అని ఈనాడు భవన నిర్మాణాల సమయంలో వాస్తుకారుడు వేసే యంత్రాన్ని గుర్తుకు తెస్తున్నాయి. దీన్ని 'మత్స్య యంత్ర' మంటారు.



చిత్రము—1

పంచముఖేశ్వరుడు (ముందు భాగము)

చుట్టుఉన్న మరి నాలుగులింగాలను సైతం చూడవచ్చు.



చిత్రము–2
పంచముఖేశ్వరుని వెనుక భాగం.
శిరస్సులను స్పష్టముగా దర్శించవచ్చు.

ప్రధాన లింగానికి పానవట్టము లేకపోడంతో గ్రామస్థులు ప్రాంతీయంగా దొరికే ఒక రాయిని పానవట్టంగా చెక్కించి, లింగాన్ని దానిలో దిగేసి, దానిచుట్టు మిగిలిన నాలుగు లింగాలను ప్రతిష్ఠించి, పూజాపునస్కారాలు జరిపిస్తున్నారు. ప్రధానలింగం నల్లని శిలతో ప్రత్యేకితను సంతరించుకొంటే మిగిలిన నాలుగు లింగాలు ఈ ప్రదేశంలో దొరికే ఎర్రరాయితో చేయబడినట్లు మనం గమనించవచ్చు. షట్కోణాకృతిలో నిర్మించబడిన దేవాలయంలో ఈ స్వామిని ప్రతిష్ఠించి, ప్రతి శివరాత్రికి కళ్యాణము జరిపిస్తున్నారు గ్రామస్థులు. మనం యంత్రంగా భావించిన ఫలకం సైతం ఈ ప్రదేశంలోవే ఉంచి పూజలు చేస్తున్నారు. గర్భాలయానికి రెండు కిటికీలు ఉండటం మూలంగా భక్తులు స్వామివారి పంచముఖాలను దర్శించడానికి అత్యంత వీలు కలుగుతోంది.

## చారిత్రక నేపథ్యం

అయితే ఈ లింగాన్ని చూడగానే మనకు జైనశిల్పం గుర్తుకు వస్తుంది. లింగానికి పురోభాగంలో కన్పించే విచిత్రాకృతి సైతం దీన్ని బలపరుస్తోంది. ఈ విషయం మనకు మొదటిచిత్రంలో స్పష్టంగా కనిపిస్తుంది. 'పాడు అనే పేరు జైనగ్రామాలకు చివర ఉంటుందన్న పరిశోధకుల వాదన సైతం దీన్నే సమర్థిస్తోంది.' కాంద్రపాడు, లింగాలపాడు, తక్కెళ్లపాడు, బొబ్బిళ్లపాడు, చింతలపాడు, చందర్లపాడు, అనిగండ్లపాడు, ముండ్లపాడు మొదలైన గ్రామాలు ఈ పరిసరాలలోనివే. ఇవి ఈ ప్రాంతంలోని జైనమత ప్రాబల్యాన్ని గుర్తుచేస్తున్నాయి.

అంతేకాక బౌద్ధమత ప్రభావం సైతం ఈ ప్రాంతంలో అధికంగానే ఉందనటానికి మునగచర్ల, రామిరెడ్డిపల్లి గ్రామాలయందలి చరిత్ర ప్రసిద్ధ బౌద్ధస్థూపాలే తార్కాణం. కాంద్రపాడుకు దగ్గరిలోని 'గుడిమెట్ట'ను 'చాగి' వంశపు రాజులు పరిపాలించినట్లు క్రీ.శ. 1158నాటి 'గుడిమెట్ట' శాసనముల మూలంగా తెలుస్తోంది. కాకతీయ, రెడ్డిరాజులు సైతం పాలించినట్లు శాసనాద్యాధారాల వలన నిర్ణయించబడింది. 'కృష్ణా' గెజిట్ ప్రచురణ ఇందుకు ఆధారం.

దిట్టకవిగ పేరుపొందిన వేములవాడ భీమకవి పద్యం–అప్పకవి ఉదాహరించినది అయిన–

"హయమది సీత, పోత వసుధాధిపుడారయ రావణుడు" అను పద్యంలోని 'గుడిమెట్టలంక' అన్న పదంలోని 'గుడిమెట్ట' ఇదేనని, ఆ 'పోతవసుధాధిపుడు' 'త్యాగిపోతిరాజే'నని ఆరుద్ర అంగీకరించగ, ఆ 'సాగిపోతరాజు' ఈ పంచముఖేశ్వరుని ప్రతిరోజు పూజించుకొని వెడుతుండేవాడని, భీమకవి చెప్పిన పద్యంలోని శాపం తగిలి, ఈ రెండు గ్రామాలకు మధ్యనున్న వాగుపద్ద గట్టుం మీద వెడుతుండగ శత్రువులు చేసిన దాడివలన మరణించాడని ఈ ప్రాంతంలోని వృద్ధులు అనూచానంగా వస్తున్న 'కథను' తమ తరువాతవారికి చెప్పుకొంటున్నారు. ఈ 'కథ' మాత్రం ఈ ప్రాంతంలో బాగ ప్రసిద్ధిని పొందింది. భీమన కవి కాలం కూడ 1150–70 ప్రాంతమని పరిశోధకులు అంగీకరిస్తుండటంతో కొంత సత్యం కూడ ఈ వాదనలో మనకు కన్పిస్తోంది.

ముఖ్యంగా 'త్యాగివారు', కాకతీయ, రెడ్డిరాజులు సైతం 'శైవ మతాన్ని' ఎక్కువగ ఆదరించినవారే కనుక ఈ పంచముఖేశ్వరుని చరిత్ర చాల పురాతనమైందనిపిస్తోంది. జైన, బౌద్ధ, శైవ సంస్కృ



చిత్రము–3
పంచముఖేశ్వరునితో లభించిన యంత్రఫలకం.
రెండు పూర్ణకలశాలు, మీనముల జంట, శంఖము,
వెదురు రంధ్రాలు.

తుల సమ్మేళన శిల్పమే ఈ శివలింగంలో ద్యోతకమవుతోందని మనం అంగీకరించవచ్చు. 'ముక్తావిద్రుమ హేమనీల ధవళైః' అని గాయత్రిని ధ్యానిస్తున్న మనకు ఈ రూపంలో కొంత సామంజస్యం కన్పిస్తోంది. 'లింగం' పైననే పానమట్టాన్ని చెక్కి, లింగానికి ప్రత్యేకంగ పానమట్టం అవసరం లేకుండా చేశాడని ఒక వాదన ఉంది. లింగంపై కన్పించే ప్రత్యేక చిహ్నం ఆదేసనుకొంటే అది ఆనాటి సంప్రదాయమని మనం భావించవచ్చునేమో! ఏమైనా ఈ పంచముఖేశ్వరుడు ఒక అపురూపమైన దైవం. చూసి తరించవలసిన శిల్పం.

శ్రీ ఎం. రవిప్రసాద్

(ఫోటోలు : వి. యు. గుప్తా)

# మో. రా. 'అమృత కలశము'

'కవిశేఖర - సాహిత్యరత్న - ప్రసన్నమధుర కవి' కీ శే. మోచర్ల రామకృష్ణయ్యగారు(మో.రా.) నేటికాలపు నెల్లూరు సాహిత్య-సంగీత - సాంస్కృతిక - కళారంగాలను బహుముఖాలుగా ప్రభావితం చేసిన ప్రముఖులలో ఒకరు. మద్రాసు పచ్చయ్యప్ప కళాశాలనుండి చరిత్ర ప్రధానాంశంగా బి ఏ., లా కళాశాల నుండి బి.ఎల్., పట్టాలు పొంది నెల్లూరులో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించిన మో.రా. అనతికాలంలోనే సుప్రసిద్ధుడైనాడు.

'అభినవ తిక్కన – సాహిత్య స్థాపక – మహోపాధ్యాయ' స్వర్గీయ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి గురుత్వంలో సంస్కృతాంధ్ర సాహిత్య మర్మాలను జీర్ణించుకొన్న మో.రా. 'మారుతీ శతకం'తో కవితా జైత్రయాత్ర ప్రారంభించి 30 కావ్యాలు వ్రాశారు. వీటిల్లో స్వతంత్రాంధ్ర కావ్యాలు, సంస్కృతానువాదాలు, నాటికాలు, వచన ప్రబంధాలు ఉన్నాయి. 'శారదా ప్రసాదః' వీరి స్వతంత్ర సంస్కృత కావ్యం అయోధ్య సంస్కృత విద్యాపీఠం వారిచే గుర్తింపబడి వీరికి 'సాహిత్య రత్న' బిరుదాన్ని కొని తెచ్చింది. అంతేకాక రావినూతల శ్రీధరరావుగారి చేత తెలుగులోకి అనువదింపబడ్డది.

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ, వేదం వేంకటరాయశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, ఓలేటి వేంకటరామశాస్త్రి, వేటూరి ప్రభాకర శాస్త్రి, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు మొదలైన మహామహుల ప్రశంసల నందుకొన్న మో.రా. స్వస్థాన వేష భాషాభిరతుడు. ఆయన కృతుల్లో - ప్రసంగాల్లో - హిందూ జీవనస్రవంతి - సంస్కృతి-ఆర్ష ధర్మము కొట్టవచ్చినట్లుగా కానవచ్చే విశిష్టతలు. ఆయన కృతులన్నీ పరిమాణంలో చిన్నవే! కాని గుణగౌరవంచేత ప్రామాణికమైనవి.

1948 లో ప్రచురింపబడ్డ 'అమృత కలశం' కేవలం 98 పద్యాల లఘు కావ్యం. కాని వ్యంగ్య వైభవం - మధురమైన భక్తి భావన ఈ కావ్యానికి అత్యంత గౌరవాన్ని చేకూర్చాయి.

భారతం – భాగవతం భారతీయులకు శిరోధార్యాలు. ఈ రెండింటిలో శ్రీకృష్ణుని లీలలు విరివిగా వర్ణింపబడ్డాయి. ఆయా లీలలను ఒక్కో పద్యంలో ప్రస్తావిస్తూ అటువంటి దయనే తనపై కూడా కొంత ప్రసరింపచేయమని కవి కోరుకోవడం ఈ కావ్యం యొక్క ప్రయోజనం. బృందావని - మురళీగానం - గోపికా క్రీడలు-గోవర్ధనోద్ధారం - ద్రౌపదీ సంరక్షణ - రాయబారం - విశ్వరూప ప్రదర్శన - భీష్మ స్తవం మొదలైనవాటిని పేర్కొంటూ 'నీలోత్పల మాల తావులు మురారీ నాకు మూచూపవే', 'నీ భక్తి ప్రసాదింపవే',

నా కిడం దగదే బిచ్చము', 'స న్నేలనదేల', అంటూ కృష్ణుని వేడు కోవడం హృద్యమే కాదు - అనవద్యం కూడా!

'శ్రీ గోవింద పదారవిందములు-స్వశ్రేయ స్సదా మోదిత
ప్రాగల్భ్యంబు - లభంగురాభ్యుదయముల్ - మదారు సంక్రందనా
భోగాంచన్య కుదేంద్ర నీలమధుపంబుల్-రంగదాకాశ గం
గా గుంజన్మకరంద బిందువులు-మత్కా-వ్యస్థముల్ గావుతన్!'

'మోహధ్వాంత నికృతనంబులు-దయాంభోరాశి సంభూతముల్-
స్నేహాలోకన సుప్రసాదన సుధానిష్యందముల్ - సాధు సం
దోహ స్వాంత కుముద్వతీ ప్రమదముల్ - దుగ్ధాబ్ధి జాలోచనో
త్సాహంబుల్ - హరినవ్యం వెన్నెలల్ నిచ్చల్ నన్ను రక్షించుతన్!'

ఇవి 'అమృత కలశం' యొక్క ప్రారంభ పద్యాలు. కవి శైలీ విన్యాసానికి పట్టుకొమ్మలు. ఈ కావ్యంలో 4 భాగాలున్నాయి. మొదటి భాగంలో భాగవత లీలలు వర్ణింపబడ్డాయి. ఇందులోని పద్యాలు మధుర మకరందాలు చిందే ముద్దమందారాలు. తక్కిన మూడింటిలో భారత కథాఘట్టాలు వర్ణింపబడ్డాయి. ఇవి దీర్ఘ సమాస భూయిష్టమై ఓజస్సు - తేజస్సు నింపుకున్న గులాబీలు.

"మోవి మురళి మ్రోయ - మూపు చిక్కము మోయ
చుంచుకురుల నెమలి ఫించ మలర
నవ్యం మోముతోడ నా చిత్తముకురాన
నొడిగి ప్రతిఫలింపు మోయి! కృష్ణ!"

"చిచికిన్ గోత్రము నాతపత్రముగ బ్రాతిన్ వ్రేలితోనెత్తి-యు
గ్ర విపత్తిన్ మరలించినందుల కుపగ్రాహంబుగా మందలో
నువిదల్ ముద్దులుజేసి పీకిడిన యన్యూనంపు దధ్యన్నపుం
జవి చూపింపుము నా కొకింతయిన కృష్ణా! వల్లవీ వల్లవా!"

ఇవి భాగవత సుధా నిష్యందాలు. కవి భక్తి మాధుర్యానికి, ఊహా సౌందర్యానికి ముకురాలు.

భారతం పద్యాలు భారతానికి తగ్గట్టుగా శయ్యా సౌభాగ్యంతో విలసిల్లుతున్నాయి. మచ్చుకు ఒకటి—

"మరకత స్తంభ శుంభన్మనోహర విగ్ర
హంబున బీతాంబరంబు మెరయ
జ్యోతిర్మరీచికా స్తోమమ్ము వెదజిమ్ము
కడగన్నులను నవ్యంగడలు కొనగ
స్మాయ త్స్రహ్లాసార పీయూష వీచికా
చ్ఛాయ గల్కి-తురాయి సౌరుజిల్క-
కర్ణకుండల యుగోద్దీర్ణ రత్నచ్ఛవుల్
గండ స్థలంబుల దాండవింప___"

ఆయుధం పట్టనని ప్రతిజ్ఞ చేసికూడా తన బాణాల తాకిడి కోర్వలేక చక్రహస్తుడై తనమీద కురికిన కృష్ణుని భీష్ముడు స్తుతించిన తీరిది.

ఈ కావ్యంలో ప్రధానంగా చెప్పుకోవలసిన రెండు విశేషా లున్నాయి.

కవులు తమ కవిత్వ తత్త్వాలను - విశేషాలను కథలో ఏదో సందర్భాన పాత్రలనోట చెప్పించడం పరిపాటి. పింగళి సూరన్న ఈ రీతికి శ్రీకారం చుట్టాడు. మో. రా. ప్రాచీన కవులను - వారి తీరులను ఖుణ్ణంగా జీర్ణించుకొన్న దిట్ట.

'అమృత కలశం'లో ఒక పద్యమున్నది. అది చాలా చిన్నది. తేటగీతి. అంత కొండ ఇంత అద్దంలో ఒదిగినట్లు ఈ చిన్న పద్యంలో మో. రా. కవితా తత్త్వం ఇమిడి ఉంది. అది ఇది___

"కంసు మరుగుజ్జు దాసి చక్కందనాల
రాశి యయ్యెను నీ యనుగ్రహము కలిమి
దేవ! వక్రోక్తిమయ మస్మదీయ కావ్య
'మమృత కలశము' కాదె నీ యాదరమున!"

ఇది కుబ్జ వృత్తాంత వర్ణనం! కంసదాసి కుబ్జ కురూపి, కంస పదార్థం మధుర కొచ్చిన కృష్ణ బలరాముల కది గంధమాల్యాదులను అర్పించింది. అందుకు కృష్ణుడు ఆమెను అపురూప సౌందర్యరాశిని చేశాడు. ఈ కథను సాకు చేసుకొని మో. రా. తన కవితాకన్య వక్రోక్తిమయమని చెప్పుకున్నాడు.

సాహిత్యంలో వక్రోక్తి సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టినవాడు భామహుడు. పెంచి వివరించినవాడు కుంతకుడు. 'వైదగ్ధ్యభంగీ భణితి వక్రోక్తిః' అని కుంతకమతం. సాధారణంగా లోకులు చెప్పు కునే పద్ధతిలో కాక కవి ఉక్తివైచిత్రి వక్రోక్తి. వక్రోక్తి అలంకా రికులకు ఒక రసపదలంకారం కాని లోకులకు వక్రబుద్ధిలాగా— వక్రమైన ఉక్తి—వంకరమాట అని వంకర అర్థం కూడా ఉంది.

"కృష్ణా! కుబ్జ ఇచ్చిన పుష్పమాలను స్వీకరించి ఆమె వంకర రూపును పరిహరించినట్లు నా ఈ కావ్యమాలను స్వీకరించి నా వంకర మాటలకు అమృతత్వము చేకూర్చు - తండ్రీ!" అని కవి నివేదన, నిజమే! లోకుల దృష్టిలో ఒకడు మహాకవి-మహా పండితుడు-గొప్ప కళాకారుడు కావచ్చు. కానీ—సర్వజ్ఞుడైన ఆ పరమాత్మ ముందు

మానవుడేపాటి? ఆతడి తెలివితేట లేపాటి? అందుకే కవి-తనవి వంకర మాటలని చెప్పుకున్నాడు. ఇది ఆవేదనాత్మకమైన ఆయన వినమ్రశీలా నికి పట్టిన వెల్లగాడుగు - కాని ఇందులోనే తనది వక్రోక్తి మార్గమని ధ్వనింపచేయడమే ఉక్తి వైచిత్రి. అదే వక్రోక్తి!

మో. రా. కవి - పండితుడు - భక్తుడు మాత్రమే కాదు. తన దేశం-తన జాతి - తన రాష్ట్రం - తన భాష - తన సంస్కృతులపట్ల అభిమానం-ఆత్మప్రత్యయం కలిగి ఉన్నవాడు. ఆయన ఏది వ్రాసినా పూసలలో దారంలాగా ఈ అభిమానం ప్రకటింపబడుతూనే ఉంటుంది.

ఈ పద్యం ఆయన భావవైశాల్యానికి ఒక ఉదాహరణ.

"నా వాగ్రంగము నెక్కి యొక్క క్షణమైనన్ నిల్చి, లావణ్య శీ
లా విర్భూత గతిన్ నటించి యొక బ్రహ్మానంద గీతంబు కృ
ష్ణా! వాయింప గదోయి నీ మురళిపై నావాతెరన్ దాటి-నీ
యావద్భారత వేష మచ్చుపడ రావయ్యా! దయాసాగరా!"

ఒక బాలమురళీకృష్ణుడిగా - లేక - గోపికావల్లభుడిగా - లేక - గోవర్ధనోద్ధారిగా-లేక-పార్థసారధిగా తన కృష్ణుడిని దర్శించాలనుకుంటే ఇది ఒక మామూలు కవి భక్తిగీతం అయివుండేది. కాని-ఇది మో.రా. పద్యం. అంటే ఏదో ఒక ఉక్తివైచిత్ర్యం, వైచిత్రి ఉండే ఉంటుంది.

ఆయనకు భగవంతుడంటే ఎంత మన్ననో-దేశమంటే అంత మక్కువ. నిజానికి ఆయనకు తన దేశం-తన సంస్కృతియే భగవంతుడు. అందుకే తన కృష్ణుడిని తన దేశం వేషంలో రమ్మని కోరుకుంటున్నాడు. అది కూడా తన ఊరిలాగా-తన రాష్ట్రంలాగా కాదు. "నీ యావద్భారత వేషమచ్చుపడ రావయ్యా!" అని కోరుకుంటున్నాడు. ఈ ఒక్క పద్యపాదం ఆయనను సమానులలో ఉత్తముడిగా-ఉన్నతుడిగా నిలబెడుతున్నది. కులాలు-మతాలు-భాషలు-ప్రాంతాల పేరుతో వైషమ్యాలను రెచ్చగొట్టే శక్తులు ఈ కవినుండి నేర్చుకోవలసింది ఎంతో ఉంది. తన్ను తాను ప్రేమించుకోవడమంటే ఎదుటవాడిని ద్వేషించడం కాదు. నిజానికి తననుతాను ప్రేమించుకోలేనివాడు ఎవరినీ ప్రేమించలేడు. గౌరవించలేడు.

మో. రా. కావ్యాలన్నీ భావ సౌందర్యం, భాషా గాంభీర్యాలతో పాటు దేశభక్తిని, జాతిసమైక్యతను, సంస్కృతీ పరిరక్షణను ప్రబోధిస్తూ పాఠకుల ప్రశంసలకు పాత్రమైనాయి

ఈ రీతిగా ఆంధ్రులకు 'అమృత కలశాన్ని' అందించి శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు అక్షరాలా అమరుడైనాడు.

**శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్**

# తెలంగాణా గ్రామనామములు

ఆర్యా,

1987 జూలై ఆంధ్రపత్రిక భారతి సారస్వతానుబంధములో ప్రకటించిన కపిలవాయి లింగమూర్తిగారి వ్యాసమును గురించి.

తెలంగాణా ప్రాంతపు పలు గ్రామనామములు పౌరాణిక, చారిత్రక విషయములు తెలుపుచు కపిలవాయి లింగమూర్తిగారు యిచ్చిన వివరణ ఎంతో ఆసక్తికరంగా ఉన్నది. రామాయణ గాథ లందలి పక్షి రాజులు జటాయువు సంపాతి తెనుగుసీమకు చెందినవారని చదువుట కెంతో ఉత్తేజకరంగ వున్నవి. కాని తెలంగాణ ప్రాంతపు స్థల చరిత్రలు, తెనుగు మూల పదముల ఉత్పత్తులు అచటి ఇంటి పేర్లు గ్రామనామాద్దులు ఈ వ్యాసమునందు ప్రసక్తిగల ఊర్ల పేర్ల అసలు సిసలైన భౌగోళిక సామాజిక అర్థములు కలవని సూచించు చున్నవి. ఇట్టి మూలార్థములను పాఠకుల విమర్శకుల దృష్టికి తెచ్చుట ఆవసరమని ఈ లేఖ వ్రాయుచున్నాను.

క్రీ.శ. 3 నుండి 6 శతాబ్దములలో తెలంగాణ సీమలో అతి ప్రాచీనమగు కోటలను క్షేత్రములను నిర్మించినవారు క్షత్రియులు కారు, రెడ్డిరాజులు కారు, చొదరులు కారు. బోయ కిరాత వంశీయులని పలు స్థలచరిత్రలు నిరూపించుచున్నాయి. కొల్హాపురము, గద్వాలు రత్నగిరి [హిందూపురం ప్రాంతం ప్రస్తుతం కర్ణాటకంలో చేరినది] జిప్రోలు కోటలు నిర్మించినవారు బోరు మన్నడులని వాటిని 10 నుండి 13 శతాబ్దులలో పాలించినది లింగాయతులని, క్షేత్రముల సభి వృద్ధి చేసినది జైనులు బౌద్ధులని అచటి స్థల పురాణముల వలన స్థల పరిశీలన వలన తెలియుచున్నది. మూల తెనుగు పదములు పరిశీలించినచో అచటి స్థలనామములు నైసర్గిక భౌగోళిక పశుపక్ష విశేషములపై నాధారపడి యేర్పడినట్లు తెలియుచున్నది వాటిని సంస్కృతీకరించి నాగరిక నామములుగ 9, 10 శతాబ్దులందు లేఖకులు కవులు మార్చి వ్రాసియున్నారు.

| మూల తెనుగు పదము | సంస్కృతీకరణము కల్పితము | అర్థము |
|---|---|---|
| గద్దవాలు | గద్వాల, గద్వాల్ గృద్రహారము | గృద్ధలవాగు |
| సురిపి | సురభి | మంచినీటి చెరువు |
| చిరిపి | చిడిపి | చిన్న చెఱువు |
| గుద్దంటి [ఇంటిపేరు మొదటి గ్రామనామము బట్టి వచ్చినది] | గృద్దంటి | గొర్ల మందలు విశేషమున్న స్థలము మందలవారు [మందడి] వంశము |
| గోదలు | గృద్రహళు గృద్రహారము | గేదెల మందలు విశేష మున్న స్థలము [గోట్లు-గోదలు] |
| గోదాళము | గేతమపరం కౌతరం | గోవుల మందలకై వదలిన సహజమగు నీటిపట్టు |
| కోదాడ [కో, గో, కౌ పదములు గోవుకు సంక్షిప్త పదములు] | క్రోదవాడ | గోదవాడ గోవులపల్లి ఆవులూరు ఆలూరు అని అర్థము. |
| గోదారి | గౌతమి | గోవుల దరి, పశువులు విశేషముగ నుండు నదీ తీరము గోవులనది అని అర్థము. |
| కమ్మం మెట్టు ఖమ్మం [కింబము కాదు] [కమ్మం] [ప్రస్తుతల కారం చెరువు ప్రాచీనమైనది] | స్తంబాద్రి | కమ్మ నీటి చెఱువు నల్ల నీటిపట్టు కొండనీరు అచటి కొండయే మెట్ట |
| రాతికొండ | రత్నగిరి | పెద్ద కొండ మట్టిపొరలు లేని కొండ. |
| ఖుర్దా, గుర్దా | గృద్రహార | గొర్రెల మందలున్న స్థలము |
| బోనగిరి బోనకల్ బోనుపల్లి | భువనగిరి బోంగీర్ బోయనిపల్లి | బోణాలు, ఆయుధములు శిలాయుగపు పనిముట్లు చెక్కు స్థలము |
| వనవసి | బనవాసి వనవాశి | అడవిపల్లి, అడవిలోపల్లి పశువులగాయు వనచరులు నివాసము |

| మూల తెనుగు పదము | సంస్కృతీకరణము కల్పితము | అర్థము |
|---|---|---|
| గద్దంటు [గుద్దంటికి మరొక మూల తెనుగురూపము] | ఖురదండు | గొఱ్ఱెల మందలుండు స్థలము కాఫీ రంగు. సన్నరాతి నేలలు పంట భూములుగ కాక, గొర్రెల మందలు గోపాల భవనము లుగ శ్రీశైలము నుండి బీదర్‌వరకు - పూర్వము వాడకయందున్నవి. గద్దలకు గద్దరంగుకు పక్షి జాతి నరులకు సంబంధించిన పదము కాదు. |
| బోణాల | బాణాల | ఆయుధములు రాతి యుగపు పనిముట్లు చెక్కు స్థలము |
| జడంగిపల్లి జటంగిపల్లి జటింగిపల్లి | జటవ్రోలు | జడల అల్లుకొను, బొచ్చు గలిగిన గొఱ్ఱెలు పెరుగు స్థలము పెద్ద బొచ్చు గొర్రె పేరు జటంగి. |
| జటింగిమల్ల | జటంగి మల్లేశ్వరం | పెద్దబొచ్చు గొర్రెలు పెరుగుకూడ ప్రాంతము. మల-కొండస్థలవాచకము (స్థలవాచకము) పరము-గ్రామవాచకము నామాంతము. |
| గొబ్బూరు | గోబ్బూరు | గుబ్బిపూల మొక్కలు విస్తారముగ పెరిగిన నీటిపట్లు. |
| అబ్బూరు కొప్పురు కొప్పాక | అబ్బూరు కొప్పురు కొప్పాక | సహజమైన నీటిపట్టు కొనదేరిన దిబ్బ త్రికోణాకృతి గుడిశె లున్న గ్రామము. |
| కాశూరు కొళకూరు | కాశూరు | కలిమి, తామర, తూటు కాడలు పెరిగిన ఊట చెరువు (ఊటచెరువు) |
| గద్దగల్లు | గురుద్రాది | గద్దలు నిలుచు ఎత్తైన కొండ |

జటంగి అంటే జటాయువు రావణునెదిర్చిన స్థలమని, తుప్పూరంటే దాని తల తెగిపడిన స్థలమని, కాళూరంటె దాని కాళ్ళు తెగిపడిన స్థలమని చెప్పుచున్న స్థలగాథలు గ్రామనామముల వ్యుత్పత్తులు కావని మనవి. అచటి దేవాలయముల పేర్లు దేవతానామములు అచటి గ్రామనామములనుండి కలిగినవి. గ్రామనామములు పై విశేషముల నుండి కలిగినవి. అర్థము తెలియనినాడు అచటి దేవాలయముల పూజారులు, గ్రామకరణములు, పురాణప్రియులు రామాయణ భారత గాథలకు సమన్వయించి ఊర్ల పేర్లకు అర్థము చెప్పిరి. అచటి దేవతల పేర్లకు పురాణ వీరుల పేర్లకు సరిపడునట్లు అర్థము చెప్పిరి. ఆ కథలందలి విశేషములనుబట్టి తదుపరి భక్తులు స్థపతులు ఆయా నిర్మాణములు గావించి కథావస్తువును బొమ్మలుగ చెక్కించిరి. రామగాథ జరిగిన స్థలము రావణుడు సీత నెత్తుకపోయిన స్థలము నాటి దండకారణ్యము తెలంగాణము కాదు, గోదావరీ తీరస్థ పంచవటియు కాదు. గుజరాతునందలి పంచవటియు కాదు. మధ్యప్రదేశము నందలి స్థలములే రామాయణము నందు ప్రసక్తికి వచ్చిన స్థలములని పలువురు చారిత్రకులు పురాతత్త్వ పరిశోధకులు పురాణ పరిశోధకులు గత 30 సంవత్సరములలో పలుమార్లు సకారణముగ నిరూపించియున్నారు. గద్దపల్లి, గద్దవరం, గద్దకుండ, గద్దరం అను ఊర్లు తూర్పు గోదావరిజిల్లా, కడపజిల్లా, తెలంగాణా, రాయలసీమలో అనేకము కలవు. ఈ కొండలపై నేటికిని జనసంచారము లేని తావున గ్రద్దలు విశేషముగ తిరుగుచుండుట మనము చూడగలము. మదనపల్లి అనంతపురం పట్టణాల మధ్య గద్దరాజుపల్లి ఉన్నది. ఇచటి రాగి రంగు గద్దలు, తెల్లరంగు గద్దలు నేటికిని కలవు. బంగారువన్నె శరీరము [తెల్లకాళ్ళగద్ద గోల్డెన్ ఈగల్] మదనపల్లి కోమటిచెరువులో వర్షాకాలమునందు వ్రాలుచుండును. గద్దరాజు అను యింటి పేరుగల వారు కదిరి ములకల చెరువు మండలములందు పలువురున్నారు. వారును క్షత్రియులుకారు బోయకులస్తులు బోయలలో అగ్రవర్ణముగ వున్నారు. గద్దర్ అనబడు వ్యక్తినామము ఒక ప్రాచీన దేవతా నామమునకు మూలము, గదలేక ప్రాచీన శిలాయుధము కలిగిన కిరాత జాతి నాయకుడు దీనిని గదాధరుడుగ, పురాణకారులు విష్ణువుయొక్క ఒక అవతారముగ చిత్రించిరి. ఆది గదాధరుడు అనగ శిలాయుగ మానవుడే. అర్థముకాని ప్రాత ఆకృతిని ఏదో ఒక దేవసుకీతముగ పురోహితులును, బీజాక్షరసుకేతముగ తాంత్రికులును చిత్రించుటచే మొదటి అర్థము మారినది.

**ఇ. ప్రసాదరావు**
ఒంగోలు

# జనవరి భారతి

17-2-88

అయ్యా,

'భారతి' జనవరి'88 సంచిక నిన్నటిదినం అందింది. సంతోషం. ఒకనాటి 'భారతి' సాహిత్య విద్యార్థుల అవశ్య పఠనీయ పత్రికగ వుండేది. అమూల్యమైన వ్యాసాలుండేవి. మధ్యలో కథల పత్రిక స్థాయికి దిగజారి ఆగిపోయింది. కొన్ని మార్పులతో తీసుకు రావాలని సంకల్పించటం సంతోషం. వెల పెరగటం అనివార్యం. పరిశోధనాత్మక రచనలు, సాహిత్య వ్యాసాలు, విమర్శలు, సమీక్షలు విరివిగా రావాలి ఒకటి రెండు కథలు చాలును కవితలు ఉండవలసిందే. 'మాసం-నక్షత్రఫలాలు' ప్రచురించటం అవసరమేనా? వారపత్రికలు ఆ పని చేస్తూనే వున్నాయి దయచేసి పరిశీలించగలరు. ఇతర భారతీయ భాషా సాహిత్యాల గురించి, రచయితల గురించి, వారి రచనల గురించి ప్రచురించటం సముచితమని విన్నపం

**జానమద్ది హనుమచ్ఛాస్త్రి**
కడప

ఆర్యా,

మళ్ళీ ప్రారంభమైన 'భారతి' ప్రథమ సంచికను చూసి ఆనందం కలిగి మళ్ళీ వసంతఋతువు ప్రారంభమైన అనుభూతిని కలిగించింది — ఒక వీరుడు కొండ శిఖరాన్ని అధిరోహిస్తున్నట్లుగా భావావేశం కలిగింది. రచనలన్నీ విలువైనవిగానే ఉన్నాయి. ముఖ్యంగా శ్రీ ముదిగొండ వీరభద్రయ్యగారి 'రావిశాస్త్రి' కథల వ్యాసం, పులికంటివారి వ్యాసాలు అతి విలువైనవిగా ఉన్నాయి! మాదిరాజు వారి కవిత హృద్యంగా వుంది! కొన్ని నా మనస్సున కదిలిన ఆలోచనలను వ్రాస్తున్నాను - ఏమిటంటే విశ్వనాథవారి 'కిన్నెరసాని' పద్యాలు సీరియల్‌గా వేస్తే బాగుంటుందేమో! ప్రాచీనాలైన ఇంకా పద్యాలను తిరిగి హృద్యంగా ముద్రించి 'భారతి'కి కొత్త అందాలను సంతరింపజేయండి - 'భారతి' ప్రతినెలా భవ్యంగా ఎప్పటికీ దర్శనమివ్వాలని ఆకాంక్షిస్తూ, పిపాసి

**తందాళై రాఘవాచార్య**
నిజామాబాద్

ఆర్యా,

భారతి జనవరి 1988 సంచిక అందగానే మూసివేయబడ్డ ఆంధ్రుల ఏకైక సాహిత్యపత్రిక పునరుద్ధారణ జరిగినందుకు ఎంతగానో సంతోషపడ్డాను. అయితే "రావిశాస్త్రిగారి మూడు కథల బంగారం - అలంకార రచన" అన్న ముదిగొండ వీరభద్రయ్యగారి సమీక్ష మాత్రము భారతి సాహిత్యస్థాయికి తగియున్నది. జి వి. సుబ్బారావుగారి 'జీవునివేదన', బొడ్డుపల్లి పురుషోత్తంగారి 'కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!' అన్న కవితలు, జాస్తి సూర్యనారాయణగారి "ఆధునిక భారతీయ భాషల్లో సంస్కృతము - తులనాత్మకానుశీలనము" అన్న వ్యాసము చెప్పుకోదగ్గవి అంతే.

రాబోయే సంచికలలో కనీసం ఈమాత్రం స్థాయి ఉన్న సమీక్షా పరిశీలన వ్యాసములకు, కవితలకు మాత్రమే స్థానమిస్తారని ఆశించుచున్నాను.

ఏ. రామకృష్ణశాస్త్రి
వారణాశి

ఆర్యా,

భారతి మళ్ళీ వెలువడుతోందని తెలిసి ఆనందించినవాళ్ళలో నేనొకణ్ని. భారతి ఏ అడ్డంకులూ లేకుండా సాగిపోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

జనవరి 88 సంచికలో "తి" గారిచే వ్రాయబడిన "ఆధునికత - అనంత విచారణలో" అనే వ్యాసంలో అవసరమైన అర్థవివరణలు ఏ నెలకానెలే అందిస్తే బాగుంటుంది. ఈ విషయంలో పాఠకుల అసౌకర్యాన్ని గుర్తిస్తారనుకుంటాను. "స్వవిషయం"లో రాజకీయ పాలుని చాలా స్వల్పంగానే ఉంచితే మంచిది. సుప్రసిద్ధ రచయితలతో పాటు క్రొత్తవారికి కూడా తగిన అవకాశాలు కల్పించాలని మనవి.

కో. స. కుమార్
పెదపూడి



# గ్రంథ విమర్శలు

## అలబ్ధకావ్య పద్యముక్తావళి

[సంపాదకులు, డాక్టర్ ఆర్. శ్రీహరిగారు. డెమ్మి 14 + 24 + 306 + 23 పేజీలు వెల 30-00 ప్రచురణ పతంజలి పబ్లికేషన్సు, హైదరాబాదు. ప్రాప్తిస్థానం- శ్రీమతి ఆర్. అనంతలక్ష్మి 16-2-బి 36 ఎఫ్ 2 మాధవనగర్, సైదాబాద్, హైదరాబాదు-59]

తెలుగు వాఙ్మయంలో ముద్రిత గ్రంథాలకంటె అముద్రిత గ్రంథాలే ఎక్కువగా ఉన్నవి. ముద్రణావకాశం లేని చాలా పుస్తకాలు మూలపడిఉన్నవి. పేరు తెలిసినా అలస్యంగాఉన్నవి ఎన్నో! లక్షణ గ్రంథాల్లోనూ, సంకలన గ్రంథాలలోనూ ఉదాహరించబడిన పద్యాలవల్ల అలబ్ధాలయిన కొన్నిటి పేర్లు తెలుస్తున్నవి.

డాక్టర్ శ్రీహరిగారు ఎంతో ఓపికతో పెక్కు గ్రంథాలను పరిశీలించి, ఆయా గ్రంథాలలో ఉదాహరణములుగా గ్రహింపబడిన అనుపలబ్ధ గ్రంథాల పద్యాలను సంపుటీకరించి, సాధ్యమైనంతవరకూ వాటికి సంబంధించిన చరిత్రాంశాలనూ, ఇతర విషయాలనూ గ్రహించి యీ గ్రంథాన్ని తయారుచేసి ప్రకటించారు. ఆ ఆలబ్ధకావ్య విషయం ఆకారాది క్రమంలో ఇయ్యబడింది అనుబంధంలో చరిత్ర తెలియని గ్రంథాల పద్యాలు చేర్చబడినవి. గ్రంథం చివర ఉదాహృత కావ్యాల యొక్కయూ, ఉపయుక్త గ్రంథాలయొక్కయూ, పట్టికలు, ఉదాహృత కావ్యకర్తృ సూచికా ఉన్నవి సంపాదకులు ఎంతో శ్రమకోర్చి దీన్ని తయారుచేశారు తమ పరిశీలననుగూర్చి విపులంగా 'పస్పశ' మనే పీఠికలో వివరించారు. పతంజలిపై యాకరణ మహాభాష్యంలోని ప్రథమాహ్నికానికి పస్పశాహ్నికమనే పేరు. ఆనామాన్నే ఈయన గ్రహించారు దీనిని పతంజలి పబ్లికేషన్సువారు ప్రచురించడం సముచితంగా ఉన్నది.

పుస్తకం మొదట, శ్రీహరిగారి పరిశ్రమను ప్రశంసిస్తూ ప్రముఖులిచ్చిన అభిప్రాయాలు చేర్చబడినవి. వారిలో డా॥ సి. నారాయణ రెడ్డి, డా॥ జి ఎన్ రెడ్డి, డా॥ కె గోపాలకృష్ణారావు, డా॥ యస్వీ జోగారావు, డా॥ తూమాటి దొణప్ప, డా॥ కే. వి. రామకోటిశాస్త్రి, డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, డా॥ ఎస్. లక్ష్మణమూర్తిగార్లున్నారు ఇది సంపాదకుల గురువర్యులు డా॥ ఓరుదరాజు, రామరాజుగారి కృతి ఇయ్యబడింది.

శ్రీహరిగారి పరిశ్రమ ఎంతో ప్రశంసించదగినది. అయినా, అలబ్ధగ్రంథాల నామ నిర్ణయంలో ఇంకా ఎక్కువ పరిశీలన అవసరమైనట్లు తోస్తున్నది. రెండుదాహరణలు- శ్రీనాథుని వీథి నాటిక మొకటి ఉన్నట్లు వీరు అభిప్రాయపడుతున్నట్లున్నది. ఆ మహాకవి రచించిన క్రీడాభిరామానికి వీథినాటకమనే పేరు వాడుకలో ఉన్నది. అందులో లేని పద్యాలు కొన్ని కానవస్తున్నవనీ, వావిళ్ళవారొకప్పుడు ప్రకటించిన "శ్రీనాథుని వీథినాటకము"లో క్రీడాభిరామంలో లేని పద్యాలున్నాయనీ సంపాదకు లంటున్నారు. వావిళ్ళవారు ప్రకటించిన చిన్న పుస్తకం "వీథినాటకం"లో ఆ మహాకవి ప్రస్తావికంగా చెప్పిన చాటుపద్యాలే కానవస్తున్నవి. దానికి వీథినాటకలక్షణం ఏమాత్రమూ కుదరదు. దొరికిన పద్యాలకు ఏదో పేరు పెట్టాలని, ప్రకాశకులు ఆ పేరుతో దానిని ప్రకటించి ఉండాలి. తర్వాత వారు దానిని ప్రకటించలేదు. శ్రీనాథుని వీథినాటకం మరొకటి ఉన్నదనుటకు తగిన ఆధారం కానరాదు.

ఈ విధంగానే, ఉత్తరాంధ్ర ప్రాంతీయుడైన గోగులపాటి కూర్మనాథకవి "రామతీర్థాశ్రయశతకం" రచించినట్లు చెప్పబడింది. దాని మకుటం "విజయరామా! రామతీర్థాశ్రయా!" అనేది. శతకం పేరు "విజయరామశతకం" కాని రామతీర్థాశ్రమశతకం కాదు.

కూర్మనాథకవి విజయనగర సంస్థాన ప్రభువైన విజయరామ రాజుగారి ఆశ్రితుడు, భగవద్భక్తుడు మానవులకు అంకితంగా ఏ గ్రంథాన్నీ వ్రాయడు. అసూయాపరులైన విద్వాంసులు కొందరు "ప్రభువులపయి కూర్మనాథ కవికి గౌరవంలేదు అందువల్లనే మీకు అంకితంగా ఏ గ్రంథమూ వ్రాయలేదు" అని విజయరామరాజుగారితో చెప్పి, కవిపై అసంతృప్తిని కలిగించారు ఆయన కూర్మనాథ కవిని పిలిపించి" మా పేరు వచ్చే రీతిని ఒక శతకాన్ని రచించాలి" అని ఆదేశించారు. కవి చిక్కులోపడ్డాడు. ప్రభునకు అసంతృప్తీ, కోపమూ కలగకుండా, తన నియమం చెడకుండా ఉండే రీతిలో, విజయనగరం దగ్గర ఉన్న రామతీర్థక్షేత్రంలోని శ్రీరాముని సంబోధిస్తున్నట్లు "విజయరామా! రామతీర్థాశ్రయా!" అనే మకుటంతో శతకం చెప్పాడు. విజయరామ ప్రభువుకు రామతీర్థంలోని శ్రీరామునిపై భక్తి ఎక్కువ ఆ దేవాలయాన్ని కట్టించినదీ విజయనగర సంస్థానాధిపతులే. ఈ శతకం విని, తన్ను సంబోధిస్తూ దాన్ని రచించినట్లు

విజయరామరాజుగారికీ తృప్తి కలిగింది. పండితుల పాచికపారలేదు. మరో ముద్రణతో సంపాదకులు ఇలాంటివి లేకుండా చూస్తారని ఆశించవచ్చును.

ఇలాటి గ్రంథాలను సమకూర్చడానికి శ్రీవ్రపరిశీలనతోపాటు ఎంతో ఓపిక ఉండాలి. అందువల్ల ఎవ్వరూ ఇట్టిపనికి పూనుకోరు. దీనికి పూనుకొని సంకల్పసిద్ధులైన డాక్టర్ శ్రీహరిగారి పరిశ్రమ ప్రశంస నీయమైనది. ఇట్టి సంకలన గ్రంథాల అవసరం మనకు ఎంతో ఉన్నది. సాహిత్యాభిమానులు దీనిని ఆదరించి, సంపాదకులకు తగిన ప్రోత్సాహం ఇవ్వగలరని ఆశిస్తున్నాను.

"అంగీరస"

# హైందవ ధర్మామృతమ్

[రచన: శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి; ప్రాప్తిస్థానం: రచయిత పేర ముంగండ _ వయా, అంబాజీపేట, తూ॥ గో॥ జిల్లా- 533 224; మూల్యం: రు. 25-00]

ధర్మసంస్కృతి సాంఘిక సంస్కార పూర్వకములు నాలుగు ప్రకరణములు గల ధార్మిక విషయ ప్రబోధకం యీ గ్రంథం.

ఒక్కొక్క ప్రకరణం వివిధ విషయాలకు చెందిన శీర్షికలు గలది. శ్రుతి స్మృతి పురాణేతిహాసాలూ కావ్యాలూ ధర్మశాస్త్రాలూ మానవజాతి జీవితానికి అభ్యుదయ మార్గమును చూపినరీతికి ఈ గ్రంథం నిర్మలాదర్శం.

ఎన్నికలూ, పరిపాలకులూ కూడా దీనిలో కనిపిస్తారు. గ్రంథం అంతా ఓపికగా చదివి తెలుసుకోవలసేదే. ముఖ్యంగా సాంఘిక, సంస్కార ప్రకరణాలు తల్లిదండ్రులూ, బాలబాలికలూ, గురువులూ విద్యార్థులూ, పరిపాలకులూ నిత్యమూ పారాయణ పద్ధతిని పఠింప వలసేవి. నేటి దొరతనం గురించి శాస్త్రిగారు చేసిన విమర్శ ప్రజలకు కర్తవ్యసూచికగా ఉన్నది.

ఒకనాటి భారతదేశం ఈనాడు ఎలా దిగజారిపోయిందో ఈ గ్రంథం చదివితే తెలుస్తుంది.

నిత్య జీవిత విధానం తెలుసుకోవాలంటే యీ కృతి పాణి భూషణమై ఉండాలని నా అభిప్రాయం.

వివాహధర్మాలూ, గార్హస్థ్య జీవితసరణి సప్రమాణంగా వివ రించారు కనుక ఎవ్వరూ ప్రత్యాఖ్యానం చెయ్యలేరు.

ఈ గ్రంథం శాస్త్రిగారి బహుముఖ శాస్త్రవైదుష్యమునకు సుప్రతీక. ఆంధ్రదేశమునందు ఇంటింటా సాదరంగా ఉంచుకోవలసిన విశిష్టకృతి.

# రమణ సన్నిధిలో....

[రచయిత: డా॥ ముద్దాళి సుబ్బారావు; ప్రతులకు: (1) రచయిత పేర-2-2-648/157, సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ - హైదరాబాదు 500 013 (2) శ్రీరమణాశ్రమము-పి.ఓ. తిరువణ్ణామలై 606 603 వెల: రు. 8/-]

శ్రీ మునగాల ఎస్. వెంకటరామయ్య ఆంగ్లగ్రంథానికి ఇది అనువాదం. భాష, శైలి స్వతంత్ర గ్రంథముగానే తోస్తుంది. తనకు రచనకి సంబంధించి ఏమాత్రమూ అర్హతా, శక్తి లేవని సుబ్బారావు గారు అన్నారేగాని యింత నింపుగా సొంపుగా వ్రాయడం అర్హతా, శక్తి లేనివారికి సాధ్యంకాదనీ ఆ మాట ఆయన సౌజన్యానికి చిహ్నం అనిన్నీ అనుకున్నాను.

స్కందాంశ సంభూతుడు రమణ భగవానుడని గణపత్యంశ సంజాతుడు వాసిష్ఠ గణపతి ముని నిర్ణయం.

రమణ మహర్షిలో దక్షిణామూర్తి స్వభావం కూడా ఉందని యోగుల మాట. గణపతి మునికి 'అహం' స్వరూప స్వభావాలను రెండు మాటలతో వ్యాఖ్యానించిన ఈశ్వరవాణీమూర్తి రమణమహర్షి.

తెలిసినవారికి సోదాహరణముగా తెలియనివారికి చిన్న చిన్న ఉదాహరణలతోను చెప్పి చేసి దారిచూపే అంతశ్శక్తికి అపురూపమైన గురుమూర్తి రమణ భగవానుడు.

ఈ గ్రంథములో వివిధ జిజ్ఞాసువులకు భగవానుడు చేసి చెప్పిన బోధలు పదారు శీర్షికల విషయ సంపుటిలో కనిపిస్తాయి. వాటిలో భారతీయులూ, పాశ్చాత్యులూ, స్త్రీలూ, పురుషులూ పశువులూ పక్షులూ దర్శనమిస్తాయి. 'ప్రసాదం' 'విగ్రహార్చన' లాంటివి ఆశ్చర్యమునూ అంతరతత్వమునూ బోధిస్తాయి.

అన్నిటికీ భగవద్గీతాదుల ఉపాధి కూడా పాఠకునికి ప్రామాణికతను తెలుపుతుంది.

ప్రత్యక్షానుభూతితో పరోక్షానుభూతి కలిగించే ఉత్కృష్ట తాత్విక విషయరాశి అని చెప్పదగిన కృతి.

**యామిజాల పద్మనాభస్వామి**

# విశాలాంధ్ర వారి ప్రచురణలు

1. **తెలంగాణ-సాయుధ పోరాటం అనుభవాలు, జ్ఞాపకాలు** (వెల : రూ. 5-00)
2. **చారిత్రాత్మక తెలంగాణా పోరాటం** (వెల : రూ. 3-00)

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు
ప్రవేశించలేవు కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా
చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు
ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని
పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది.
అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు
ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

757-T6

**3. చైనా విప్లవంలో రైతాంగం** (వెల : రూ. 4-00)

**4. మహత్తర అక్టోబర్ విప్లవం — చారిత్రక అనుభవాలు** (వెల : రూ. 3-00)

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్ 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001

1 దొడ్డా నరసయ్యగారు రచించిన తెలంగాణా సాయుధ పోరాటం - అనుభవాలు, జ్ఞాపకాలు అనే పుస్తకం పై నాల్గింటిలో కొంచెం పెద్దది (76 పేజీలు). ఈ పుస్తకంలో నరసయ్యగారు హైదరాబాదు సంస్థానంలో హిందువుల భాషా సంస్కృతులను నాశనం చేయడానికి ముస్లింలు ఎలా ప్రయత్నించిందీ, జాగిర్దార్ల దోపిడి, దేశముఖుల దౌర్జన్యం, అణగారిన ప్రజల బానిసత్వం మొదలైన విషయాలను వివరించారు. నైజాం నవాబు ఇత్తెహాదుల్ ముస్లిమాన్ స్థాపించి హిందువులను ముస్లింలుగా మార్చటం, కాశిం రజ్వీ గూండా పనులూ - ఇవన్నీ ఈ పుస్తకంలో ఉన్నాయి ఆంధ్ర మహాసభ అవతరణ, జాతీయోద్యమ ప్రభావం, ఆంధ్ర కమ్యూనిస్టుల కార్య కలాపాలు ఈ పుస్తకం ద్వారా తెలుస్తాయి. తెలంగాణా పోరాట చరిత్ర తెలుసు కోవాలనుకొనేవాళ్ళు ఈ పుస్తకం చదువుకోవచ్చు. నరసయ్యగారి ఆకర్షణీయమైన శైలీ, సామాన్యుల ప్రాణార్పణ సంఘటనలూ ఈ పుస్తకాన్ని తుదముట్టా చదివిస్తాయి. ఇందులో కొన్ని వాక్యాలు ఇప్పటి కమ్యూనిస్టుల కెంతో ఉపయోగిస్తాయి కమ్యూనిస్టు గూడా పాముకాటుకు మంత్రాలు వేయించుకోవడం వంటి సత్యాలు దాచిపెట్టక, ఈ పుస్తకంలో వ్రాయడం అభినందనీయం 20 కిలో మీటర్లు అంటే 3.4 మైళ్ళు అని వ్రాయడం పాఠకులను తికమక పెడుతుంది

2. చారిత్రాత్మక తెలంగాణా పోరాటం : పైనచెప్పిన దొడ్డా వారి పుస్తకాన్ని చదివిం తరవాత ఈ పుస్తకం చదివితే చప్పగా ఉన్నట్లనిపిస్తుంది. ఇందులో చంద్ర రాజేశ్వరరావు గారి చరిత్రాత్మక తెలంగాణా పోరాటం, డా. రాజ బహద్దూర్ గౌడ్ గారి తెలంగాణా రైతాంగ విప్లవోద్యమం, నల్లమల గిరిప్రసాద్ గారి తెలంగాణా పీడిత ప్రజల పోరాట సాహసగాథ అనే మూడు వ్యాసాలున్నాయి ఇందులో తాబేదార్లు, కర్తలేని ఫ్యూడల్ దోపిడీ, మెజారిటీ రైతాంగం విప్లవ ప్రతిఘాత శక్తులూ మొదలైన కమ్యూనిస్టులకు ఇష్టమైన మాటలు మాత్రం బోలెడున్నాయి. ఈ రెండు పుస్తకాలూ చదివి నేటి కమ్యూనిస్టులు త్యాగం, నిజాయితీ మొదలైన సద్గుణాలు అలవరచుకుంటే ప్రజలకు మళ్ళా కమ్యూనిస్టులంటే కొంత ఆదరణభావం గలగవచ్చు.

3. చైనా విప్లవంలో రైతాంగం అనే పుస్తకాన్ని వి. ఐ. గ్లునిన్, ఎ. ఎస్. ముగ్రుజిన్‌లు రచించారు. యం. సుబ్బారావు గారు అనువదించారు. చైనా విప్లవంలో రైతాంగం, రైతాంగ సమస్యలపై చైనా కమ్యూనిస్టుపార్టీ సాధారణ సూత్రీకరణ మొదలైన విషయాలు ఇందులో ఉన్నాయి సంస్కృత సమాసాలతో సామాన్యులకు కొరుకుడు పడని కఠిన భాషలో రచన సాగింది. చైనా విప్లవంలో రైతుల పాత్రను గూర్చి తెలుసుకుందామనుకొనే వారికి ఈ పుస్తకం ప్రయోజనకరం

4 మహత్తర అక్టోబర్ విప్లవం చారిత్రక అనుభవాలు అనే ఈపుస్తకాన్ని ఈడ్పుగంటి నాగేశ్వరరావు గారు రచించారు. ఇందులో బోల్షివిజం అవతరణ, చారిత్రక ప్రాధాన్యత, 1917 ఫిబ్రవరి విప్లవం అనంతర పరిస్థితి, సృజనాత్మక మార్క్సిజం - బోల్షివిక్ విప్లవం, బోల్షివిక్ విప్లవం నియంతృత్వాన్ని సృష్టించిందా, ప్రజా స్వామ్యం, సోషలిజం, విప్లవం, అక్టోబర్ విప్లవం - ఐక్య సంఘటన ఎత్తుగడలు, నూతన తరహాపార్టీపై లెనిన్ బోధ అనే శీర్షిక లున్నాయి. సిద్ధాంతం లుప్తమయితే, విప్లవకర ధోరణి అస్తిత్వాన్ని కోల్పోతుంది. అనివార్యంగా అది, ఇప్పుడు కాకపోతే రేపటికైనా రాజకీయ దివాళాకోరు పంథాకు దారి తీస్తుంది-అని లెనిన్ చేసిన హితబోధను ఈ రచయిత గుర్తు చేశారు కమ్యూనిస్టులకు ఇది ఉపయోగ పడుతుంది.

## బహుముఖ ప్రజ్ఞాశాలి డాక్టర్ పట్టాభి

త్రివేణి సంపాదకులు డాక్టర్ భావరాజు నరసింహారావు గారు రచించిన ఈ పుస్తకాన్ని ఆంధ్రాబ్యాంక్ పౌర సంబంధాల విభాగం, వారి ఉద్యోగుల ప్రయోజనార్థం ప్రచురించింది. మంచి కాగితం పైన అందంగా అచ్చు వేశారు. ఇందులో డాక్టర్ పట్టాభి జీవిత విశేషాలూ, ఆంధ్రా బ్యాంక్ పుట్టు పూర్వోత్తరాలూ ఉన్నాయి. భావరాజుగారు చక్కని శైలిలో పట్టాభిగారి బాల్యం, విద్యాభ్యాసం మొదలైన విశేషాలను వివరించారు ఇందుతో ఉన్న ఉక్తులూ, చతురోక్తులూ ప్రత్యేక ఆకర్షణ. మేధావి, మహానాయకుడు, ఉత్తమ కార్యకర్త, బ్యాంకింగ్ సహకార ఉద్యమాల స్థాపకుడు, గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త, ప్రజా సేవకుడు, ఆదర్శజీవి, బహుభాషా వేత్తా అయిన డాక్టర్ పట్టాభి జీవితాన్ని రచించిన, ప్రచురించిన వారికి అభినందనలు.

—పులిచెర్ల సాంబశివరావు

## లాల్ బనో గులామీ ఛోడో బోలో వందే మాతరం

[ఎస్. కె. వెల : రూ. 2-00, ప్రతులకు 1) సృజన; హనుమకొండ-506 001 2) పీస్ బుక్ సెంటర్ .-5-421, సుల్తాన్ బజార్; హైదరాబాద్-500 001.]

ఇది ఒకే ఒక దీర్ఘ కవిత. ఈ కవితకు కె. బాలగోపాల్ ఒక పెద్ద భూమికను రాశారు. దానికి దేశభక్తి అని పేరు పెట్టారు.

వారి వ్యాసంలో ఆర్. యస్. యస్. 'దేశభక్తి'ని గురించి దాని వెనుక నున్న ఫ్యూడల్ తత్త్వాన్ని గురించి విపులంగా చర్చించటం జరిగింది. ఒక రకంగా ఈ ముందుమాట గోల్ వాల్కర్ ప్రవచనాలకు రాడికల్ దృక్పథంలోంచి రాసిన ప్రతివచనాలు. ఆర్. యస్. యస్. కు, కమ్యూనిస్టుకు అందులోనూ విప్లవ కమ్యూనిస్టుకు మధ్య రాజీ ఎప్పుడూ ఉండదు. 'దేశభక్తి' 'జాతీయత' మొదలైన శబ్దాలకు ఫ్యూడలిస్టులు తమ వర్గ ప్రయోజనానికి అనుకూలంగా సంకుచితార్థాలను ఎట్లా కలిపిస్తారో బాల గోపాల్ తన ముందుమాటలో స్పష్టం చేశారు. "బ్రిటీష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా జరిగిన జాతీయోద్యమంలో బూర్జువా జాతీయ వాదమే కాకుండ విప్లవ జాతీయ వాదం కూడ వుంది. బ్రిటీష్ సామ్రాజ్య వాదపు ప్రత్యక్ష పాలనను తొలగించి బడా బూర్జువా వర్గం చేతిలో పాలనను పెట్టడం బూర్జువా జాతీయ వాదమైతే, స్థానిక దోపిడీకి వ్యతిరేకంగా కదిలిన ప్రజలే సామ్రాజ్య వాదాన్ని సహితం తొలగించగలరన్నది విప్లవ జాతీయ వాదం" అని బాలగోపాల్ గారు చెబుతూ ఆ విప్లవ జాతీయవాదానికి ఈ కవితను ఉదాహరణగా పేర్కొన్నారు.

ఈ కవిత రెండవ ముద్రణ యొక్క అవతరణను గురించి రాడికల్ విద్యార్థి సంఘం వారు "మాకు తెలిసినంత వరకూ వచన కావ్యం పునర్ముద్రణ పొందడం యిదే మొదటి సారి. త్వమేవాహం, తెలంగాణా వంటివి మళ్ళీ అచ్చు అయినా ఈ తరం చారిత్రక దృష్ట్యా అయినవి. కాని ఈ కవిత ఈ నాడు 'హిందూ రజాకార్ల' ఎదుర్కొనే విప్లవోద్యమ క్రమంలో ఆయుధంగా, — అంటే చారిత్రక నిర్మాణంలో భాగంగా.... పునర్ముద్రణ పొందుతున్నది" అని చెప్పారు.

"శిరస్సు వున్నతమని
భుజాల బరువుల మీద
ఆలోచనకు కిరీటం మొలిచినపుడే
అఖండాలు ఖండాలైనవి
ప్రపంచం రెండుగా చీల్చబడ్డది."

మేధస్సుకి, శారీరక శ్రమకి మన దృక్పథంలో గల వ్యత్యాసాన్ని ఈ పాదాలు చెబుతున్నై. శ్రమను కిందకు నెట్టి మేధ పైకెక్కటం వల్లనే మానవ సమాజంలో వర్గాలు ఏర్పడ్డాయనే భావం ప్రపంచం రెండుగా చీల్చ బడ్డది అన్న పాదంలో వ్యక్తమైంది. ఈ రెండు వర్గాలలో ఒకటి పీడిత వర్గం, రెండవది పీడింపబడే వర్గం ఆకలిని గురించి, అశాంతిని గురించి రాసే కవిత్వమంతా నినాద కవిత్వమనే ప్రచారం ఒకటి ప్రబలంగా సాగుతోంది ఇప్పుడు. అట్లాంటి ప్రచారకులు ఈ కవితను తప్పని సరిగా చదవాలి.

ఈ దేశం అనాదిగా స్త్రీ కిచ్చిన గౌరవాన్ని గురించి, వాళ్ళకు చేసిన సత్కారాలను గురించి ఈ కవితలో కవి చెప్పిన తీరు కొంత మందికి వాస్తవ విరుద్ధంగా కనబడవచ్చు. కాని కళ్ళు తెరిచిన మనిషికి ఇది పరమ యదార్థంగా కనబడుతుంది.

నాదేశపు స్త్రీల సౌష్టవం
కమ్చీలతో కొలువ బడ్డది
శరీరం మాంసం అంగాంగం
క్రరలతో, సలాకులతో పొడవబడి
విలువ కట్ట బడ్డది
నాదేశపు స్త్రీల సౌందర్యం
బానిస సరుకుగా
నడిబజార్లో నిలబెట్ట బడ్డది
అమ్మ బడ్డది
యజమానులకు దాసిగా
రాజులకు దేవదాసిగా
దొరలకు భోగందిగా
ఉంపుడు గత్తిగా
యీ దేశపు ఆడది
అయితే పడక గదిలో
కాకుంటే పనిలో
పంచుకోబడ్డ వస్తువైంది
భోగమైంది,
నాదేశపు స్త్రీ
పలు తెంపుల గంజాట నామ్యగమైంది

అట్లాగే జాతిలో ఒక్కొక్క శక్తి ఏవిధంగా ఈ భూస్వామ్య, పెట్టుబడిదారీ నాగరి కతలకు, దౌర్జన్యానికి బలైపోయాయో ఈ కవి చెప్పిన తీరు నినాదం కాదు అక్షరాక్షర కవిత్వం. దేశాన్ని తల్లితో ఉపమించి బిడ్డడికి తల్లి ఆస్తిని దూరం చేసిన రాక్షస జాతిని గురించి ఈ కవి చెబుతున్నాడు.

నా తల్లి నా కెప్పుడూ పేదగానే ఉన్నది
ఎప్పుడూ నాతల్లి నాకోసం చిక్కి శల్యమై ఉన్నది
నా తల్లి స్తన్యం
ఎప్పుడూ నా గుక్కనిండా పాలు తాపలేదు
నా తల్లి కష్టం
ఎప్పుడూ నా కడుపునిండా గంజి తాపలేదు
మరి దాని స్తన్యం పొంగింతా ఎవరి పాలయింది
ఏ యినుప ముక్కుల డేగ
తన కాళ్ళతో నా కడుపు తన్నింది

ఈ మాటల్లో ఉన్న ధ్వని కవిత్వాన్ని శిఖరాయ మానస్థితికి తీసుకు వెళ్ళింది.

ఈ కవికున్న దేశభక్తికి, జనం మీదగల మమకారానికి, తిరుగులేని కవితా శక్తికి ఈ పదాలు చాలు.

ప్రజలే చరిత్ర నిర్మాతలు
సగౌరవాల గర్వాల చరిత్ర నా దేశానిది
నా దేశాన్ని చూచి నేను గర్వపడతాను
కన్నీళ్ళతో తడిసిన చరిత్ర
రక్తాలతో తడిసిన చరిత్ర
నాదేశ చరిత్ర అంతా రైతాంగ పోరాటాల చరిత్ర
రైతు బిడ్డల త్యాగాల చరిత్ర
సామ్రాజ్యవాదులూ
జాతీయ గర్వాంధులూ
భూ కామందులూ
నాతల్లి ఒంటిమీద చేసిన గాయాలనే కాదు
నాతల్లి బతుకుమీద చేసిన మచ్చల్ని కూడా
నేను నా రక్తాల ధార దోసిల్తో కడిగేసు కుంటాను.

# కవుల కలాల్లో

[సంకలన కర్త: ఉత్పల వరదరాజా, వెల : రు. 4-00లు, ప్రతులకు : కార్యదర్శి : జిల్లా విభాగం; సాంస్కృతీ సమాఖ్య; పొన్నూరు - గుంటూరు జిల్లా.]

సాంస్కృతీ సమాఖ్య రాష్ట్ర స్థాయిలో వృద్ధి చెందుతున్న సాహిత్య సంస్థ. ఈ సంస్థ ప్రతి జిల్లాలోనూ తన శాఖలను అభివృద్ధి పరచి యువకులలో సాహిత్యాభిలాషను, రచనాభిలాషను కలగ జేస్తూ వారి రచనలను సంకలనాలుగా అచ్చువేసే కార్యక్రమాన్ని చేపట్టింది. ఆ కార్యక్రమంలో గతంలో చాలా కవితా సంకలనాలు వచ్చినై. ఇప్పుడు ఈ సంకలనం గుంటూరు జిల్లా శాఖవారు ఉత్పల వరద రాజా సంపాదకత్వంలో ప్రచురించినది.

ఇందులోని కవులందరికి కవిత్వం రాయాలనే కాంక్ష తీవ్రంగా ఉన్నట్టుగా కనబడుతోంది. ఆ కాంక్షకు అక్షర రూపం ఇచ్చేటప్పుడు చాలామంది కనీస జాగ్రత్తలు కూడా తీసుకోలేదు. ఎట్లా రాసినా కవిత్వ మవుతుందనే 'అహంకృతి' కొంత అమాయకత్వం కొంత కొంతమంది చేత కవిత్వం రాయిస్తై. ఉదాహరణకు—

కలికిని కాలరాసే కలి యుగమా !
కలికి కన్నీళ్ళు ప్రవహించే కలి యుగమా,
కన్నెను కామంతో కాటేసే కాల సర్పమా,
అవనిలో అటివలో అమ్మను, అక్కను
చూడని యుగమా.

మగువను మనసున్న మనిషిగా
మక్కువగా చూడాలి.
ప్రతి యువకుడు రాముడై
రామ యుగం రావాలి.
ఆడపడుచుల ఆనందమే అవనికి
అరుణోదయ యుగం.

అనే కె. విశ్వలత గారి ఖండికను తీసు కొందాం. ఇందులో రెండు భాగాలున్నై. మొదటి ఐదుపాదాలూ ఒక భాగం, చివరి ఆరు పాదాలు రెండో భాగం. ఐదుపాదాల్లో ఆ ఎత్తుగడకి, ఆరుపాదాల్లో ఆమె చెప్పిన నీతులకి కవితా ఖండికగా పొంతన లేదు. చివరి ఆరు పాదాలు ఉత్త వచనం, సాదా వచనం. ఖండికలో భావ సమగ్రత, భావుకతా సమగ్రత లేకపోతే అది కవిత్వంకాదు. మరేదైనా కానీంది.

చల్లా విశ్వనాథం గారి 'విప్లవ కిరణాలు' ఖండిక కవిత్వాన్ని చదువు తున్నామనే స్పృహను కలిగిస్తుంది. ఈ స్థాయి ఉన్న ఖండికలను ఒక సంకలనంగా వేస్తే అట్లాంటి సంకలనాలు తప్పని సరిగా బతుకుతై. కొత్తగా కవిత్వం రాస్తున్న వాళ్ళను నిరుత్సాహ పరచవలసిన పనిలేదు. 'రాయనీయండి. ఒకస్థితికి చేరిం తరువాత కవితలు అచ్చువేయండి' అని సంకలన కర్తలకు, సంపాదకులకు మనవి చెయ్యవలసి వస్తుంది. సమాజంపట్ల ఎరువు తెచ్చుకొన్న 'సామాజిక స్పృహ' ఒక్కటే కవిత్వం రాయటానికి ఆధారం కాదని గ్రహిస్తే మంచిది.

సాంస్కృతిక సమాఖ్య చేస్తున్న కృషిని ప్రతి ఒక్కరూ మెచ్చుకోవలసిందే. అయితే వారు వేస్తున్న కవితా సంకలనాల విషయంలో వారు పునరాలోచించు కుంటే మంచిది.

**టి. యల్. కాంతారావు**

---

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247.